సాహిత్య

# ప్రస్థానం

ఏప్రిల్ 2011

వెల రూ. 10



ఫైజ్ అహ్మద్ ఫైజ్

శతజయంతి

సాహితీ స్రవంతి



# తరాల వారధి
# కె.ఎల్. నరసింహారావు

మార్చి 16న ఖమ్మంలో కనుమూసిన సీనియర్ కమ్యూనిస్టు నాయకుడు కె.ఎల్. నరసింహారావు ఉద్యమంలో వివిధ తరాల మధ్య వారధిలాంటి వ్యక్తి. స్వాతంత్ర్యోదమ కాలంలో పోరాట బావుటా చేపట్టి ఆంధ్ర మహాసభ నాయకుడిగా వీర తెలంగాణా సాయుధ పోరాటంలో పాల్గొన్న యోధునిగా కె.ఎల్. నిర్వహించిన కృషి విశిష్టమైనది. శాసనసభకు వరుసగా ఎన్నికై ప్రజా సమస్యలు వినిపించిన నిరాడంబర ప్రజా ప్రతినిధి. నమ్మిన సామ్యవాద ఆశయ సాధనకు అఖరి వరకూ అంకితమైన నిబద్ధ కార్యకర్త. కమ్యూనిస్టు ఉద్యమ అగ్రనేతలతోనూ వీర తెలంగాణా సాయుధ పోరాట యోధులతోనూ అత్యంత సన్నిహితంగా మెలిగిన అనుభవశాలి. కొండపల్లి లక్ష్మీ నరసింహారావు పూర్తి పేరు అయినా కె.ఎల్ గా ప్రజా జీవితంలో ప్రతిష్ఠితుడయ్యాడు.

కె.ఎల్. ఇల్లెందు తాలూకా ఆంధ్ర మహాసభ కార్యదర్శిగానూ కమ్యూనిస్టు పార్టీ బాధ్యుడుగానా పనిచేశారు. అక్రమ లెవీ, దోపిడీకి, వెట్టి చాకిరీకి వ్యతిరేకంగా ఉద్యమం నడిపి నిజాం ప్రభుత్వంలో జైలు శిక్ష అనుభవించారు. వీర తెలంగాణా పోరాటానికి నాందిగా పరిగణించే దొడ్డి కొమరయ్య బలిదానం వార్త విని చలించి పోయారు. జైలు గోడల మధ్యనే అమరజీవివి నీవు కొమరయ్యా అందుకో జోహార్లు కొమరయ్య అన్న పాట రాశారు. అది అంతటా ప్రతిధ్వనించింది కాని రచయిత కె.ఎల్. అని చాలా మందికి తెలియదు.

ఆయన రాసిన పాట ప్రస్థానం పాఠకుల కోసం ......

## అమరజీవి దొడ్డి కొమరయ్య

అమరజీవివి నీవు కొమరయ్యా!
అందుకో జోహార్లు కొమరయ్యా!

న్యాయమన్నదిలేని - నైజామురాజ్యాన
విశ్వరాక్షసుడైన - విసునూరు దేశముఖ్
పాలించుచున్నయా - పల్లె 'కడవెండి'లో-

ప్రజల హక్కులకొరకు కొమరయ్యా!
ప్రాణాల నిచ్చావు కొమరయ్యా!

లంచగొండుల అండ దేశముఖులకునుండ
న్యాయరక్షణ కొరకు నడుము బిగించితివి
గుండాల తుపాకి గుండ్ల కెదురుగపోరి
బలియైన తెలుగోడవోయ్ కొమురయ్యా!

నీవె మా కెల్లపుడు కొమరయ్యా!
మార్గదర్శిగవుండు కొమరయ్యా

నిన్ను బలిగొన్న ఆ నీచులను దునుమాడి
నిన్నుగన్నట్టి ఈ తెలుగుగడ్డను మేము-
స్వాతంత్ర్యముగజేసి, శాంతించెదముగాని

నీ పేరు నిలుపకనే కొమరయ్యా!
నిదురైన మేంబోము కొమరయ్యా!

PRSUM02A126

సాహిత్య ప్రస్థానం

సంపుటి : 12 ఏప్రిల్ 2011 సంచిక : 64

# దాచేస్తే దాగని సత్యాలు

వికీలీక్స్ పత్రాలను హిందూ పత్రిక వెల్లడిస్తున్న కొద్దీ దిగ్భ్రాంతికరమైన వాస్తవాలు వెల్లడవుతున్నాయి. ఈ దేశ సార్వభౌమత్వాన్ని అమెరికా సామ్రాజ్యవాద వ్యూహాలకూ, గుత్తాధిపతుల ప్రయోజనాలకు ఫణం పెట్టే ప్రక్రియ అత్యున్నత స్థాయిలో సాగిందన్న వాస్తవం పాలక ప్రతిపక్ష ప్రముఖుల, అధినేతల, అధికారుల మాటల్లోనే బహిర్గతమవుతున్నది. విదేశాంగ విధానం విషయంలో గతంలోనూ, ప్రస్తుతమూ కేంద్రాన్ని పాలించిన కూటముల మధ్య తేడా లేదని కూడా తేలిపోతున్నది. దీనిపై పార్లమెంట్‌లో సజావుగా చర్చించే బదులు ఎదురు దాడులతో దాటేయడం సందేహాలను పెంచుతున్నది. మతోన్మాద రాజకీయాలు ఎన్నికల అవసరాల కోసమేనన్న మాట కూడా ఆ శక్తుల నోటి నుంచే వచ్చినట్టు వికీలీక్స్ ధృవపరుస్తుంది. కనుక వాటి విలువ ఎంత అనే మీమాంస వదిలిపెట్టి వాటి ద్వారా బట్టబయలవుతున్న భయానక సత్యాలపై దృష్టి సారించడం తక్షణావసరం. ఇది దాచేస్తే దాగని సత్యం.

... ... ...

లిబియాపై మొదట అమెరికా ఇప్పుడు నాటో పేరుతో ఫ్రాన్స్ సాగిస్తున్న దురాక్రమణ యుద్ధం మరోసారి ఇరాక్ తరహా పరిస్థితిని గుర్తు చేస్తున్నది. లిబియా అధ్యక్షుడు గడాఫీపై తిరుగుబాటు ఆయన ప్రతిస్పందన ఆ దేశ అంతర్గత వ్యవహారాలు తప్ప విదేశాల దాడికి అది సాకు కాదు. ఇదే సమయంలో బహ్రెయిన్ వంటి చోట ఇంతకంటే సనాతనమైన రాచరిక పాలనను కాపాడేందుకోసం తన మిత్ర రాజరిక దేశమైన సౌదీ అరేబియాను పురమాయించిన అమెరికా కూటమి లిబియాలో మాత్రమే ప్రజాస్వామ్య పరిరక్షణ మంత్రం జపించడం చమురు భూమిలో పట్టు పెంచుకునే పాచిక మాత్రమే.

... ... ...

హైదరాబాద్ టాంక్‌బండ్‌పై మార్చి 10న సంస్కర్తలు, కవులు, రచయితల విగ్రహాలను విధ్వంసం చేయడం అప్రజాస్వామికమైన అరాచక చర్య. ఇది ప్రజల ఆగ్రహమంటూ సమర్థించడమూ సమంజసం కాదు. ఫాసిస్టు తరహా శక్తులను గుర్తు చేసే ఈ చర్యను ప్రాంతాల తేడా లేకుండా ప్రజాస్వామిక వాదులందరూ ఖండిస్తారు. ఇందుకు కారకులైన వారిపై చర్య తీసుకోవడంతో పాటు భవిష్యత్తులో రాజధానిలో తెలంగాణా యోధులు, కళాకారుల విగ్రహాలను నెలకొల్పేందుకు సన్నాహాలు చేయాలి. ప్రాంతాల మధ్య ఉద్రిక్తతలు పెంచే ధోరణులను విరమించి రాజకీయ రాజ్యాంగ పరిష్కారానికి కేంద్రం ప్రకటన చేయాలని ప్రతివారూ కోరుకుంటారు.

... ... ...

అమరజీవివి నీవు కొమరయ్యా అంటూ తెలంగాణా సాయుధ పోరాట తొలి అమరుడిపై పాట రాసిన కె.ఎల్. నరసింహారావు ఇటీవల మరణించారు. వారికి ప్రస్థానం జోహార్లర్పిస్తుంది.

బొమ్మలు : శివాజి, వెంకటేష్

## ఈ సంచికలో...



సంపాదకవర్గం

తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వీరప్రసాద్
హిమజ్వాల

కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా

సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in
ssprasthanam@gmail.com
www.prasthanam.com

కథ

# చూరు మరిచిన పిచుక



- సంజన అనుశ్రీ

**నగరాలలోని కాలుష్య కాసారాలను, హారన్ల మోతలను, పైపై పలకరింపులను, మోసాలను అన్నింటిని దాటిపోయి చాలా సేపయింది. ఎక్కింది ఎర్ర బస్సయినా, రోడ్డు మీద రద్దీ లేకపోయేసరికి డ్రైవర్ బాగానే తొక్కుతున్నాడు. చిటపటలాడిన ఎండ చల్లబడుతుంది. నీడలు పొడవుగా సాగుతున్నాయి.**

రోడ్డుకు అటువైపు ఇటువైపు ఉన్న గుట్టలు దిగి పశువులు ఇంటి దారి పడుతున్నట్టుగా తోస్తుంది. వాసన మారిపోయింది - దృశ్యం మారిపోయింది - శబ్దం మారిపోయింది, స్పర్శ హాయిగా ఉంది. రోడ్డుకు ఇరువైపులా చెట్టపట్టాలు వేసుకొని ఉన్న చెట్లను చీల్చుకుంటూ బస్సు వేగంగా వెళ్తుంటే ఆకుపచ్చని గుహలోకి జారిపోతున్నట్టు అనిపిస్తుంది. ఆ హాయి నిద్రగా మారి ఎప్పుడో కన్నంటుకున్నట్టుంది. "సముద్రాల! సముద్రాల" అన్న కండక్టరు గట్టి అరుపు విని ఉలిక్కిపడి లేచాను.

ఒక్కదాన్నే ఉంటానేమోనని భయపడుతూ బస్సు దిగుతుంటే, నాతోపాటు నలుగురు పెద్దవాళ్ళు దిగారు. భయం కరిగిపోయింది. "ఎవలింటికి పిల్లా? ఒక్కదానివె దిగినవ్" అని ఒక ముసలావిడ పలకరించింది. "దామోదర్ సార్ వాళ్ళింటికి నేను వాళ్ళ మనవరాలిని" అని నేను వెనుక నెమ్మదిగా నడుస్తుంటే మళ్ళీ ఆమే "యెనకబడకు బిడ్డా, నడిమిట్లకు రా!" అని తన ముందుకు వచ్చేటట్టుగా లాగింది.

చుట్టూ పచ్చని పైర్లు. పొట్టకొచ్చిన వరి పోలాల్లోంచి గాలి మెల్లగా వచ్చి కబుర్లాడుతుంటె మనసు తేలికైపోతూంది. పట్టణంలో బాధలన్నీ వదిలేసి పల్లెకి మకాం మారిస్తే ఎంత బాగుంటుందో అని అనిపించింది. ఇంకొక కిలోమీటరు వెళ్తేగాని బామ్మ, తాతయ్యలను చూడలేను. దారంతా ఆ ముసలామె నాతో ఎన్నో రోజుల పరిచయం ఉన్న దానిలా ఏదో మాట్లాడుతూనే ఉంది. మా ఎదురపార్టుమెంట్లో ఉన్న ఆంటీతో కూడా ఇన్ని రోజుల్లోనూ ఇంతసేపు మాట్లాడి ఉండలేదేమో బహుశా. కాంక్రీట్ తోపాటు జీవిస్తే మనుషులకు వచ్చే ప్రత్యేక లక్షణం అదే. ప్రకృతికి దగ్గరగా జీవిస్తే మానవత్వం పరిమళిస్తుంది. మొదట్లో బెరుకు బెరుగ్గా మాట్లాడినా తరువాత నేనూ ఊపందుకున్నాను. మాటల్లో పడ్డామేమో ఊరి దగ్గరికి రానే వచ్చాము. కుడివైపు వాలుదారి ఇంటివైపు తిరిగిపోతూ "బై! అమ్మమ్మా" అని చెప్పగానే "మంచిది బిడ్డా! సల్లంగుండు పోరగాండ్లను సదివిత్తె ఓ లొల్లి, సదివియ్యకపోతే ఓ లొల్లి. రెక్కలొచ్చి ఆళ్ళెగిరిపోతరు. రెక్కలుడిగి ముసలోళ్ళు ఇండ్లళ్ళ సత్తరు" అని ఇంకా ఏదో ఏదో అనుకుంటూ ఆమె వెళ్ళిపోయింది.

.. .. ..

స్నానం చేసాక ఇంటి వెనక తువాల ఆరేస్తుంటే ఏవో గుసగుసలాడుతున్న శబ్దం నన్ను అటేపుగా ఆకర్షించింది. చూస్తే ఆ శబ్దాలు ఓ చెట్టు దగ్గర్నుంచి వస్తున్నాయి, పిచుకలు చర్చించుకుంటున్నాయి. నా దృష్టినే కాదు, చెవులను అటు వైపు పడేశాను.

"అమ్మా!......."

"అబ్బా........."

"ఆ స్థంబాలు, రాకాసి స్థంబాలు......ఏం మాయో ఏందో గాని వాటి దగ్గరికెళితే చాలు ఒళ్ళంతా నొప్పులే నొప్పులు"

"నువ్వు గమనించావో లేదో గాని ఆ రాకాసి స్థంబాల దగ్గరే కాదు ఏ ఊరెల్లినా. ఏ చోటుకెళ్ళినా ఏవో కనీకనపడని సన్నని తీగల వల లాగా అంతటా పారుతున్నట్లనిపిస్తుంది. ఈ స్థంబాలు ఒకటా, రెండా: ఊరూరు, వాడవాడనా వెలిశాయి. మన ప్రాణాలు తోడేయడానికి."

మరో పిచుక వచ్చి, "అవును సుమా ఈ మధ్య కొన్ని రోజులుగా ఏదో సన్నసన్నగా ఒంట్లోంచి పారుకుంటూ వెళ్ళిపోతున్నట్లుగా అనిపిస్తుంది. ఈకలు పీకేస్తున్నట్లుగా, చర్మం ఒలిచేస్తున్నట్లుగా, ఎముకలు కొరికేస్తున్నట్టుగా ఒకటే నొప్పులు"



అన్నిట్లోకి పెద్దగా ఉన్న పిచుక వంతపాడుతూ, "ఇలా బాధపడుతూనే కదా మనోళ్ళంతా కన్నుమూస్తున్నారు. ఒకప్పుడు మనం గుంపులు గుంపులుగా చేరి ఎన్ని ముచ్చట్లు పెట్టుకునే వాళ్ళం. ఎక్కడ చూసిన మనవాళ్ళే కనబడతుండేవారు. గింజలు పండించే మహానుభావుల పుణ్యమా అని మన పూర్వీకులు మంచి బతుకే బతికారు ఇప్పుడా కాలములేదు. ఆ రాజ్యము లేదు, ఆ పంటలూ లేవు, పండించే వాడూ లేడు. మట్టిని నమ్ముకున్నోడు మట్లో కలిసిపోతున్నాడు. మనిషిని నమ్ముకున్న మనం కనుమరుగైపోతామేమో. ఇదంతా ఏమో కాని, మీరన్నట్లు ఈ మనుషులేదో మాయాజాలం చేస్తున్నారు. నాకు కూడా అప్పుడప్పుడు కళ్ళు మూసి తెరుస్తున్నప్పుడు ఏవో మాయా మెరుపు తీగలు కనీ కనపడనట్లు వల వేసి ఉన్నట్టు అనిపిస్తోంది. కానీ నిజానికి అక్కడ ఏమీ ఉండదు."

బుల్లి పిచుకొకటి వచ్చి, "నాకైతే ఎప్పుడూ ఎవరో తలను బండరాయితో కొట్టి, పుర్రెను ముక్కలు ముక్కలు చేస్తున్నట్లు అన్పిస్తుంది. రెండు మూడు సార్లు నోట్లోంచి రక్తమూ కక్కుకున్నాను తెలుసా! చనిపోయిన మన అక్క చెల్లెల్లు, అన్నదమ్ములు దారిలోనే మనమూ ఉన్నామేమోనని భయం భయంగా ఉంది. మనం అలా అవగూడదనుకుంటే ఏదో ఒకటి చేయాలి, ఉపాయం ఆలోచించాలి."

మరో పిచుక కల్పించుకుంటూ మూల్గుతూ "అవునవును, మన తాతలకు తండ్రులకు లేని ఈ బాధ మన తరానికే ఎందుకు కలుగుతుంది. మనుషులు చెవుల దగ్గర ఏదో బుల్లి డబ్బాలు పెట్టుకుని గంటల తరబడి మాట్లాడుతున్నారు చూడు....అదిగో అవి వచ్చినప్పటినుంచే ఈ మహమ్మారి మనల్ని ముసురుకుంది వాటి పని పట్టాలే."

పిచుకల సంభాషణ విన్న తరువాత స్కూల్లో మేడమ్ చెప్పిన విషయాలన్నీ గుర్తొచ్చాయి. పిచుకలు, మనుషుల జీవితాలు ఎలా పెనవేసుకొని పోయాయి, ఊరుకు ఎంత అందాన్ని చేకూర్చాయి, ఆధునిక అభివృద్ధి వల్ల ఎందుకు, ఎలా అంతరించిపోతున్నాయో పక్షులంటే ఎంతో ఇష్టమున్న నా మనసును కలవరపెడుతుంటే ఇంట్లోకి వెళ్ళాను.

బామ్మ పడుకునే దాక ఏవేవో కబుర్లు చెప్తున్నా, చేసిన సర్వపిండి తింటున్నా ఎందుకో పదే పదే పిచుకలే నా మనసులో కిచకిచలాడసాగాయి.

.. .. ..

చుట్టు పక్కల అందరూ, గుమిగూడి మాట్లాడుకుంటూ హడావుడి చేస్తుంటే, ఏడయితే గాని లేవని నేను ఆరు కాకముందుకే డిస్టర్బ్ అయి లేచాను.

సూర్యోదయం చూద్దామని, ఇంటి వెనుక వైపు తూర్పుగనుక అటు పరిగెత్తాను, మళ్ళీ కిచకిచలు.

ఈ విషయాలన్నీ వింటున్న నేను, ఇక ఉండబట్టలేక వాటితో మాట్లాడదామని మెత్తగా అడుగులో అడగేసుకుంటూ వాటి దగ్గరకు పోయి మాట్లాడుదామని ప్రయత్నం చేస్తున్నంతలోనే...

"కిచ్ కిచ్ కిచ్ కిచ్........."

" అమ్మో మనిషి! మనిషి! మనిషి......" అని

వేటకొచ్చిన వాన్ని చూసినట్లుగా భయపడ్డాయి.

మళ్ళీ నేను ఎంతో ప్రేమగా వాటిని ఏమీ చేయను అని అర్థమయ్యేట్టుగా, ఒద్దిగా నా స్వరాన్ని తగ్గించి.

"భయపడకండి నేను మిమ్మల్ని ఏమీ చేయను. పిచుకలంటే నాకెంతో ప్రేమ. నిన్న మీ సంభాషణ అంతా విన్నాను. నాక్కూడా ఎంతో బాధ కలిగింది. మీరు రాకాసిస్థంబాలు అంటున్నారే వాటిని సెల్‌టవర్లు అంటారు. మెరుపులాగా కనబపడుతూ తీగలాగా పారుతుంది అని అనిపిస్తుంది అన్నారే అవి సెల్ రేడియేషన్లు ఇంకా ఇతర రేడియేషన్లు."

నేను చెప్పిన మాటల వల్ల నమ్మకం కలిగినట్టుంది. అవి నాదగ్గరికి వచ్చి సాయం అడిగాయి.

"అమ్మా! నిన్న మా బాధలన్నీ విన్నానంటున్నావు. అవేవో సెల్‌టవర్లు, రేడియేషన్లంటున్నావు. వాటి గురించి నీకు అన్నీ తెలుసును కాబట్టి నువ్వే మా బతుకులు గట్టేక్కే మార్గం చెప్పవూ" అంది వగర్చుతూ వచ్చిన పిచుక, వాటి నాయకురాలు లాగా ఉన్నట్టుంది.

"అవును! చెప్పాలి" అని అక్కడే ఉన్న మిగిలిన పిచుకలన్నీ వంత పాడాయి.

కాసేపు ఆలోచించి "ఇక్కడ కూర్చొని చర్చించటం వృథా మీ జీవితాలను ప్రభావితం చేస్తున్న నిర్ణయాలు నగరాల్లో, యూనివర్సిటీల్లో, కంపెనీల్లో తీసుకోబడుతున్నాయి" అని నేను అంటుండగానే, లీడర్ పిచుక

"అయితే మమ్మల్ని పట్నం పొమ్మంటావా ఏంటి?" అంది విసురుగా.

"అవును! అంతే" అని అన్నాను.

ఇంకా చాలాసేపు మాట్లాడుకున్న తరువాత, అన్నం పెట్టాను తిందువురా అని బామ్మ పిలిస్తే వాటికి బై చెప్పి లోపలికి వెళ్ళాను.

.. .. ..

" ఆ అమ్మాయి చెప్పింది నిజమే మనం ఇక్కడే బాధపడుతూ బతుకీడుస్తే ఏమి ఒరగదు. ఎవరైనా ఒకరు ధైర్యం చేసి పట్టణం వెళ్ళి మార్పు కోసం ప్రయత్నించాల్సిందే" అంది నాయకురాలు.



ఎవరో ఎందుకు? నువ్వే పెద్ద పిచుకవి, నువ్వే వెళ్ళు". అని మిగిలినవి అన్నాయి.

పిచుకల నిర్ణయాన్ని పెద్ద పిచుక ఒప్పుకుంది

సమావేశం ముగిసింది.

పెద్ద పిచుక హైదరాబాదు వెళ్ళాలని అనుకూలంగా ఉన్న ఒక ఇంట్లో గూడు కట్టుకోవాలని, అక్కడి వాళ్ళతో స్నేహం చేసి వాళ్ళలో మార్పు తేవాలని ప్రణాళిక వేసుకొని ఉద్యమానికి, ప్రయాణానికి సిద్ధమయింది.

ప్రయాణం ఎంత దూరమైనా, ఒక అడుగుతో మొదలౌతుంది. చేయవలసిన పని పెద్దదైనా చిరు ప్రయత్నంతో ప్రారంభమౌతుంది.

పిట్ట కొంచెమే అయినా కూత ఘనంగానే కూసింది. అనుకున్నదే తడువుగా పిచుక హైదరాబాదు బైలుదేరింది. ఎగురుతూ ఎగురుతూ పచ్చదనాన్ని దాటి పారిశ్రామిక కాలుష్యాల దగ్గరికి రానే వచ్చింది.

వాసన మారింది - దృశ్యం మారింది - చుట్టూ శబ్దాల హోరు - భరించలేని కాలుష్య గాలి స్పర్శ.

ఒక మంచి మార్పు కోసమే ప్రయత్నం కాబట్టి, అన్నింటిని భరించి, ఎదిరించి పోరాడాలే తప్ప, వెను తిరగకూడదని నిర్ణయం తీసుకుంది.

ఈ ఆలోచనల్లోనే పట్నం చేరుకున్న పిచుక ఒక మంచి ఇల్లు కోసం వెతకసాగింది.

అయిదో అంతస్తు అపార్టుమెంటులో, విశాలమైన వరండాలో రకరకాల పూల మొక్కలు కుండీలు, వాటికి నీళ్ళు పోస్తు ఆ పూలను ముద్దాడుతున్న ఒక అమ్మాయిని చూసింది.

"ఈ ఇల్లు అయితే నాకు సరిపోయేట్టుగా ఉంది" అని మనస్సులో అనుకుని వరండా గోడ నిండా అల్లుకున్న మనీ ప్లాంటు మీద వాలింది.

భయం భయంగా కాసేపు ఆ తీగమీదనే "కిచ కిచ కిచ కిచ ........" అనుకుంటూ తిరిగి, ఆ ప్రదేశం పరిసరాలు నచ్చడం వల్ల అక్కడే గూడు కట్టుకోవాలని నిర్ణయించుకుంది.

ఆ ఇంటి మనుషుల గూర్చి తెలుసుకోవాలని మెల్లగా ఆ అమ్మాయిని మాటల్లోకి దించింది.

"ఇదిగో పాప! చూస్తుంటే మంచి దానిలో కనబడుతున్నావ్ నాతో స్నేహం చేస్తావా?"

ఎవరబ్బా?..........

"ఎవరిది?......ఎక్కడి నుంచి మాట్లాడుతున్నారు."

"ఇక్కడ....పైన.......నేను!పిచుకను!!నాతో స్నేహం చేస్తావా? నీకు రోజూ కథలు కూడా చెప్తా!!

"ఓ .......నువ్వా పిచుక!! నాకు పిచుకలంటే చాలా ఇష్టం తెలుసా! నేను నీతో తప్పక స్నేహం చేస్తా."

"నేను మీ ఇంట్లో గూడు కట్టుకోవచ్చా?

"ఓ...ష్యూర్!"

"నీ పేరేంటి? ఏం చదువుతున్నావ్? ఇంకా ఇంట్లో ఎవరెవరుంటారు?"

" నా పేరు ప్రీతి నేను సెవెన్త్ క్లాస్ చదువుతున్నా ఇంట్లో అమ్మా, నాన్న, నేను అంతే.""..................."

"మరి నీ పేరేమిటి?"

"నా పేరు.... నాపేరు......... మాకు పేర్లుండవుగా."

"అయితే నీకొక మంచి పేరు పెడతాను.

నీ పేరు..........స్పారీ!!! ఓకేనా"

"సరే"

"నిన్ను చూస్తుంటే పల్లెటూరు నుంచి వచ్చినట్టు అనిపిస్తున్నావ్. ఏ ఊరేంటి?"

"సముద్రాల అనే ఊరునించి వచ్చాను."

"ఓహో! అలాగా సర్లే నిన్ను మా ఫ్రెండ్స్‌కి పరిచయం చేస్తాను. ఆదివారం ఉదయం తీసుకువస్తానులే. ఈ లోగా నువ్వు గూడు కట్టేసుకో. బై........"

.. .. ..

మరుసటి రోజు - ఆదివారం ప్రొద్దున ఫ్రెండ్స్‌తో కలిసి టీ.వి చూస్తుంటే ఏదో సన్నగా భయంతో కూడిన ఏడుపు వినిపించేసరికి బాల్కనీ లోకి పరిగెత్తుకొచ్చింది ప్రీతి. అక్కడ స్పారీ ఏడుస్తూ కనిపించింది.

"ఏమైంది స్పారీ ఎందుకేడుస్తున్నావ్."

"..............."

"ఇదిగో చూడు మా ఫ్రెండ్స్ వచ్చారు."

"ఏమీ లేదు ప్రీతీ నాకు ఈ రోజు ప్రొద్దున, ఒక రాకాసి భయంకరంగా, నడుచుకుంటూ వచ్చి మా పిచుకలను కరకరా నమిలి తినేస్తున్నట్టు పీడకల వచ్చింది." పిచుక వణుకుతూ అంది."అసలు నేను పల్లెటూరు నించి ఈ నగరానికి ఎందుకు వచ్చానో తెలుసా? నా తోటి పిచుకలు ఎన్నో విచిత్రంగా చచ్చిపోయాయి. మిగిలిన పిచుకలం రకరకాల ఆరోగ్య సమస్యలతో బాధపడుతున్నాం. జీవితం దుర్భరమైపోయింది. చూరులోని బతుకు వీధిపాలయింది. మా బాధలన్నీ అర్థం చేసుకున్న నీలాంటి దయార్ద్రహృదయం కలిగిన ఓ స్నేహితురాలు

# మార్చి నెల పురస్కారాలు



## మీరెందుకు చచ్చిపోయారు!

కథకు........రూ.700/-

రచయిత : ముక్కామల దేవీ నాగమోహనరావు

## పనిచేసుకోనీయండి



కవితకు.......రూ.500/-

రచయిత : మొయిద శ్రీనివాసరావు

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

మాకో సలహా ఇచ్చింది - పట్నం వాళ్ళలో మార్పుతెమ్మని, ఆలోచన రేకెత్తించమని అందుకే ఇక్కడికి వచ్చాను. ఇదంతా మీరు వాడే సెల్‌ఫోన్లు, వాటి రేడియోషన్ల వల్లనేనని మా మిత్రురాలు అర్థమైయ్యేట్టు చెప్పింది. ఆ రాకాసి స్థంబాల దగ్గరికి వెళితే చాలు విపరీతమైన ఒంటి నొప్పులు, ఒకటే తలనొప్పి కొన్ని పిచుకలయితే రక్తం కక్కుకొని చనిపోయాయి. మిగిలిన పిచుకలూ ఏదో ఒకటి చేయకపోతే మా గుడ్లలోంచి పిల్లలు కూడా సురక్షితంగా పుట్టరేమోనని భయమేస్తుంది. కనీసం అవైనా చల్లగా బతుకుతాయని నా వంతు ప్రయత్నం చేద్దామని, మీ సాయం కోసం వచ్చాను. పొద్దున వచ్చిన పీడకల కదా! నిజమౌంతుందేమోనని భయమేసి ఏడుస్తున్నాను."



అప్పుడు ప్రీతి కూడా తడి కళ్ళతో ఇలా అంది.

"సారీ! నువ్వు భయపడకు నేను నీకు మాటిస్తున్నాను కొన్నేళ్ళలోనే ఎవరికీ ఎలాంటి హాని కలిగించని సెల్ ఫోన్లను తయారుచేస్తాను. నేను ఊరికే అనట్లేదు, మీరు ఎన్ని బాధలు పడుతున్నారో మా స్కూల్లో చెప్తున్నారు. టీవీల్లో చూస్తున్నాం. పేపర్లల్లో చదువుతున్నాం. అసలు సెల్ టవర్లు, వాటి రేడియేషన్లవల్ల మీకే కాదు మాకూ చాలా నష్టాలున్నాయి. ఆ రేడియేషన్ల వల్ల మెదడు దెబ్బతిని బ్రెయిన్ కాన్సర్ వంటి రోగాలు వస్తాయట. గుండెలయ తప్పే ప్రమాదం ఉందట. అందుకే మేము ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా నీకు చెప్పింది చేస్తాము. అప్పటి వరకు మీరు జాగ్రత్తగా ఉండాలి. సెల్ టవర్ల దరిదాపుల్లోకి వెళ్ళొద్దు, వాటి పైన గూళ్ళు కట్టుకోవద్దు పట్టణాలలోకి అంతకంటే రావద్దు. నువ్వు వెంటనే మీ ఊరు వెళ్ళిపో".

"మేమందరం పిచుకల బాగు కోరుకుంటున్నాం" అని అక్కడికి వచ్చిన ప్రీతి ఫ్రెండ్స్ ముక్తకంఠంతో అన్నారు.

"మరీ........నేను...........ఇక్కడ ఇంకొన్ని రోజులు ఉంటాను. ఇంకొందరికి నా ఆవేదన చెప్పుకుంటాను, ఉండనివ్వరూ........మీకు రోజు ఓ కథ చెబుతాను. సరేనా? మిమ్మల్ని అస్సలు అల్లరి చేయను."

"ఓ................అలాగే."

"సరే...........కొన్ని రోజులు ఉందువులే కాని స్వారీ నువ్వు ఎంత త్వరగా వెళితే అంత సురక్షితంగా ఉంటావు."

.. .. ..

"లేమ్మా!లే ...............లే............"

"ఎంత సేపు పడుకుంటావమ్మా. చాలా పొద్దెక్కింది. స్కూలుకి వెళతావా లేదా?"

"స్వారీ!.............స్వారీ!............."

''ఏదీ మమ్మీ! పిచుక!.............స్వారీ!.........."

"పిచుకేంటమ్మా ఏదో కలకన్నట్టున్నావ్ సరే గాని లేచి స్కూలుకు తయారవ్వు."

'అయితే ఇంతసేపటి సంగతంతా కలేనా'

ఎందుకో ఏడుపొచ్చేసింది.

కలలే కమ్మగా ఉన్నాయి.

అమ్మ తరువాత, ఈ చీకటే హాయిగా సేదతీర్చేది.

అబ్బా!!..........

హార్లిక్స్ తాగాలి!

టిఫిన్ తినాలి!

బండెడు పుస్తకాలు మోస్తూ పరిగెత్తాలి!

రోజూ ఇదే తంతు

ప్రశ్నలు.........

సమాధానాలు......

ఎటువైపో......

మళ్ళీ ప్రయాణం మొదలైంది.

ఈ కథ ఎన్నడు ముగిసేనో.....



## మిణుగురుల హత్య

- దేవేంద్ర

కాలం కళ్ళలో కన్నీటి చెమ్మ
వివస్త్రగా తెలుగులమ్మ
ట్యాంక్‌బండ్‌పై నిస్త్రాణగా
తన బిడ్డల అవశేషాల వెతుకులాటలో...
హీనంగా-కడుదీనంగా...

కూలింది బొమ్మలు కాదు
సాంస్కృతికోద్యమ నెలవంకలు
శంకలకు-వంకలకు
నెలవంకలా బలిపశువులు?

మనిషి తాను మనిషిగా మారడానికి
హతం వేసుకున్న తన సహజాతాలకు
ఎంతగా పుటం వేసుకున్నాడో
అయినా పరిణామ మూలాలు
నాటి కన్నా వెనకున్నాయని
అనేకసార్లు గుర్తుచేస్తేనే
అసలు రూపం అద్దంలో కనిపించేది

తెగిపడ్డ మొండాలై కొక్కిరించేది
సామూహిక నేరాలకు శిక్షలుండవు
సామాన్యులకు చరిత్ర మీద కక్షలుండవు
ఇక్కడ కక్షలూ కార్పణ్యాలూ
మనిషిని చీల్చేశాయి
తెలుగుతనాన్ని కాల్చేశాయి

ఎవడి బొమ్మ కూల్చుతున్నారో
కూల్చేటోళ్ళకు తెలుసో లేదో
కూలిన తరువాత- అవి
బొమ్మల్లా లేవు
నను కన్నతల్లి రొమ్ముల్లా ఉన్నాయి.



## సౌందర్యకాంతి

- శైలి

జాతిని మేల్కొల్పిన
వైతాళికులని విన్నాం
తెలుగు సాహితీ సాంస్కృతిక
తేజోమూర్తులని యుగపురుషులని
తెలుసుకున్నాం, చదువుకున్నాం

బంధుమిత్రులతో
తల్లిదండ్రులతో
ఆలు పిల్లలతో సపరివారంగా మీ దివ్య
మంగళ స్వరూపాలను
కళ్ళారా వీక్షించి పులకించి పోయాం

కర్మయోగులుగా మీ కార్యదీక్షతను
కథలు కథలుగా చెప్పుకున్నాం
తరాలు అంతరాలు మరచి
తరించాం తనివితీరా

'తల్లీ నిన్ను దలిచి'
పుస్తకాన్ని తెరచినట్టు

మీ మూర్తిని మదిన
ప్రతిష్టించుకుని
మీ మార్గాన నడిచేందుకు
ముమ్మూర్తులా ప్రయత్నించాం

శాంతి సామరస్యాల మీ స్ఫూర్తిని
ఎద ఎదలో పాదుకొల్పుకుని
ప్రేమాన్విత జీవన విధానానికి
తెర తీసుకున్నాం
మానవతా మందిరాలను
నిర్మించుకున్నాం

కుటిల విశ్వాసాలకు తావులేని
తెలుగు తల్లి కళామృతధారల్ని
దోసిలిపట్టి గ్రోలుతున్నాం

నీరు గాలి నిత్య ప్రసాదంలా
సేవిస్తూ జీవిస్తున్నాం
బొట్టు బొట్టు చెమటతో
మెట్టు మెట్టుగా నిర్మించుకున్నదే
విగ్రహమైనా మందిరమైనా
సంస్కృతైనా నాగరికతైనా..

రెప్పపాటు విధ్వంసానికి
శతాబ్దాల కట్టడాలే
నేలకూలతాయని
చరిత్ర చెప్తూనే ఉన్నది
చీకటి రోజులుగా
ప్రకటిస్తూనే ఉన్నది

భిన్నత్వంలో ఏకత్వం
సౌందర్యకాంతి రహస్యం
సమభావం సమిష్టి క్షేమం
కాంచలేని విధ్వంసపు అంధుల
శాశ్వత చిరునామా మరుభూమేనని
మరల మరల అర్థమవుతున్నది



## నాకు కాకుండా పోతున్న నేను

- కర్లపాలెం భాస్కరరావు

ఎవరు
నా మెదడు తొలిచి
విద్వేషాల విషబీజాలు కూరారు?
ఎవరు
నాలో స్వతసిద్ధంగా మొలకెత్తిన
సమభావనకు సమాధులు పేర్చారు?

ఎవరు
ప్రక్కవాడే పక్కలో బల్లెం అనే
అభద్రతాభావానికి నన్ను బలి చేశారు?
ఎవరు
అస్థిత్వపు ఆలోచనల
లోచనాలు నాకు తొడిగారు?

యుగవైతాళికుల
స్వేచ్ఛ సమత మానవతా భావాలను

తెలుసుకోలేని సంకుచితత్వం
నాకద్దినదెవరు?

ఎవ్వరైతేనేమి?
నేనిప్పుడు
కులమత ప్రాంత భాషా భేదాలు
లెక్కిస్తూ బహుళంలో ఒంటరినైనాను
మోదైన చెట్టునైనాను
మొండిగోడనైనాను

బరిలో దింపాల్సిన శత్రువునొదిలి
గురి తప్పిన బాణంలా అగమ్యుడనైనాను
అస్థిత్వవాదుల చేతిలో అవాంఛనీయమైన
ఆయుధాన్నైనాను
గుళ్లని పడగొట్టే గునపాన్నైనాను
విగ్రహాలు కూల్చే సమ్మెట పోటునైనాను

నాకు నేనే
నాకు కాకుండ పోతున్న నేను
ఇకనైనా
నేనెవరో తెలుసుకొనే
అన్వేషణ సాగించాలి
సౌభ్రాతృత్వపు
వెలుగు బాటలో సాగాలి



గోపీచంద్

# అసమర్థుని జీవయాత్ర - అపసామాన్య మనస్తత్వ చిత్రణ

- డా॥వి.ఆర్.రాసాని

*అంతశ్చేతనాపరమైన ఇలాంటి వేనవేల సంకేతాలతో సాహిత్యాన్ని సృష్టించడమే **Surrealism**, ఈ పద్ధతిని వచన సాహిత్యంలో ఓం ప్రథమంగా ప్రవేశపెట్టినవాడు **Jams Joyes**. ఆ తర్వాత వర్జీనియా ఉల్ఫ్, శామ్యూల్ బకెట్ వంటి వారు ఈ పద్ధతిని కొనసాగించారు. **Jams Joyes** రాసిన **Ulysses, Samule Bachet ~Œ‹²# Writing for godot** అనే నాటకం ప్రసిద్ధిచెందిన రచనలు. తెలుగులో మొదటగా ఈ పద్ధతిని ప్రవేశపెట్టి విజయవంతంగా మెప్పించిన వాడు త్రిపురనేని గోపీచంద్ అతని 'అసమర్థుని జీవయాత్ర' ఆ పద్ధతిలో రాయబడి అతనికి అజరామరమైన కీర్తిని తెచ్చి పెట్టింది.*

ఆధునిక సాహిత్యాన్ని ఇద్దరు శాసించారు. ఒకరు Karl marx, మరొకరు Sigmund Freud . మార్బ్స సమాజంలోని వర్గ సంఘర్షణను సిద్ధాంతీకరించాడు. పెట్టుబడీ వర్గాలయిన ధనిక స్వామ్యానికీ, శ్రామిక వర్గాలయిన కర్షక కార్మికులకు మధ్య నిత్య సంఘర్షణ వుంటుందని గతి తార్కిక చారిత్రక భౌతిక వాదాలతో నిరూపించాడు. ఈ భావజాలమే ప్రపంచ సాహిత్యంపైన ప్రభావం చూపించి అభ్యుదయ సాహిత్యానికి తగిన భూమిక (base) ను ఏర్పాటు చేసింది. ఆ తర్వాత భౌతిక విషయాలనే గాక మనిషి యొక్క మానసిక అంతర్గత విషయాలు కూడా ఆధునిక సాహిత్యంలోకి రావడానికి తగిన ప్రాణవాయువును అందించింది Freud చేసిన Psycho analysis theory. మనిషి ప్రవర్తన వ్యక్తిగత పరిస్థితి (Indiuidual situation) లో ఒక రకంగాను, సాంఘిక పరిస్థితి (Social Situation)లో మరో రకంగాను వుంటుందని చెప్పాడు ఫ్రాయిడ్. దీన్నే మూర్తిమత్వం (personality) అంటారనీ, ఈ మూర్తిమత్వం ఆయా వ్యక్తులు పుట్టి పెరిగిన సాంస్కృతిక నేపథ్యంతో ముడిపడివుంటుందనీ Freud అతని శిష్యులు అడ్లర్, యూంగ్ వంటి వారు నిర్ధారించారు. ఈ విషయాన్నే E.Faris మాటల్లో చెప్పాలంటే "సంస్కృతి యొక్క ఆత్మాశ్రయ పక్షమే మూర్తిమత్వం" (Personality is the objective aspect of culture). అందుకే సంఘం ఏర్పరచిన ఆదర్శాలను, నియమాలను వ్యక్తి తనంత తానుగా తన personalityలో విలీనం (introjection) చేసుకుంటాడు - అని మానసిక శాస్త్రవేత్తలు చెబుతారు.

Freud మనిషి యొక్క ఆంతరంగిక ప్రపంచమైన (Innerworld) మానసిక వ్యవస్థను ఒక పెద్ద Iceberg గా పేర్కొని, అందులో పైకి కనిపించే చిన్న మంచు శకలమే సమాజానికి బహిర్గతమయ్యే మనిషి ప్రవర్తనమనీ, నీటి అడుగున కరుడు గట్టిన మహా మంచుపర్వతమే అసలు వ్యక్తిత్వమనీ, ఇది అంతఃచేతనగా వుంటుందని చెప్పాడు. ఈ అంతశ్చేతనా రూపాన్నే సహజాత లక్షణం, (Id) అహం (Ego), అధ్యహం (Super Ego)లుగా విభజించాడు.

మనిషికి వున్న వ్యక్త చైతన్యం (Conscious), అవ్యక్త చైతన్యం (Unconscious) వ్యక్తావ్యక్త చైతన్యం (Sub conscious) అనే మానసిక స్థితుల్లో, మొదటిది పైకి కనిపించే వ్యక్తిత్వానికి సంబంధించింది. ఇది సహజాత క్షణాలైన నిద్ర, భోజనం, మైథునాలు వంటి భౌతిక అవసరాల (Libidinous Instincts) చేత శాసించబడుతుంటుంది. ఇదే ID మనిషిలో వున్న ఇతర Ego లను నియంత్రిస్తుంటుంది.

మనిషి యొక్క భౌతిక జీవితంలో ఎదురయ్యే అనేక అనుభవాలు, అనుభూతులు, కోరికలు మెదడులో ఎప్పటికప్పుడు రికార్డ్ చేయబడి, మరెన్నో ఆలోచనలను రేకెత్తిస్తుంటాయి. వాటిలో కొన్ని బహిర్గతమైతే, మరికొన్ని అలాగే మెదడు పొరల్లో సుప్తావస్థలో వుండి పోతాయి. ఇలా సుప్తావస్థలో వుండిపోయిన అంశాలే నిద్రపోయేటప్పటి Sub conscious స్థితిలో అనేక ప్రతీకల రూపంలో కలలుగా వ్యక్తం చేయబడతాయి. ఇదే కలల Metamorphesis రహస్యం. దీన్ని అధ్యయనం చేసేదే Psycho Analysis theory. ఈ విషయంలో స్వల్పమైన బేధాభిప్రాయాలున్నా ప్రఖ్యాత మానసిక శాస్త్రవేత్తలయిన J.F Brown, Mc Dougall, E.Faris, యూంగ్, అడ్లర్, క్లిఫర్డ్, టి.మార్గన్, రిచర్డ్ ఏ.కింగ్ లాంటి వారు ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

అంతశ్చేతనాపరమైన ఇలాంటి వేనవేల సంకేతాలతో సాహిత్యాన్ని సృష్టించడమే Surrealism, ఈ పద్ధతిని వచన సాహిత్యంలో ఓం ప్రథమంగా ప్రవేశపెట్టినవాడు Jams Joyes .

ఆ తర్వాత వర్జీనియా ఉల్ఫ్, శామ్యూల్ బకెట్ వంటి వారు ఈ పద్ధతిని కొనసాగించారు. Jams Joyes రాసిన Ulysses, Samule Bachet రాసిన Writing for godot అనే నాటకం ప్రసిద్ధిచెందిన రచనలు. తెలుగులో మొదటగా ఈ పద్ధతిని ప్రవేశపెట్టి విజయవంతంగా మెప్పించిన వాడు త్రిపురనేని గోపీచంద్ అతని 'అసమర్థుని జీవయాత్ర' ఆ పద్ధతిలో రాయబడి అతనికి అజరామరమైన కీర్తిని తెచ్చి పెట్టింది. ఇతని తర్వాత ఈ పద్ధతిలో బుచ్చిబాబు 'చివరికి మిగిలేది', జి.వి. కృష్ణారావు 'కీలు బొమ్మలు,' నవీన్ 'అంపశయ్య', రావిశ్రాస్తి 'అల్పజీవి', వడ్డెర చండీదాస్ 'హిమజ్వాల', కాశీభట్ల వేణుగోపాల్ 'నేనూ – చీకటి' రచించి కీర్తి ప్రతిష్టలు పొందారు. ఇవన్నీ ఏదో ఒక కోణంలో రాయబడ్డ Psycho Analysis నవలలే వీటన్నింటిలోకి మకుటాయమానంగా నిలబడిన నవల 'అసమర్థుని జీవయాత్ర'.

ఈ నవలలో కథంటూ ప్రత్యేకంగా ఏమీలేదు. ఈ నవలలో సీతారామారావు కథానాయకుడు. ఇతని పూర్వీకులు , తాతముత్తాతలు నుంచీ తండ్రివరకు బతికిన విలాసవంతజీవితం, కాపాడుకుంటూ వస్తున్న పరువు ప్రతిష్ట, వంశగౌరవం, గొప్పతనం, వాటి కోసం చేసిన దానధర్మాలు, కట్టించిన గుడులు, సత్రాలు, చెలాయించిన సామాజిక ఆధిపత్యం వంటి అనేక విషయాలు ఆతనిలో అహం (Ego)ను కలిగిస్తాయి. ఆ మూలంగా వంశపారంపర్యంగా వస్తున్న అధ్యహం (Super Ego) అతనికీ వచ్చి, నేను అందరిలాంటి వాణ్ణి కాదన్న భ్రమలోకి నెడుతాయి. కానీ ఆస్తిపాస్తులు పోగొట్టుకున్నా తర్వాత ఆ Egoలు దెబ్బతింటాయి. అయినా భౌతిక, సామాజిక పరిస్థితులలో అతనిలోని సహజాత లక్షణం (Id) కొంతవరకు అతని మానసిక స్థితి (Psychological Situation) ని నియంత్రించడానికి దోహదపడినా రానురాను 'ఇడ్' బలహీనపడి అతనిలో అహం- వ్యాకులత (Ego - Anxiets) ఎక్కువై ఆత్మన్యూనతా భావం (Inferiority Complex)లో పడిపోతాడు. అదే Depression కి దారితీసి అతనిలో పాక్షిక మనో విక్షిప్తి (Semi insanites)ని కలుగ జేస్తుంది. ఆ మనో విక్షిప్తిలో భ్రాంతుల (Delutions) కి, విభ్రాంతుల (Hallu cinations) కి బలై ఒక విధమైన Personality Disorder లోకి పడిపోతాడు. ఇలా మొదలయిన అతనిలోని అపసామాన్య ప్రవర్తన (Abnormal Behaviour) కారణంగా నిజమేదో, భ్రమేదో కూడా తెలుసుకోలేని స్థితి లోకి వెళ్ళి పోయి, చివరికి స్మశానంలో ఆతనితో ఆతనే పోరాడి ఆత్మహత్య చేసుకుంటాడు. ఈ Process అంతా Sub conscious స్థితిలో ఒక కలలా ఎన్నో భ్రమాత్మక ప్రతీక (Delutional symbols) లతో మరెన్నో తాత్విక (phylosaphical) విషయాలతో Surrealistic way లో ఊపిరిసలపనంత ఉద్వేగభరితమైన శైలిలో నవల నడచి పోతుంది.




నవల ప్రారంభంలో సీతారామారావు తండ్రి చనిపోతూ చనిపోతూ "బాబూ! మన వంశంపేరుని నిలబెట్టు అంతకంటే నే చెప్పేదేమీలేదు" అని చెప్పి హరీమంటాడు. చుట్టుపక్కల జనం వారి వంశం గొప్పతనాన్ని, వాళ్ళ తాత ముత్తాతలని, అతని తండ్రిని పొగడి "ఆ గొప్పతనం వాళ్ళ వంశంలోనే వుంది" అని ఆకాశానికెత్తుతారు. వాళ్ళు అతని ముత్తాత తాత ఆ ఊరి చెరువును తవ్వించిన సంగతి, సత్రం కట్టించిన సంగతి, వాళ్ళ తాత ఊరి జనం కోసం దేవాలయాన్ని కట్టించి, దేవుడి పెళ్ళికి పీటలపైన కూర్చొనే సంప్రదాయాన్ని కోర్టుదాకా వెళ్ళి నిలబెట్టుకున్న విషయాన్ని గురించీ ఏకరువు పెట్టి, వారి వంశస్తుల శౌర్య పరాక్రమాలను వర్ణించి చెప్పిన విషయాలు అతనిలో Egoని పెంచుతాయి. ఆ Egoనే అతనిచేత "డబ్బుదేముంది? మనిషికి కావలసింది 'పేరు" అనే Super Egoకి దారితీస్తుంది. పైగా తండ్రి కర్మలకి, ఆడంబరాలకీ వేలకు వేలు ఖర్చు పెట్టి, పదిరోజులవరకు నిరతాన్నదానాలు జరిపేటట్టు చేస్తుంది. జనం "ఎముకలేని చెయ్యి" అని పొగడుతారు. వచ్చిన బంధువులు అదే సాకుగా చేసుకుని నెల రోజుల వరకు తిని తాగి తేన్చుకుని వెళ్ళిపోతారు. తండ్రి యిచ్చిన అప్పుల విషయంలోను చాలా ఉదారంగా వ్యవహరిస్తాడు. చివరికి ఒకప్పుడు తమ వ్యవసాయపనులు చేసి ఎంతో సొమ్ము వెనకేసుకుని వెళ్ళిపోయిన మేనమామ యివ్వాల్సిన నలభైవేల అప్పుకి, వారి పొగడ్తలకు పొంగిపోయి ఎందుకూ పనికిరాని పదెకరాల చవుటి పర్రుని రాయించుకొని వస్తాడు. జనం యింకా గొప్పగా పొగుడుతారు. అది చూసి ఆ ఊరిలోని రామయ్య తాత "కొంచెం తెలిసి మెలగాలి" అని హెచ్చరిస్తాడు. "నేను తెలిసే చేస్తున్నా తాతా!" అంటాడు. "నీ మంచే నీ పతనానికి కారణమవుతుంది" అంటాడు తాత. అయినా అతను వినలేదు. ఇంకా అహం తెచ్చుకొని హెచ్చులకు పోయాడు. అదే Super Ego.

ఈ నేపథ్యంలో తన చుట్టూవున్న సంసారిక జీవితం ఆతని మనసుని బాధిస్తుంది. పెళ్ళి పిల్లలు అనే భవబంధాలు అతని హృదయాన్ని గాయపరుస్తాయి. తను అందరికంటే ఉన్నతుణ్ణి అనే Super Ego కలిగి ఉండడం వల్ల కుటుంబ జీవితం (Family setup) పరమరోతగా అనిపించేది. ఈ క్రమంలో అతని ఆస్తిపాస్తులు కర్పూర హారతిలా కరిగిపోయి, పెళ్ళి కూడా జరిగిపోవడం యుధాలాపంగా జరిగిపోతాయి. దాంతో అతని Ego లకి Icebreaking జరిగి అతని భౌతిక, సాంఘిక జీవితానికీ, అంతర్గత ప్రపంచానికీ, సంఘర్షణ (Conflict) బయలుదేరుతుంది. అంటే అతనిలో ఇడ్‌కి, సూపర్ కాంప్లెక్సులకి సంఘర్షణ ఏర్పడి, వాటిమధ్య సమన్వయంలోపించడం ప్రారంభమవుతుంది.

ఇందిర ఆతని భార్య మహా యిల్లాలు. కూతురు చిన్నపిల్ల పుత్తడి బొమ్మే అయినా వాళ్ళ నెప్పుడూ ప్రేమగా చూడలేకపోయాడు. ఆర్థికంగా చితికిపోవడం, ఉన్న ఉద్యోగం కూడా పోగొట్టుకోవటం జరిగి Ego complex దెబ్బతిని, రానురాను ఆత్మన్యూనతాభావా (Inferiority complex) నికి లోనవుతాడు. ఈ స్థితే అతనిలో వ్యతిరేక మనస్తత్వాన్ని (Negative Mentality) కలుగ చేసి, ఒక విధమైన అపసవ్యమనస్తత్వాని (Abnormal psychology)కి దారితీస్తుంది.

సమాజంలో తరతరాలనుంచీ వస్తున్న ఆచారాలు, సంప్రదాయాలు, నైతిక విలువలు, ధర్మ పద్ధతులు మనుషుల్ని సక్రమ మార్గంలో నడవడానికి దోహదం చేస్తుంటాయి. వీటిని తల్లితండ్రులు పెంపకం, వారి ప్రవర్తన, సమాజం చిన్నప్పటినుంచే మనిషికి అందేటట్లు చేస్తూ వస్తాయి. అందువల్లా అందరిలాగే ఆలోచించడం, ప్రవర్తించడం ద్వారా మనిషి ఆ సామాజిక జీవన స్రవంతిలో కలిసిపోతాడు. దీన్నే సామాన్య మనస్తత్వం (Common psychology) అంటారు.

ఇదొక రకమైన మానసిక వ్యాకులత (psychological Anxiety) అదే ఆ రూపంలో వ్యక్తమయ్యే Ego - Anxiety. ఈ స్థితి చాలదన్నట్లు ఒకప్పుడు అతనిచేత లబ్ధి పొందిన వారే అతని లేమిని చూసి చీదరించుకోవడం ప్రారంభం కావడంతో అతను ఒక విధమైన మానసిక రుగ్మతకు గురై సమాజం పట్ల ద్వేషాన్ని, కోపాన్ని పెంచుకుంటాడు. దాంతో ప్రతిదానికి ఏదో పెడార్థం తీయడం మొదలెట్టాడు.

అలాగాక ఆ సాంఘిక జీవితానికీ, మానసికపరమైన అంతర్గత జీవితానికీ సమన్వయం కుదరక దానికి విరుద్ధంగా ప్రవర్తించడమే అపసామాన్యమనస్తత్వం (Abnormal psychology) ఈ Abnormal psychology తోనే సీతారామారావుకి భార్య అంటే బాధించేదనీ, పిల్లలంటే పీకులాటనే వారు అనే భావన పెరగసాగింది. దీనికి తోడు ద్వయదీ మనస్తత్వం (Dual psychology) కూడా వచ్చి చేరుతుంది. అందుకే ఒక్కోసారి జరిగిన విషయాలకు Positive గాను, మరొకసారి Negative గాను స్పందించడం జరిగి, ఏది మంచో ఏది చెడో, ఏది సత్యమో ఏది అసత్యమో తేల్చుకోలేని అనిశ్చిత స్థితిలోకి జారిపోవడం జరిగింది. ఇదొక రకమైన మానసిక వ్యాకులత (psychological Anxiety) అదే ఆ రూపంలో వ్యక్తమయ్యే Ego - Anxiety. ఈ స్థితి చాలదన్నట్లు ఒకప్పుడు అతనిచేత లబ్ధి పొందిన వారే అతని లేమిని చూసి చీదరించుకోవడం ప్రారంభం కావడంతో అతను ఒక విధమైన మానసిక రుగ్మతకు గురై సమాజం పట్ల ద్వేషాన్ని, కోపాన్ని పెంచుకుంటాడు. దాంతో ప్రతిదానికి ఏదో పెడార్థం తీయడం మొదలెట్టాడు.

ఒకసారి భార్య "సాయంకాలానికి బియ్యం లేవు. తెప్పించండి" అంటుంది. దాంతో "తెప్పించండి అనడం ఎందుకూ? తెండీ అనరాదూ? దాబుసరికూడా ఎందుకు? అని కసురు కుంటాడు. అంతే గాకుండా "నేను సంపాయించడం లేదనేగా నీకీ అలుసు. ఇంతకీ నిన్ను అని ఏం ప్రయోజనం నాకు బుద్ధి లేదు" అని ఎగిరెగిరి పడతాడు. ఈ సంఘటన ఆతనిలోని ఆత్మన్యూనతా భావాన్ని, అపసవ్య మనస్తత్వాన్ని ఒకేసారి వ్యక్తం చేస్తుంది. ఈ ఆత్మన్యూనతా భావాన్ని కప్పిపుచ్చుకోవడానికి మాటిమాటికీ భార్యాపిల్లల్ని తిడుతూ చేయి చేసుకుంటూ వుంటాడు. మళ్ళీ తాను చేసింది తప్పే అంటాడు. అలాగే ఒక పని చేద్దామనుకుంటూనే దానికి విరుద్ధమైన మరో పనిని చేస్తుంటాడు. ఈ ద్వంద్వ ప్రవృత్తే ఆతని మానసికరుజను ఎక్కువ చేస్తుంది. ఎప్పుడు ఆలోచిస్తుండడం, ముసుగుతన్ని పడుకోవడం వంటి అపసవ్య మనస్తత్వ లక్షణాలు పొడసూపడం ప్రారంభమవుతుంది. భార్య ఇంటి ముందర కల్యాపి చల్లి, ముగ్గులేసి, మాసిన బట్టలతో వీధిలోకి వెళితే "నా పరువు తీసి వెయ్యడానికే ఈ పనులన్నీ చేస్తున్నావ్" అంటూ మండిపడుతుంటాడు. ఇతను స్నానం చేయకముందే భార్యా పిల్లలు స్నానం చేసినా, లేదా స్నానానికి కూతురు నీళ్ళు తోడిపెట్టమన్నా తనను కించపరచడానికే అలా చేస్తున్నారనుకుంటాడు. ఇవన్నీ అపసామాన్య మనస్తత్వ స్థితి లక్షణాలే.

ఇలా అతను రానురాను భ్రాంతుల (Delutions)కి లోనవుతుంటాడు. తన ఈ దుస్థితికి తన స్నేహితులే కారణమని భ్రమించి వాళ్ళని తిట్టి పోస్తాడు. మళ్ళీ "వాళ్ళు మూలాన నేను చెడిపోయాననుకోవడానికి ఎట్లా వీలు. నామూలానే వాళ్ళు చెడిపోయారేమో" అనుకుంటాడు. ఈ సంఘటనలన్నీ ఆతనిలోని ద్వంద్వ ప్రవృత్తికి నిదర్శనం.

మరొకసారి భార్యను కొట్టి వెళ్ళి, ఆవిషయం రామయ్య తాతకు చెప్పి "రాముడు భార్యను అడవులకు పంపి హింసించాడు. తనూ భార్యను కొట్టి హింసించాను. కాబట్టి నేనూ రాముడంతటి వాణ్ణి" అని తన అధ్యహాన్ని (Super Ego) ప్రదర్శించుకుంటాడు. అలాగే ఒక హోటల్లో కాఫీ తాగి ఆయిదణాల బదులుగా పావలాయిస్తే ఏమవుతుందనీ, అక్కడేవున్న ఒక లాయర్ని చూసి "ఇన్ని సార్లు కాఫీ తాగుతున్నావే. ఒక్క సారయినా నీ భార్యకు కాఫీ తీసి చ్చావా;?" అని గలాటా పెట్టుకుంటాడు. ఇవన్నీ కూడా Abnormal psychological symptoms ఈ symptoms వున్న వ్యక్తి తన ఆదర్శాలను, నియమాలను తనంతతానే, తన Personalityలో విలీనం (Intrajection) చేసుకుంటాడు. ఈ లక్షణం సీతారామారావు భోగం యింటికి వెళ్ళినప్పుడు బహిర్గతమవుతుంది.

భోగం పిల్ల తమకూ పెళ్ళి చేసుకుని పిల్లల్నికని, గుట్టుగా సంసారం చేసుకోవాలని వుంటుందన్న భావాన్ని వ్యక్తం చేస్తుంది. ఆ సమయంలో ఆతనికి ఆమె ఒక్కక్షణం సూర్యారావుగాను, శాతవాహనుడిగాను, బాలకృష్ణుడి గాను, మరోక్షణంలో శివరావుగాను కనిపించి కడకు 'తాను'గాను కనిపించి ఒక చిత్త భ్రాంతి (Delution)కి గురవుతాడు. ఆ తర్వాత ఆమెకు అనేక తలల మొలచుకువచ్చి అవి అతనితో సంభాషిస్తాయి. ఇదొక వింత విభ్రాంతి (Hollucinations) ఆ తలల్లో తన స్నేహితుడైన శివరావు తల "ఆమెను మాతా అంటున్నామని మీరు శంకిస్తున్నారేమో. అట్లాంటి శంక మీరు పెట్టుకోవద్దు. తల్లయినా, తండ్రయినా , కూతురయినా, భార్య అయినా, సోదరి అయినా, స్నేహితుడైనా వీరందరినీ ప్రేమించడానికి కారణం సెక్సే అంటుంది. ఈ అంశం ఆతనిలో అంతర్గతంగా వున్న Oedipus Complex నికూడా సూచిస్తుంది. ఇది కూడా సీతారామారావులో వున్న ఒక అపసామాన్యమనస్తత్వలక్షణమే.

అలాగే మరోసారి అతను ఒక సభ జరిగే చోటికి వెళతాడు అక్కడ వేదిక పైనున్న ముఖ్య ఉపన్యాసకుల గుట్టురట్టు చేస్తాడు. నాగలింగం అనే ఒక ఉపన్యాసకుని గూర్చి చెప్పిన విషయంలో ఆతనికున్న homo sex గురించి బట్టబయలు చేస్తాడు.

"ఎప్పుడూ తనకు టైపిస్టుగా మలయాళ కుర్రవాణ్ణే ఎందుకు పెట్టుకుంటాడో అడగండి, ఎర్రగా, సన్నగా, మృదువుగా వుండే కుర్రవాళ్ళు తప్ప మిగిలిన వాళ్ళు టైపు చేయటానికి పనికిరారా? ఎవరూలేనప్పుడు తన టైపిస్టు తలనిమురుతూ కూర్చోవటం ఎందుకు?" అని ప్రేక్షకుల్ని ప్రశ్నిస్తాడు. చివరికి ఆతని నిర్వాకంతో అక్కడ రభసలో ప్రేక్షకుల చేత చితకతన్నించుకుంటాడు.

ఇవన్నీ కూడా ఆతనిలో ప్రకోపించిన Abnormal psychological Symptoms ఈ లక్షణమే ముదిరి ఆతనికి పూర్తిగా మరో విక్షిప్తి (insanity) కలిగినప్పుడు ఆతన్ని మరిన్ని భ్రాంతులు, విభ్రాంతులు చుట్టుముడతాయి. ఆ Delutions, Hallucinations తోనే నవల పరాకాష్ట (Climax) కు చేరుకుంటుంది. చివరన అతను

# తాటిచెట్టు

- ముకుంద రామారావు

ఇతర చెట్లని దాటి
అంతరిక్షానికి సమంగా
ఒంటికాలు రాకాసి
రెక్కలే ఉంటే
నల్లటి మేఘాల కప్పుని చీల్చుకుని
ఎగిరిపోవాలని చూసేది

ఉబ్బితబ్బిబ్బై తలెగరేస్తూ
చెట్టు తన కోరిక చెబుతుందేమో
అనుకుంటుందేమో బహుశా
నా ఆకులు ఈకల్లా అల్లల్లాడి
ఎగిరిపోటానికి అడ్డంకే లేదని



రోజంతా గాలికి ఊగుతున్న చెట్టు, మట్టలు
రెపరెపలాడుతూ వణుకుతూ ఆకాశంలో ఎగురుతూ
అలా అలా ఎగిరిపోతున్న ఆలోచన
ఎక్కడికి పోతుందో తెలియక
నక్షత్రాల్ని దాటుకుంటూ
అదేదో ఆకాశంలో విహరిస్తున్నట్టు

గాలి ఆగిపోయాక
మట్టలు అణిగిపోయి, అణగారిపోతాయి
చెట్టు మనస్సు భూమికి తిరిగొస్తుంది
గుర్తు తెచ్చుకుంటుంది భూమే తన తల్లి అని
భూమిలో తన మూలాన్ని
మరోమారు ఇష్టపడుతుంది

**(పిల్లల్ని తాటిచెట్టుతో పోలుస్తూ ఊహిస్తూ సాగిన ఈ కవిత టాగూరుకి భావోద్వేగంతో వచ్చిన ఆలోచన. తల్లి భూమినొదిలి పైకి, ఇంకా పైకి ఆకాశంలో ఆనందంగా విహరించాలన్న ఉహ ఉన్నా, తల్లి ఒడిలోని ప్రేమ, రక్షణని వదలలేనితనం అద్భుతంగా సూచించబడింది)**

---

చిక్కిశల్యమై స్మశానానికి చేరుకుంటాడు. అక్కడ కోలాహలంగా వున్న ప్రపంచాన్ని, ప్రశాంతంగా వున్న స్మశానాన్ని పోల్చి చూసుకుంటాడు. అంతవరకూ అల్లకల్లోలంగావున్న ఆతని మనసూ అక్కడికి చేరుకోగానే ప్రశాంతంగా మారి చల్లబడిపోతుంది. పుట్టిన ప్రతి మనిషీ చివరికి ఇక్కడికి చేరాల్సిందే. తన భార్య అయినాసరే, భోగం పిల్లయినా, తనను మోసం చేసిన మేనమామైనాసరే. అంతమాత్రానికి ఇన్ని మోసాలు, ద్వేషాలు, కుట్రలు, కుతంత్రాలు అవసరమా అనుకుంటాడు. దూరంగా మండుతున్న చితిలోనుంచీ కాలుతున్న ఆడశవం తనతో మాట్లాడుతున్నట్లు భ్రమిస్తాడు. అలాగే తన జన్మకు కారణమైన తండ్రిని తిట్టిపోసి, తండ్రిని సమాధిచేసిన ప్రాంతానికి నడుస్తాడు. స్మశానంలో సమాధులన్నీ కదలుతున్నట్లనిపిస్తుంది. తండ్రి సమాదిపైన పెరిగివున్న జిల్లేడు చెట్లను చూసి తన జన్మకు తన తండ్రి ఎలా కారణమో, ఆ జిల్లేడు చెట్లు పుట్టుటకూ అతనే కారణమనుకుంటాడు. దాంతో ఆ జిల్లేడు చెట్లలోను కదలిక వచ్చి అందులో 'ఓ చెట్టు' 'అన్నాయ్' అని పిలవడం, ఆ సమాధిలో నుంచీ తండ్రిలేచి వచ్చి సమాధిపైన కూర్చొని తన వంశ ప్రతిష్టను భ్రష్టు పట్టించావని అతన్ని నిందించడం ప్రారంభిస్తాడు. అందుకు అతను కోపగించుకుని "నీ వంశం నీగౌరవం అనే గానుగలో ఎంతమంది పిప్పి అయ్యారో,అవుతున్నారో నువ్వు ఎప్పుడైనా ఆలోచించావా? నీవంశం, సాంప్రదాయాలే నన్నీ స్థితికి తీసుకొచ్చినాయి." అని తండ్రిని నిలదీస్తాడు. ఆ సమయంలోనే తనలో నుంచి వచ్చిన తన నీడనే నిజమైన పుత్రుడిగా భావించి దాన్ని కౌగలించుకుని గౌరవిస్తాడు తండ్రి. అంతేగాకుండా "వీడొక పీడకలగా వున్నాడు" అని ఆ నీడను తనలో కలుపుకొని అదృశ్యమైపోతాడు. తండ్రి అది చూసి పక్క సమాధిలో నుంచి తన తల్లి అతన్ని పిలిచి "నువ్వు మారుతున్నావు నాయనా "అంటూ ఓదారుస్తుంది. దాంతో తల్లి పాదాల వైపుపడి ఏడుస్తూ ఆ చీకట్లో అలాగే పడివుంటాడు. కొంతసేపటికి ఒక కుక్క అతని కాలునాకుతుంది. ఆ కుక్కే తన ఆకారంలో అతనికి కనిపించి నిటారుగా నిలబడి భయపెడుతుంది. దాంతో ఆ ఆకారంతో పోరాడి, దాని గొంతు పిసికి చంపుతున్నట్లు భ్రమించి, తన గొంతును తానే పిసుక్కుని సీతారామారావు చనిపోవడంతో నవల ముగుస్తుంది. ఈ Climax అంతా అతనిలో కలిగిన భ్రాంతీ, విభ్రాంతులకు పరాకాష్ట. ఇదంతా సీతారామారావు Abnormal psychology తద్వారా ప్రాప్తించిన Insanity ఒక విశ్వరూపం.

కాబట్టి ఈ నవల మొదట సీతారామారావులోని Ego ప్రారంభమై, ఆ Egoని నియంత్రించే ID బలహీనపడి, అతనిలో Inferiority Complex పెరగడం, దాన్ని కప్పిపుచ్చుకోవడానికి Super Ego ని తెచ్చి పెట్టుకోవడం జరిగింది. దానికీ విచ్చిత్తి కలిగి Depression కి దారితీసి, మనోవికారానికిలోనై భ్రాంతి, విభ్రాంతులకు గురై Insanity మారడం, ఆ Insanity నే అతని మరణానికి దారితీయడం జరిగింది. ఇలా Id నుంచీ Insanity వరకు జరిగిన సీతారామారావులోని మానసిక క్రమపరిణామం ఈ నవలలో ఎంతో నేర్పుగా, విజయవంతంగా చిత్రించబడింది. అందుకే ఈ నవలను అపసామాన్య మనస్తత్వ చిత్రణ నవలగా గుర్తించవచ్చు.

**(ఈ వ్యాసం ఫిబ్రవరి - 18-19 తేదీలలో సిల్వర్ జూబ్లీ ప్రభుత్వ కళాశాల - కర్నూలులో జరిగిన 'శతజయంతి సాహితీ మూర్తులు' అన్న జాతీయ సదస్సులో సమర్పించిన పత్రం)**

## నక్షత్రాలు రాలినా....

- 'ఉమ్మెత్తల'



సమతావాదం - మానవతా వేదం
అస్తమిస్తున్న సూర్యుళ్లవుతున్నాయా?
ప్రేమతత్వం - శాంతి మత్వం
అమావాస్య చంద్రుళ్లవుతున్నాయా?
నక్షత్రాలు జన్మిస్తాయి - అవి రాలతాయి...
మరింత కాంతిని, వేడిని
అధికంగా అందిస్తూ - ఈ విశ్వ వీథిలో
'నోవా'లై పోతాయి కొన్ని
'సూపర్ నో వాలై' పోతాయి మరిన్ని
ఈ నక్షత్రాల్ని చలిమంటల్లో వేసి
బూడిదగా మార్చే
అస్తమిస్తున్న సూర్యుళ్లల్లో - అమావాస్య చంద్రుళ్లల్లో
విజ్ఞాన కాంతులు విరిసేదెపుడో?
సూర్య నక్షత్ర వ్యాసం కనుక్కొనే జ్ఞానం
చంద్రుడి హృదయంపై కాలుమోపిన పరిజ్ఞానం
భూమి గంటకు సుమారు వెయ్యి మైళ్ల వేగంతో
తనచుట్టూ తానుతిరుగుతూ, అదే సమయంలో
సెకండ్‌కు పద్దెనిమిదిన్నర మైళ్ల వేగంతో
సూర్యుని చుట్టూ తిరుగుతున్న శాస్త్ర పరిశోధనా సుజ్ఞానం
పెంచుకున్న ఈ యుగం
నిజానికి తిరిగి అంధకార యుగంవైపు
దారితీయడం లేదు కదా?
అజ్ఞానపు బాటల బీటల్లో పయనించడం లేదు కదా!
మూఢాచార, మతాతత్వ రాజకీయ ముళ్ల కంచెల పరిధుల్లో
క్షుద్ర కీటకమై తిరగడం లేదు కదా!
అస్తమిస్తున్న సూర్యుళ్లారా! అమావాస్య చంద్రుళ్లారా!
మీ కళ్లని ఎక్స్‌రే టెలిస్కోపులుగా మార్చి చూడండి
మీ కుళ్లు మనసుల్ని రేడియో టెలిస్కోపులుగా
మార్చి చూడండి
నక్షత్రాల్ని మంటల్లో మాడ్చేయడం పవిత్రతని
మీలో పిచ్చిపూలు పూయించకండి
ఎందుకంటే
ఆ నక్షత్రాలు
అరుణతారలవుతాయి - న్యూట్రాన్ తారలవుతాయి
సూర్యునికన్నా పెద్దవై 'బ్లాక్ హోల్'లవుతాయి
మీ మృతరాజ్యాల దుర్మార్గాల్లో మీకివేవీ కనిపించవు
'బ్లాక్‌హోల్' అత్యధిక తీక్షణత
మీ పునాదులనే కదిలించేంత వరకు
మీకివేవీ అర్థం కావు... అవి,
డప్పులు వాయించడం, బూరలూదడం
కేరింతలు కొట్టడం చేస్తాయే కాని,
ఆ నక్షత్రాలు మరో రూపంలో
విజ్ఞాన కాంతుల్ని - విప్లవాల అగ్నిని కురిపిస్తాయి
నక్షత్రాలు శాశ్వతంగా
అస్తమిస్తున్న సూర్యుళ్లారా - అమావాస్య చంద్రుళ్ళారా!
కళ్లు విప్పిచూడండి సరైన రాస్తా...

---

## మైక్రో (దా) రుణాలు

- వి.వి. కూర్మారావు



సూక్ష్మ రుణం తీసుకుంటే
దారుణం నీ ముంగిటే
ఆదుకునే పథకం అంటూనే
వేదనకు సాధనంగా ప్రయోగం

అడవిలోని ఊబిలో పడిన గజరాజు
నిస్సాహయంగా వేసే హాహాకారాలు
జనారణ్యంలో రుణాల ఊబిలో ఇరుక్కున్న కుటుంబాల
బలవన్మరణాల కౌగిలిలో ఇమిడిన జీవితాలు

ఇవి పథక రచనలోని లోపాలా?
చక్రం తిప్పేవారి చక్రబంధంలో నలుగుతున్న వారికి శాపాలా?
నడ్డి విరిచే వడ్డీతో పరిమితికి మించిన అప్పులా?
తీర్చలేని పరిస్థితి కల్పించి ఎన్నో తిప్పలా?

ఉద్ధరించడానికే రుణాలని ఒకటే ఊరింపులు
అలంకరణల కోసమే అప్పులంటూ ఈసడింపులు
అడిగినవాడికి చీపుళ్లతో తరిమికొట్టమని వెక్కిరింపులు
అసలు సమస్యను ప్రక్కదారి పట్టించే రాజకీయ జిమ్మిక్కులు

సూక్ష్మ రుణాలకు బలైన కుటుంబాలు వివరించే గాథలు
ప్రజా ప్రయోజనం శూన్యమనే వాస్తవాలు
బడాబాబుల జేబులు నింపే కార్యక్రమాలు
శవాలను పంచుకు తినే రాబందుల రాక్షస కృత్యాలు

ఆదుకుంటామనే కబుర్లు గాలికే
జీవితాలతో ఆడుకోవడమే నిజానికి
ఎక్కడ బీజం పడిందో ఈ కుట్రకు
ముగింపు ఎలా పలకాలో తెలిసేనా ప్రభుత్వకు?

# గిరిజన సాహిత్యం - అంగీకృత, అనంగీకృత సంస్కృతి



- జె. రమేష్ నాయక్

**1972 సంవత్సరంలో కొర్రపాటి గంగాధరరావు రాసిన "లంబాడోళ్ళ రాందాసు" నవల, కన్నడ భాషలో మల్లికార్జున్ హిరేమఠ్‌రాసిన "హవన" నవలను తెలుగులో జయశ్రీ మోహన్‌రాజ్, ఎస్.మోహన్ రాజ్ "తాండా" నవలగా అనువాదం చేశారు. ఈ రెండు నవలల్లో గల గిరిజన సంస్కృతిలో గల వైవిధ్యాన్ని పరిశీలించడం వల్ల ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజనులకు ఆంధ్రప్రదేశేతర రాష్ట్రాలల్లోని గిరిజన సంస్కృతికి గల భేద సాదృశ్యాలు తెలిసే అవకాశం ఉంది. చిత్రమేమిటంటే పై రెండు నవలలను గిరిజనేతర రచయితలే రాశారు. అయినప్పటికి గిరిజన సంస్కృతిలోని భిన్న పార్శ్వాలను చాలా వరకు గుర్తించగలిగారు. అందువల్ల భారతదేశ వ్యాప్తంగా గిరిజన సంస్కృతిలో కనిపించే సారూప్య లక్షణాలను, సాంస్కృతికంగా వారు ఎదుర్కొంటున్న సమస్యల్ని గుర్తించే అవకాశం ఉంది.**

ప్రతి జాతికి ఒక సంస్కృతి ఉంటుంది. సంస్కృతిలో ఔన్నత్యం, అనౌచిత్యం అనేది నిరంతరం మారుతూ ఉంటుంది. జీవన విధానమే సంస్కృతి. కనుక, దేశ, కాల పరిస్థితులను బట్టి సంస్కృతిలో వైవిధ్యం కనిపిస్తుంది. ఈ వైవిధ్యాన్ని గమనించిన వారు ఒక జాతిని గానీ, తెగని గాని వారి సంస్కృతిని ఆధారంగా చేసుకొని ఉన్నతత్వం, నీచత్వాలను నిర్ణయించే ప్రయత్నం చేయరు. అంతే కాకుండా నాగరిక, అనాగరిక అనే పదాలు వాడడానికి కూడా సాహసించరు. ఈ విశాల దృక్పథం లేనివారు ఏవో కొన్ని ప్రమాణాలను పెట్టుకొని వాటి పరిధిలోనూ సంస్కృతిని నిర్వచిస్తుంటారు. 1972 సంవత్సరంలో కొర్రపాటి గంగాధరరావు రాసిన "లంబాడోళ్ళ రాందాసు" నవల, కన్నడ భాషలో మల్లికార్జున్ హిరేమఠ్‌రాసిన "హవన" నవలను తెలుగులో జయశ్రీ మోహన్‌రాజ్, ఎస్.మోహన్ రాజ్ "తాండా" నవలగా అనువాదం చేశారు. ఈ రెండు నవలల్లో గల గిరిజన సంస్కృతిలో గల వైవిధ్యాన్ని పరిశీలించడం వల్ల ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజనులకు ఆంధ్రప్రదేశేతర రాష్ట్రాలల్లోని గిరిజన సంస్కృతికి గల భేద సాదృశ్యాలు తెలిసే అవకాశం ఉంది. చిత్రమేమిటంటే పై రెండు నవలలను గిరిజనేతర రచయితలే రాశారు. అయినప్పటికి గిరిజన సంస్కృతిలోని భిన్న పార్శ్వాలను చాలా వరకు గుర్తించగలిగారు. అందువల్ల భారతదేశ వ్యాప్తంగా గిరిజన సంస్కృతిలో కనిపించే సారూప్య లక్షణాలను, సాంస్కృతికంగా వారు ఎదుర్కొంటున్న సమస్యల్ని గుర్తించే అవకాశం ఉంది.

'మానవుని భావాలు, దృక్పథం, ప్రవర్తన, సాంఘిక రాజకీయ సంస్థలు మొదలైనవన్నీ కలిసి అతని సంస్కృతికి సమగ్ర రూపాన్ని ప్రసాదిస్తాయి. ఒక విధంగా తాను నివసించే భౌతిక అవసరాల నేపథ్యంలో మానవుని మానసిక శారీరక శ్రమల సమన్వయ స్వరూపమే సంస్కృతి" అని బి.ఎస్.ఎల్. హనుమంతరావు అభిప్రాయం.

"పురాతన సంస్కృతులు మాసిపోయి, వాటి స్థానంలో నూతన సంస్కృతులు ఏర్పడడం గాక, భారతదేశంలో, పురాతన సంస్కృతులు మారుమూలలకు తప్పుకుంటూ నూతన, వినూత్న సంస్కృతులకు రంగం వదిలేస్తూ వచ్చేయి. ఈ రెండు సంస్కృతులూ పరస్పరం ప్రభావితం చేసుకుంటూ పక్కపక్కనే జీవించడం మన దేశం ప్రత్యేకత" అని కంభంపాటి సత్యనారాయణ అన్నారు.

పై రెండు నిర్వచనాల్లోనూ సంస్కృతిలోని భిన్న కోణాలు కనిపిస్తున్నాయి. ఈ దృష్టితో పరిశీలిస్తే ప్రత్యేకమైన గిరిజన సంస్కృతి అదృశ్యం, అస్పృశ్యం అంటే ఎవరూ చూడనిది, ఎవరూ స్పృశించనదిగా ఉందని తెలుస్తుంది. అలా చూపినప్పుడు సమాజంలో నేడు గిరిజన సంస్కృతిలో ఎంతో వైవిధ్యం కనిపిస్తుంది. కె.బాలగోపాల్ 'అడవిలో వెన్నెల' కథలకు ముందుమాట రాస్తూ "గిరిజనులు అనగానే తలలో ఈకలు, మొలలో గజ్జెలు ఉండే విచిత్ర జీవులని సామాన్య నాగరికులు భావిస్తారు. ఎక్కడో అడవులలో నివసిస్తూ తెల్లబట్టలు కనబడగానే పారిపోయే భయస్తులు అని కొంత చదువుకున్న వాళ్ళు భావిస్తారు. గిరిజనుల మాటే చెప్పాలంటే వాళ్ళు తమను తాము 'కొండ మనుషులు' గాను 'అడవి మనుషులు' గాను వర్ణించుకుంటారు. ఈ రకంగా చూస్తే వాళ్ళకు మనం పెట్టుకున్న గిరిజనులు, ఆటవికులు అనే పేర్లు వాళ్ళ చైతన్యం యొక్క సంస్కృతీకరణే" అని గిరిజన సంస్కృతి పై ఈ రకమైన అభిప్రాయాన్ని తెలియజేశారు. పై ప్రముఖుల అభిప్రాయలను అనుసరించి సంస్కృతిని రెండు రకాలుగా చూడవచ్చు.

### అంగీకృత సంస్కృతి :

ఒక జాతి లేదా ఒక తెగ జీవన విధానంలో జాతేతరులు ప్రవేశించి నూతన జీవన విధానాన్ని ప్రకటించినా, దానిని స్వీకరించగలిగే అవకాశం ఉన్న దాన్ని అంగీకృత సంస్కృతి అనవచ్చు. దీంట్లో వైయక్తిక జీవిత విషయాల్లో చొరబాటుకు అవకాశం ఉండదు. అది వ్యవస్థకు సంబంధించిన సంస్కరణపూరితమైన సంస్కృతిగా చెప్పుకోవచ్చు.

"లంబాడోళ్ళ రాందాసు" నవలలో రాందాసును చుక్కి ప్రేమిస్తోంది. అలాగే రాందాసు కూడా చుక్కిని ప్రేమిస్తాడు. వాళ్ళిద్దరికీ పెళ్ళి జరుగుతుంది. తాండా వాళ్ళందరూ కలిసి చందాలు వేసుకొని పెళ్ళి చేస్తారు. అప్పటి నుండి రాందాసు 'లంబాడోళ్ళ రాందాసు'గా వ్యవహారంలోకి వస్తాడు. దీనిని అంగీకృత సంస్కృతి అనవచ్చు. ఎందుకంటే ఒక జాతి జీవన విధానంలో మరో జాతి జీవన విధానాన్ని స్వీకరించడానికి, రాందాసు చుక్కిని పెండ్లి చేసుకున్నాడు. అందువల్ల రాందాసు గిరిజన సంస్కృతిని స్వీకరించినా, కాలక్రమంలో ఆ సంస్కృతి లక్షణాలు మారే అవకాశం లేకపోలేదు. ఆధునిక కాలంలో సంస్కృతి

మార్పు అనేది నిరంతరం మారుతునే ఉంది. రాందాసు గిరిజనేతరుడైనా, గిరిజన సంస్కృతిని అంగీకరించాడు. కాబట్టి, దీనిని వ్యవస్థకు సంబంధించిన సంస్కరణ పూరితమైన సంస్కృతి అనవచ్చు.

అలాగే 'తాండా' నవలలో సోమాల్య నాయక్ పెద్ద కొడుకు 'హరి' ఉన్నత చదువులు చదువుకొని ప్రేమించి సాంప్రదాయ గిరిజనేతర పద్ధతిలో పెండ్లి చేసుకుంటాడు. గిరిజన ఆచారవ్యవహారం ప్రకారం తాండాలో పెండ్లి జరగాలంటే తాండాలోని వాళ్ళంతా సమూహంగా బయలుదేరి వెన్నెల రాత్రుల్లో నాలుగు నుండి అయిదు రోజుల పాటు పెండ్లి జరుగుతుండేది. అది నేడు ఇంచుమించు పాటించడం లేదనే చెప్పాలి. ఈ నవలలో 'రుక్కి, లింబ్యా' పెండ్లి అలాగే వెన్నెల రాత్రుల్లో జరుగుతుంది. కాని హరి పెండ్లి దీనికి విరుద్ధంగా జరుగుతుంది. సోమాల్య నాయక్ మొదట్లో హరి పెండ్లిని తిరస్కరిస్తాడు. కొన్ని రోజుల తర్వాత స్కూలు మాస్టారు అభిప్రాయంతో హరి పెండ్లిని సోమాల్య నాయక్ కూడా అంగీకరిస్తాడు. కాబట్టి దీనిని కూడా అంగీకృత సంస్కృతి అనవచ్చు.

ఇందులో మనం గమనించవల్సిందొకటి ఉంది. ఆధునిక జీవితానికి అనుగుణంగా గిరిజనుల జీవన విధానంలో కూడా అనేక పరిణామాలు సంభవిస్తున్నాయని తెలుస్తుంది. సమకాలీన పరిస్థితులకు గిరిజనులు కూడా తమ సాంప్రదాయాల్ని సంస్కరణాత్మకంగా అంగీకరిస్తున్నారని స్పష్టమవుతుంది. అంటే, మానవ జీవితంలోని సంస్కరణాభిలాష గిరిజనుల్లోనూ ఉందని గుర్తించవలసి ఉంది. వారికీ మానవు లందరికీ ఉండే అనుభూతులు, ఆకాంక్షలు ఉంటాయని, వాటిని వ్యక్తం చేయడానికి సరైన పరిస్థితులు ఏర్పడడం అవసరమని పైన చెప్పిన సంఘటనలు తెలుపుతున్నాయి. దీనివల్ల గిరిజనుల్ని అనాగరికులనో, వాళ్ళకే అనుభూతులు, ఆశలూ ఉండవన్నట్లు, అనాగరికులన్నట్లు వర్ణించే వాళ్ళు ఈ విషయాల్ని గుర్తించడం అవసరం అని తెలుస్తుంది.




ఆధునిక జీవితానికి అనుగుణంగా గిరిజనుల జీవన విధానంలో కూడా అనేక పరిణామాలు సంభవిస్తున్నాయని తెలుస్తుంది. సమకాలీన పరిస్థితులకు గిరిజనులు కూడా తమ సాంప్రదాయాల్ని సంస్కరణాత్మకంగా అంగీకరిస్తున్నారని స్పష్టమవుతుంది. అంటే, మానవ జీవితంలోని సంస్కరణాభిలాష గిరిజనుల్లోనూ ఉందని గుర్తించవలసి ఉంది.

## అనంగీకృత సంస్కృతి :

ఒక జాతి లేదా ఒక తెగ తమ వైయక్తిక జీవితాలతో ముడిపడినా, సంస్కృతితో మమేకం కావడానికి ఇష్టపడని సంస్కృతిని అనంగీకృత సంస్కృతి అనవచ్చు. అంటే వ్యక్తిగత, కుటుంబ సంబంధాలు, వైవాహిక అంశాలు పట్ల జాతి లేదా తెగ వారి ఆలోచన విధానం, ఆచరణలను తమ సంస్కృతిలోకి చొరబాటు కానివ్వకుండా ఆత్మాభివ్యక్తిని ప్రకటించుకోవడం ఈ సంస్కృతిలో ప్రధానంగా గుర్తించాల్సి ఉంది. ఇది గిరిజన జాతి లేదా తెగ వారసత్వ సంపదగా సంపాదించుకున్న సంస్కృతిలో గుర్తించాల్సిన ఔన్నత్యం.

'తాండా' నవలలో లంబాడీలకు ఇష్టమైన 'తీజ్' పండుగకు స్కూలు మాస్టారుని అతిథిగా పిలుస్తాడు సోమాల్య నాయక్. మాస్టారు 'తీజ్' పండుగ విషయాలను తెలుసుకుంటాడు. కానీ, గిరిజనుల ఆచారాలను పాటించడు. అలా అని సోమాల్య నాయక్ గిరిజనేతర సంస్కృతినీ పాటించలేదు. సోమాల్య నాయక్ భార్య రూప్లిబాయి. రూప్లిబాయి స్కూలు మాస్టారుని సోదరుడిగా భావించి తన కూతురు కోసం బ్లౌజు కుట్టించుకుని రమ్మంటుంది. కొన్ని రోజుల తర్వాత స్కూలు మాస్టారు బ్లౌజు తెచ్చి సోమాల్య నాయక్ కూతురు ఝూమ్రికి ఇస్తాడు. ఆ విషయం సోమాల్య నాయక్‌కు తెలియదు. దాన్ని ఝూమ్రి ధరించిన తర్వాత తెలుస్తోంది. అది తెలుసుకొని సోమాల్య నాయక్ స్కూలు మాస్టారుని హెచ్చరిస్తాడు. ఎందుకంటే "మా రీతీ, రివాజూ పోగొట్టుకునేందుకు మేము తయారుగా లేము. ఈ ఆడవాళ్ళకు బుద్ధిలేదు. రవికె, ఓణీ, మాంగల్యం లాంటి అలంకారం జాకెట్టుకి ఉంటుందా? మేము పూర్తిగా మీలాగా అయిపోవాలంటారా? మేము పైకి రావాలంటే మావి అనేవి విడిచిపెట్టాలనేం లేదు... ఈ రోజు మా వృత్తికి మోసం వచ్చింది." అంటే తమ సంస్కృతి ఎక్కడ మరుగున పడుతుందోనన్న భయం వల్ల, తమ ఆత్మగౌరవం కాపాడుకోవడం కోసం అలా చేశాడని తెలుస్తోంది. కాబట్టి ఇది అనంగీకృత సంస్కృతిని తెలుపుతుంది.

దీన్ని మనం జాగ్రత్తగా పరిశీలిస్తే, గిరిజనుల్లో శీలానికిచ్చే ప్రాధాన్యత కూడా సంస్కృతిలో అంతర్భాగంగా దాగి ఉంటుందని గుర్తించాల్సి ఉంది. దాన్ని అక్కడే నిరోధించకపోతే, దాని తర్వాత వచ్చే పరిణామాలు చాలా అనర్థాలకు కారణమయ్యే అవకాశం ఉందనే భవిష్యత్తు దృష్టి దానిలో గమనించాలి. ఇది కేవలం ఒక ఉదాహరణ మాత్రమే. గిరిజనులు అడవుల్లో పశు పక్ష్యాదుల భౌతిక, మానసిక స్థితిగతుల్ని అనుభవపూర్వకంగా, వాటి దగ్గరగా ఉండి పరిశీలించిన జీవితమే అలాంటి ముందుచూపుని ప్రసాదించింది. అది ప్రకృతి ప్రసాదించిన వరం. ప్రకృతిలో జరిగే పరిణామాల్ని శాస్త్రవేత్తలు కూడా. గమనించలేని వాటిని ఎన్నింటినో చెప్పగలిగిన సామర్థ్యం ఒక విధంగా చెప్పాలంటే గిరిజనులకే సొంతం. అలాంటి దృష్టి గలిగిన గిరిజనులు మానవుల మనస్తత్వాల్ని కనిపెట్టలేరా? నేడు అక్రమ సంబంధాల వల్ల జరుగుతున్న అనర్థాలు లెక్కలేనన్నివి. వాటన్నింటికీ మూలం ఆకర్షణ, ఆర్థిక లేమి వంటివెన్నో శారీరక సంబంధాలకు, అనామోదిత సంబంధాలకు కారణమై సామాజిక రుగ్మతలకు కారణమవుతున్నాయి. వీటన్నిటినీ ఎక్కడా చెప్పకుండా చిన్న సంఘటనగా గిరిజన పాత్ర ద్వారా రచయిత ఆ సంస్కృతిలోని స్ఫురద్రూపాన్ని ఔచిత్యవంతంగా ఆవిష్కరించారు.

గిరిజనుల అభివ్యక్తి, ప్రత్యేకత ఇక్కడ ప్రతిఫలిస్తుంది. దీన్ని రచయిత బాగా పట్టుకున్నాడు. కుటుంబ సంబంధాలలో ఇతరులు ఎంత కావలసిన వారైనా ఏ విషయాల్లో ఎంతవరకు ఉండాలో అంతవరకే ఉండాలి. అలా కానప్పుడు ఆ వ్యక్తి కుటుంబంలో మనస్పర్థలు రావడానికి కారణమవుతాయి. అంతేకాకుండా ఆ కుటుంబం పట్ల ఆ జాతేతరులు లేదా ఆ తెగకు చెందినవారు ఆ తెగని అవమానించడానికి మార్గాన్ని తెరిచినట్లు కూడా అవుతుంది. కాబట్టి సోమాల్య నాయక్ తమ సంస్కృతిని కాదనలేక ఆధునిక సంస్కృతిని స్వీకరించలేక మాస్టారుని హెచ్చరించాడని గమనించాలి. ఎందుకంటే ఎవరి సంస్కృతి వాళ్ళకు గొప్పగా తోచడం అనేది నగ్నసత్యం.

ఉదాహరణకు హిందూధర్మం ప్రకారం బ్రాహ్మణులు సముద్ర ప్రయాణం చేయడం, నౌకాయానం చేయడం పాపమనే నమ్మకం ఉండేది. అటువంటి వాళ్ళు ఆధునిక సంస్కృతిని, అందులో ఉండే గొప్ప విషయాలను తెలుసుకొని ఆ సంస్కృతిని స్వీకరించడానికి నేడు ప్రయత్నిస్తునే ఉన్నారు. ఇంకా వాళ్ళలో కూడా చాలామందిలో ఉండే భయాలు అలాగే ఉన్నాయి. అందువల్ల ఏ జాతి వాళ్ళైనా మారడానికి సమయం పడుతుంది. సోమాల్య నాయక్ విషయంలో కూడా అదే జరిగింది. ఒకవేళ మారినా, తమ మూల సంస్కృతిలో ఉండే పద్ధతులు మాత్రం మరిచిపోరనే విషయాన్ని ఇక్కడ మనం గమనించాలి. కాబట్టి దీనిని అనంగీకృత సంస్కృతి అనవచ్చు.

ఆధునిక కాలంలో గిరిజన సంస్కృతిని పరిశీలించి నట్లయితే అనేక మార్పులు చోటుచేసు కుంటున్నాయి. ఆహారపు అలవాట్లు, దుస్తులు, వేషధారణ, జీవన విధానం, భాషలో, భావంలో గణనీయంగా మార్పు వస్తోంది. గిరిజనులు ఆధునిక ఆహారానికి అలవాటు పడినప్పటికీ, తమ ఆహారానికే ఎక్కువ ప్రాముఖ్యత ఇస్తున్నారు. ఒకప్పుడు గిరిజన స్త్రీలు తమ సంప్రదాయ దుస్తులకే ఎక్కువ మక్కువ చూపేవారు. కాని నేడు ప్రపంచీకరణ నేపథ్యంలో ఆధునిక దుస్తులను ధరిస్తున్నారు. నేడు గిరిజన సంస్కృతి ప్రపంచ సంస్కృతి అందులో భాగమైన భారతీయ సంస్కృతితో సమానమైన గుర్తింపును పొందలేక పోయినా, సినిమాల్లో, టీవిల్లో, సభల్లో సమావేశాలల్లో గుర్తింపును పొందుతుంది. కేవలం వ్యాపారం దృష్టితో మాత్రమే దానిని పరిగణించ కుండా, సహృదయంతో చూడాలని ఈ నవల వల్ల తెలుస్తోంది. అంతే కాకుండా నూతన సంస్కృతిని గ్రహించినంత మాత్రం చేత వారి జీవితాల్లో పూర్తిగా మార్పు వచ్చేసిందని అనలేం. అందులో కూడా అంగీకృత అనంగీకృత సంస్కృతులు ఉంటాయని గుర్తించాలి.

పై రెండు నవలల్లో రాందాసు గిరిజనేతరుడు, బాసప్ప మాష్టారు కూడా గిరిజనేతరుడు.

రాందాసు గిరిజ నేతరుడైనా తాండాలో భజనల ద్వారా, మంచి మాటలు చెప్పి, సర్వం అన్ని విషయాలలో మార్పును తేవాలని భావించి, చివరికి వాళ్ళలో చైతన్యం తెస్తాడు. దాంతో రాందాసు అనుకున్నది సాధించుకున్నట్లు భావించుకుంటాడు.

తాను గిరిజన స్త్రీని పెండ్లాడి తనకు సంతానం కలిగినా, గిరిజన సంస్కృతిని మాత్రం అంగీకరించినట్లు నవలలో ఎక్కడా చూపలేదు.

రాందాసు మార్పును కోరుకున్నా, గిరిజనులు మారినట్లు మారి, చివరకి తమలో దాగివున్న మూఢాచారాల వల్ల రాందాసును హత్య చేస్తారు. అంటే వాళ్ళు గిరిజనేతర మార్పును తిరస్కరించినట్లే కదా? ఇక్కడ మరో విషయాన్ని గమనించాలి. రాందాసు గిరిజనేతరుడు కాబట్టి అతడు చేసిన మంచి పనులకుగాను అతడ్ని అవతార పురుషుడని, దేవుడని తాండా వాళ్ళు భావించుకుంటారు. కాని 'కాలు' మాత్రం రాందాసును దేవుడు కాదని, మనలాంటి వ్యక్తేనని మొదటి నుండి చెప్తుంటాడు. చివరికి కాలు చెప్పిందే జరుగుతుంది. అయితే రాందాసు గిరిజనేతరుడు కాబట్టి హత్య చేయబడ్డాడా? లేదా గిరిజనులకు తెలియక హత్య చేశారా? అంటే అక్కడ అనంగీకృత సంస్కృతిని స్వీరించారు కాబట్టి హత్య చేశారు. అదే పాత్రలో గిరిజనుడు ఉంటే అలా జరిగేదా అంటే అవసరాన్ని బట్టి వ్యక్తి, లేదా వ్యక్తులు నడుచుకుంటారని సమన్వయించుకోవాల్సి ఉంటుంది.

సమాజంలో మానవుని ఆలోచన విధానం నిరంతరం మారుతుంటుంది. మనిషి ఆపదలో ఉన్నప్పుడు ఆదుకుంటే అతడ్ని దేవుడని అనటం సహజం. అదే వ్యక్తి కీడు చేస్తున్నడని తెలిస్తే చంపడానికి కూడా వెనకడుగు వేయరని తెలుస్తోంది. రచయిత ఈ విషయంలో ఎంతో వాస్తవికతను ప్రదర్శించాడు. ఎందుకంటే గిరిజనేతరుల మార్పును గిరిజనులు తొందరగా గ్రహించరు. నిరక్షరాస్యత వల్ల చాలామంది తమ ఆలోచనల్లో తార్కికతను మరింతగా పెంచుకోలేకపోతున్నారనిపిస్తుంది. కానీ, వాళ్ళ అనుభవాలను వ్యక్తీకరించే భాష, ప్రాంతం అంటే తగిన వాతావరణం ఏర్పడితేగాని వారి సంస్కృతి లోని వైవిధ్యాన్ని స్పష్టంగా నిర్ణయించలేం. గిరిజనులు తమ అనుభవాల్ని స్వేచ్ఛాయుత వాతావరణంలో వ్యక్తీకరించ గలిగే పరిస్థితులు రాగలిగి నప్పుడు మిగిలిన సమాజంలో వారివలే వీరూ పరిగణన పొందుతారు. అయినప్పటికీ, గిరిజనేతరులు కేవలం గిరిజనుల్లో అంగీకృత సంస్కృతినే గ్రహిస్తున్నారు కాని అనంగీకృత సంస్కృతిని గ్రహించడం లేదు. ఎప్పుడైతే ఈ రెండు సంస్కృతులను గుర్తిస్తారో అప్పుడు సంస్కృతిలో పూర్తి మార్పు వస్తుంది.

'తాండా' నవలలో బాసప్ప మాష్టారు టీచర్ వృత్తిని నిర్వహిస్తూ, తాండా అంతర్గత విషయాల్లో జోక్యం చేసుకుంటాడు. దాని వల్ల తండా ప్రజలలో చైతన్యం తేగల్గాడు. కాని పూర్తి స్థాయిలో నెరవేరలేదు. ఆ తర్వాత తండా ప్రజలలో వచ్చిన మార్పుల వల్ల మాష్టారు స్కూలు నుండి బదిలీ కావడం జరుగుతుంది. అందువల్ల మానవ సంబంధాల్లో ఎవరైనా ఎంతవరకు ఉండాల్లో అంతవరకే ఉండాలి. ఈ నవలలో కూడా స్కూలు మాష్టారు తండా ప్రజలలో అంగీకృత సంస్కృతినే గ్రహించాడు గానిట అనంగీకృత సంస్కృతిని గ్రహించలేదు.

తాండా నవలలో చిత్రించిన కర్ణాటక లంబాడీల సంస్కృతి, ఆంధ్రప్రదేశ్ లంబాడీల సంస్కృతి ఈ రెండు నవలల్లో తులనాత్మకంగా చూసినప్పుడు ఇంచుమించు ఒకటిగానే కనిపిస్తుంది. సంస్కృతిలో భాగమైన దుస్తులు, ఆభరణాలు, భాషా విషయాల్లో కొంత తేడా కనిపిస్తుంది. కర్ణాటక లంబాడీలు పరస్పరం ఏడ్చేటప్పుడు వాడే భాషలో, ఇక్కడ లంబాడీలు ఏడ్చేటప్పుడు వాడే భాషలో కొంత తేడా ఉంటుందని గమనించాలి. అందుకు కారణం లేకపోలేదు. ఏ ప్రాంతంలో అయితే వ్యక్తులు జీవిస్తారో, ఆ ప్రాంత ప్రభావం, భాష ప్రభావం ఉంటుంది. కాబట్టి ఈ మార్పు సహజం. అందువల్ల ఎప్పుడైతే సంస్కృతిలో మార్పు వస్తుందో ఆ మార్పును సాహిత్యపరంగా సృజనీకరించినప్పుడే ఆ జీవితాలు వెలుగులో వచ్చే అవకాశం ఉంటుంది.

పై రెండు నవలలు గిరిజన జీవితాలలో ఉండే భిన్న పార్శ్వాలను కొంతమేరకైనా వివరించడానికి ప్రయత్నించాయని నిస్సందేహంగా చెప్పవచ్చు. ప్రస్తుతం గిరిజన నవలలు గిరిజనుల జీవితాల్లోని ప్రాథమిక దశనే ఎక్కువగా చిత్రీకరిస్తున్నాయనిపిస్తుంది. ఎందుకంటే ఈ నవలలు సానుభూతితో వచ్చినవే కాని, అనుభవం లోంచి రాలేదు. అలా రావాలంటే ఆ అడవుల్లో నుండి, ఆ తాండాల్లో నుండి, ఆ కొండల్లో కోనల్లో నుండి రచయితలు పుట్టుకు రావాలి. ఆ రచయిత అనుభవించిన తన జీవితం గూర్చి, తాను పడ్డ సాధక బాధకాల గూర్చి రాసినప్పుడు అది నిజమైన జీవితంగా భావించవచ్చు. అయితే గిరిజన తెగల గురించి, వాళ్ళ జీవితాల గురించి, రికార్డు అయినప్పటికీ జీవితాలను చిత్రించి అవి ప్రజల్లో తీసుకెళ్ళగల్గి వాళ్ళను చైతన్యవంతులుగా చేసినప్పుడు వీటికి మరింత ఫలితం వస్తుంది. అందుకు గిరిజనులపై పరిశోధన వివిధ భిన్న కోణాల్లో జరగాల్సిన అవసరం నేడు ఏంతైనా ఉంది. మొత్తం మీద సానుభూతితో రాసినా ఈ రెండు నవలల్ని గిరిజనుల ప్రాథమిక సంస్కృతిని సాధ్యమైనంత సామాజిక వాస్తవికతతో వర్ణించిన నవలలుగానే నిర్ణయించవచ్చు.

**ప్రస్తుతం గిరిజన నవలలు గిరిజనుల జీవితాల్లోని ప్రాథమిక దశనే ఎక్కువగా చిత్రీకరిస్తున్నాయనిపిస్తుంది. ఎందుకంటే ఈ నవలలు సానుభూతితో వచ్చినవే కాని, అనుభవంలోంచి రాలేదు. అలా రావాలంటే ఆ అడవుల్లో నుండి, ఆ తాండాల్లో నుండి, ఆ కొండల్లో కోనల్లో నుండి రచయితలు పుట్టుకురావాలి. ఆ రచయిత అనుభవించిన తన జీవితం గూర్చి, తాను పడ్డ సాధక బాధకాల గూర్చి రాసినప్పుడు అది నిజమైన జీవితంగా భావించవచ్చు.**

కథ

# ప్రయాణం

- కోపూరి పుష్పాదేవి



**"నాకో సమస్య వచ్చిందే వారిజా..." ఫోన్ ఎత్తగానే దీనంగా వినిపించింది అనూష గొంతు.**

**ఊరందరి సమస్యలూ తీర్చే 'ఆపద్బాంధవి'వి నువ్వు. నీకు సమస్య రావడమేమిటి...? దాన్ని ఉడికిస్తూ అన్నాను.**

**"అది అంత చిన్న సమస్యకాదు ఫోన్‌లో చెప్పడానికి... నేను రాత్రికి బయలుదేరి విజయవాడ వస్తున్నాను." అంటూ చటుక్కున ఫోన్ పెట్టేసింది.**

"ఇది మళ్ళీ తలమీదకు ఏం తెచ్చుకుందో ఏమిటో.... చెబితే వినదూ... అర్థం చేసుకోదూ... ప్రజాసేవా, దేశ సేవ అంటూ బయలుదేరుతుంది... అయినా చక్కగా భర్తా, ఇద్దరు పిల్లలతో హాయిగా సాగిపోయే సంసారమేనా దానిది... దానికి సమస్యేమిటబ్బా... దాని అత్తామామలు కూడా ఎక్కడో పల్లెలో ఉంటారు. వాళ్ళు కూడా చాలా మంచివాళ్ళని చెప్పిందే... మరి దీనికి సమస్య ఏమి వచ్చి ఉంటుంది....? ఆర్థికమా..., అనారోగ్యమా..., ఆఫీసులోనా...? విషయం ఏమిటో పూర్తిగా చెప్పకుండా నన్ను సస్పెన్సులో పెట్టి చంపుతోంది బుర్ర బద్దలు కొట్టుకోమని... రానీ, రేపు చెప్తా దాని పని..." అనుకున్నా ఫోన్ పెట్టేస్తూ.

అనూషా, నేనూ డిగ్రీలో క్లాస్‌మేట్స్‌మి. హాస్టల్లో రూమ్‌మేట్స్‌మి. అందువల్ల ఆ మూడేళ్లూ మా స్నేహం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా వర్ధిల్లింది. నిజానికి ఎవరితోనూ త్వరగా కలిసిపోయే స్వభావం కాదునాది. ముభావంగా మొహమాటంగా ఉండేదాన్ని. అది మాత్రం యమా స్పీడు. చాలా చురుకుగా, చలాకీగా ఉండేది. ఎవరికి ఏ చిన్న సమస్య వచ్చినా, "నేనున్నాను" అంటూ తయారయ్యేది. తనకు చేతనయినంత వరకు వారికి సాయపడేది. అందుకే మేమందరం దాన్ని "ఆపద్బాంధవి అనూషా" అని ముద్దుగా పిలుచుకునే వాళ్ళం. పుష్పం చుట్టూ తుమ్మెదల్లా దాన్ని అంటి పెట్టుకునే ఉండేవాళ్ళం. ముఖ్యంగా నేను దాని స్నేహం అనే ఫెవిస్టిక్‌కు అంటుకుపోయాను. అందుకే మా ఇద్దరినీ కలిపి 'జంటకవులు" అని పిలిచేవాళ్లు మా మిత్ర బృందం.

అనూష స్టేట్ బ్యాంక్‌లోనూ, దాని భర్త అవినాష్ రైల్వేలోనూ ఉద్యోగాలు చేస్తున్నారు. నివాసం హైదరాబాద్. మావారు జవహర్ పబ్లిక్ వర్క్స్ డిపార్ట్‌మెంట్లో ఇంజనీర్. మా పెళ్ళయ్యి పదేళ్ళు కావస్తున్నా మాకింకా పిల్లలు లేరు. నా దిగులంతా అదే. పిల్లల కోసం మేము పడని పాట్లు లేవు. హాస్పిటళ్లు, బాబాలూ, అమ్మలూ, తీర్థయాత్రలూ అన్నీ అయినై. ఫలితం మాత్రం శూన్యం. నెలవ్వగానే నేను వెలుపలికీ, నా కంటి నీరు బయటికీ.

నేను దిగులుతో చిక్కి శల్యమయ్యాను. నా దిగులు చూసి మావారు దిగులు పడేవారు. ఒకసారి మా ఇంటికి వచ్చిన అనూష మా ఇద్దరినీ చూసి మండిపడింది. "నీ కసలు బుద్ధుందా...? జ్ఞానం ఉందా...? పిల్లల కోసం అంతలా దిగులుపడి ప్రాణాల మీదకు తెచ్చుకుంటావా..? నువ్వు హింసపడుతూ, అతన్నీ హింస పెడతావా..? పిల్లల తోడిదే లోకమా...? పిల్లలే ప్రపంచమా...? బయట ఎంతోమంది ఆర్తులు, అనాథలు వున్నారు. వారికి ఎంతో కొంత సేవ చేయ్యొచ్చు కదా...?" అంటూ నా మీద అంతెత్తున ఎగిరింది.

"మాకు అవన్నీ చేతకావు. ఎవరైనా వచ్చి సహాయం చెయ్యమంటే తోచినంత చందా ఇస్తాము కానీ, నీలాగా లోకమంతా తిరిగి దేశ సేవ చేయడం మా వల్లకాదు..." అన్నాను.

"అయితే ఏ అనాథాశ్రమం నించో మీకు నచ్చిన అమ్మాయినో, అబ్బాయినో చూసి తెచ్చుకుని చక్కగా పెంచుకోండి..."

"అబ్బెబ్బే... వాళ్లు ఏ కులం వాళ్లో... ఏ మతం వాళ్లో...? ఎలాంటి పుట్టుక పుట్టారో...? అలాటి వాళ్లు వద్దంటే వద్దు... నా చీదరనంతా ఆ మాటల్లో వ్యక్తీకరించాను.

కులంలో, మతంలో ఏముందే పిచ్చిదానా... మనిషిని బట్టీ, మనసుని బట్టీ ఉంటుందిగానీ..., నీలాంటి మూర్ఖులే హర్యానాలో కూడా... ఈ మధ్య అక్కడ "పరువు హత్యలు" అని జరుగుతున్నాయట. తమ పిల్లలు వేరే కులం వాళ్ళనీ, వేరే మతం వాళ్ళనీ ప్రేమించి పెళ్ళిళ్లు చేసుకుంటే, అక్కడి "కుల పెద్దలు" కోపించి ఆ వధూవరులను హత్యలు చేయిస్తున్నారట...! మానవత్వాన్ని నిలువనా పాతేస్తున్నారట... ఇదెంత దారుణమో ఆలోచించావా...?"

"ఏమో... అవన్నీ నాకు తెలియదు. నేను మాత్రం వేరే కులం వాళ్లనీ, వేరే మతం వాళ్ళనీ పెంచలేను... నువ్వేమన్నా అనుకో..."

"మన ప్రయాణం అథమ స్థితి నుంచి ఉన్నతం వైపు సాగాలి. మన ఆలోచనలు సర్వమానవ సౌభాతృత్వం, విశ్వ ప్రేమల వైపు మళ్ళాలి. శాంతి సుమాలు లోకమంతా వెల్లివిరియాలి..."

"అబ్బో... నువ్వు గొప్ప ఉపన్యాసకురాలివని తెలుసుగానీ, నేను సామాన్యురాలిని. నన్నిట్లా మామూలుగా బతకనివ్వమ్మా..."

"నువ్వో పెద్ద మూర్ఖురాలివి. నిన్ను మార్చడం నావల్ల కాదుగానీ, అయితే మీ బంధువుల్లో ఎవరి పిల్లలనైనా చూసి దత్తత చేసుకోవచ్చు గదా...?"

"అదీ ఆలోచించామే..., మా బావగారికి ముగ్గురు అబ్బాయిలు. అడిగితే ఒకడిని మహా సంతోషంగా ఇస్తారు. కానీ, మా తోడికోడలికి అధిక కోపం. అపర దూర్వాసురాలంటే నమ్ము. తల్లి పోలిక పిల్లవాడికి వచ్చిందనుకో... నేను తట్టుకోలేను. ఇక మా అన్నయ్యకీ ముగ్గురు పిల్లలు. ఒకరిని తీసుకోవచ్చు. కానీ అన్నయ్యకి తాగుడు వ్యసనం ఉంది, అందుకని వాళ్ళబ్బాయినీ వద్దన్నాను. మిగిలిన వాళ్ళకి ఒక్కొక్కరే సంతానం."



"ఇదండీ వరస... అందరికీ అన్ని వంకలూ పెడుతుంది. ఎవరిని పెంచుకోవడానికీ ఒప్పుకోదు, పిల్లల్లేరని దిగులు పడటమూ మానదు. ఇలా నా ప్రాణం తీస్తోంది" అన్నారు. అప్పుడే వచ్చిన ఆయన ఎన్నాళ్ళుగానో కడుపులో దాచుకున్న బాధను బయటపెడుతూ.

"ఇది వట్టి తిక్క మనిషండీ బాబూ" ఆయనతో అంటూ, అసలు మీ అన్నయ్య అలా తయారవడానికి కారణం ఎవరంటావు?" అడిగింది అనూష నేను కోసిచ్చిన యాపిల్ ముక్కలు అందుకుంటూ.

"ఖచ్చితంగా మా అమ్మ. తర్వాత నాన్నగారు. తర్వాత వదిన.." అన్నాను నేను.

''అదేమిటీ... అంతంత డబ్బూ, ఆరోగ్యమూ తగలేసుకుంటూ తాగుతున్న మీ అన్నను వదిలేసి వాళ్లనంటావేమిటి...? అన్నారు ఆయన.

"అవునండీ... అది అన్నది వంద శాతం నిజం. మన ఇళ్ళలో ఆడపిల్లల్ని అతిగా కట్టడి చేసే మన పెద్దవాళ్ళు మగపిల్లల్ని మాత్రం చూసీ చూడనట్లు వదిలేస్తారు. వాళ్లు కాలేజ్‌లో ఆడపిల్లల్ని, లెక్చరర్లనూ ఏడిపిస్తున్నా, రోడ్‌సైడ్ రోమియోల్లా తిరుగుతున్నా, సిగరెట్లూ, మందూ అలవాటు చేసుకుంటున్నా పెద్దగా పట్టించుకోరు. ఏదైనా సమస్య వచ్చినప్పుడు మాత్రం స్నేహితుల వల్ల నా కొడుకు చెడిపోయాడని పక్కవాళ్ల మీద పడి ఏడుస్తారు. మన బంగారం మంచిదా, కాదా అని చూడరు" ఆవేశంగా అన్నది అనూష.

"నిజమే... మొదటిసారి అన్నయ్యతాగి వచ్చినప్పుడే అమ్మవాణ్ణి గట్టిగా మందలించి, నానా రభస చెయ్యాల్సింది. అలాకాక, ఇరుగుపొరుగు వాళ్ళకి తెలుస్తుందనీ, నాన్నగారికి తెలిస్తే తిడతారని కొన్నాళ్ళు, వ్యసనం ముదిరాక నాన్నగారికి తెలిసినా, పెళ్ళి కావలసినవాడు, నలుగురికి తెలిస్తే ఎవరూ పిల్లనివ్వరు" అంటూ కొన్నాళ్లు దాచిపెట్టారు."

"ఇంక మనవాళ్ళు" పెళ్ళి అయితే బాధ్యత మీదపడి బుద్ధిమంతుడవుతాడు'' అంటూ ఆత్మవంచన చేసుకుని, ఆ బుద్ధిమంతుడికి హడావుడిగా పెళ్లి కూడా చేసేస్తారు మరొకమ్మాయి జీవితం కూడా బలవుతుందని ఆలోచించకుండా..." అన్నది అనూష.

"అవును. అక్షరాలా అలాగే జరిగింది. ఇప్పుడు వదిన కూడా పరువు, ప్రతిష్ట, సింగినాదం జీలకర్ర అనుకుంటూ వాడు ఎన్ని ఆగడాలు చేసినా మౌనంగా పడి ఉంటుంది. కానీ, ఎప్పుడైనా కోపం వచ్చి గట్టిగా అడిగితే "ఇలా ఇష్టమైతే ఉండు. లేదా... నీ దారి నువ్వు చూసుకో" అంటాడు. ఆమెది వానాకాలం చదువు. ముగ్గురు పిల్లలతో వెళ్ళి పుట్టింటి వారికి భారం కాలేదు కదా... తన కాళ్ళ మీద తాను నిలబడి పిల్లల్ని పోషించుకునే ధైర్యమూ, తెలివితేటలూ ఆమెకి లేవు. అందుకే తన మానాన తను చీరలూ, సినిమాలూ అంటూ డబ్బు తగలేస్తూ ఉంటుంది.."

"అవును. చాలామంది అంతే... వ్యసనపరులైన భర్తల్ని ఏమీ చెయ్యలేక, తమ కసి, ఉక్రోషం ఇలా తీర్చుకుంటూ ఉంటారు...' అన్నది అనూష. ఎవరో తలుపు కొడుతున్నారు. గతంలోంచి బయటకు వచ్చి తలుపు తియ్యడానికి వెళ్లాను.

...

మరునాడు ఉదయమే హైదరాబాదు నుండి ఒక అందమైన ముద్దులొలికే బాబుతో రైలు దిగింది అనూష. దాన్ని తీసుకురావడానికి స్టేషనుకి వెళ్లిన నేను దాని చేతిలోని సుమారు ఆరునెలల బాబుని చూసి ఆశ్చర్యపోయాను.

"ఈ బాబు ఎవరు..?" ఆరాటంగా అడిగాను.

"నన్ను ఇంటికి రానీయవే తల్లీ... అన్నీ వివరంగా చెప్తాను. బాగా తలనెప్పి పట్టుకుంది. ఇంటికి వెళ్ళగానే ఒక కప్పు కాఫీ నా ముఖాన పొయ్యి" అన్నది నిద్రపోతున్న బాబుకు చలిగాలి తగలకుండా తెల్లని టర్కీ టవలు కప్పుతూ.

వేడివేడి కాఫీ ముఖాన పోస్తే ఏడుస్తావుగానీ, చక్కగా చేతికిస్తాను. తీరికగా తాగుదువుకాని, ఈ బాబు ఎవరబ్బాయో చెప్పవే..." అన్నాను టర్నింగ్‌లో కారు జాగ్రత్తగా మలుపు తిప్పుతూ.

"అబ్బ... ఏం ఆదుర్దానే తల్లీ..., ఇంత దూరం వచ్చిన దాన్ని నీకు చెప్పకుండా వెళ్ళిపోతానా...?"

"అయితే ఉత్కంఠ పొడిగింపు మరికాసేపు తప్పదన్నమాట..., సరేకానీ, నీ కోసం ఎన్ని భరించలేదూ...?"

"ఎన్ని భరించావేమిటి నా కోసం..." అంటూ నా నెత్తిన చిన్న మొట్టికాయ వేసింది.

"ఇవిగో... ఇలాంటివే...సరేగానీ కారుదిగు... ఇల్లు వచ్చేసింది." అన్నాను.

...

స్నానం గీనం చేసి తీరికగా టిఫిన్ తింటూ అప్పుడు మొదలు పెట్టింది అనూష బాబు గురించి "ఈ బాబు మావారి ప్రాణ స్నేహితుడు శరణ్ కొడుకు. అతనిది ప్రేమ వివాహం. ఇరువైపులా పెద్దలకు అది సుతరామూ ఇష్టం లేదు. అందుకని ఉద్యోగం బదిలీ చేయించుకుని వాళ్ళకు దూరంగా వచ్చేసి రెండేళ్లు ముచ్చటగా కాపురం చేశారు. మా పక్క ఇంట్లోనే ఉండేవారు. కనుక ప్రతిదానికీ నన్ను సలహా అడిగేది ఆ అమ్మాయి. నెలతప్పి, వేవిళ్లూ అదీ ఇదీ అని ఆరోగ్యం బాగుండకపోతే అన్నీ మేమే చూశాము. బాబు పుట్టాక తెలియజేసినా, వాళ్ళ వాళ్లెవరూ రాలేదు. బాబు దురదృష్టం... వాడి పాల కోసం ఒకరోజు తెల్లవారుజామున స్టౌ వెలిగిస్తుండగా గ్యాస్ లీకయి పెద్ద ప్రమాదం జరిగింది. ఒళ్ళంతా కాలి బాబు తల్లి చనిపోయింది. ఆమెను ఎంతగానో ప్రేమించి, పెద్దలను ఎదిరించి మరీ పెళ్ళి చేసుకున్న అతను భార్యను ఆ స్థితిలో చూసి తట్టుకోలేకపోయాడు. విపరీతంగా కృంగి పోయాడు. మానసిక స్థిమితం కోల్పోయాడు. ఈ సంగతులన్నీ ఎలా తెలిశాయో ఏమో, అతని తల్లిదండ్రులు వచ్చి పసివాణ్ణి చీదరించుకుని, తమ కొడుకుని మాత్రం తీసుకువెళ్ళిపోయారు. ఆమె తల్లి దండ్రులు" మా కూతురు ఏనాడో చచ్చి పోయింది. ఈ పిల్లవాడితో మా కెటువంటి సంబంధమూ లేదని" తెగేసి చెప్పారు.

పెళ్ళి దగ్గర నుంచీ శరణ్ మంచి చెడులన్నీ చూసిన మాకు ఇప్పుడీ బాబు బాధ్యత తప్పలేదు. "ఏదో ఒక అనాథ శరణాలయంలో పారెయ్యమని అతని తల్లిదండ్రులు మాకు సలహా చెప్పారు. కానీ, నాకూ ఆయనకూ ఆ కిరాతక కార్యం చెయ్యడానికి ప్రాణం ఒప్పలేదు. నేను నా పిల్లలతో పాటే వీణ్ణి పెంచుదామనుకున్నాను. కానీ, నా ఉద్యోగం... నా పిల్లలంటే స్కూలుకు వెళ్ళిపోతారు. వీణ్ణి క్రెష్‌లో వదలవచ్చు. కానీ ఇప్పటికే పిల్లలూ, ఉద్యోగం, ఇంటి పనులతో నాకు శ్రమ అవుతోంది. ఇప్పుడీ పసివాడికి మందులూ, మాకులూ, ఆసుపత్రులూ అంటూ తిరిగే ఓపిక కనపడలేదు.ఎలాగా...? అని మల్లగుల్లాలు పడుతుంటే చటుక్కున నువ్వు గుర్తుకొచ్చావు. సరే... నీకు ఇష్టమైతే నీ దగ్గర కొన్నాళ్లు ఉంచుదామని తీసుకువచ్చాను. నీకూ మంచి కాలక్షేపం అవుతుంది, నీ సరదా తీరుతుంది, పసిపిల్లల్ని పెంచే విధానంలో ప్రాక్టీసూ వస్తుంది... నీకూ, మీ వారికీ పూర్తిగా ఇష్టమయితేనే సుమా..." అన్నది అనూష అప్పటికే నా ఒడిలో చేరిన బాబును చూస్తూ.

"చూద్దాం... నాకు ఇష్టమే. ఆయన్ని కూడా అడుగుతాను. ఆయన కూడా ఒప్పుకోవచ్చు. అర్ధాంగీకారంగా అన్నాను.

"ఇంతకీ ఈ బాబుదే కులం...?" అడిగాను వాడి గిరజాల వెంట్రుకలు దువ్వుతూ.

"మన కులమేలే..." అన్నది అనూష గుంభనగా నవ్వుతూ.

"అయితే సరే..." అన్నాను సంతృప్తిగా ఇంతకీ వీడికేం పేరు పెట్టారు వీడి అమ్మా నాన్న?

"పాపం... వాళ్లు బాబు పుట్టాకైనా పెద్దవాళ్ళ మనసు కరిగి వీళ్లని ఆదరిస్తారని ఎదురుచూశారు. వాళ్ళ సమక్షంలోనే పేరు పెట్టాలని అనుకున్నారు. ఇంతలో ఇలా అయింది." బాధగా అన్నది అనూష.

• • •

అనూష బాబుని మా ఇంట్లో వదిలి ఆరు నెలలు అవుతోంది. వాడికి 'తేజశ్వి' అని పేరు పెట్టాము. వాడు మా ఇద్దరికీ బాగా మాలిమి అయ్యాడు. చక్కగా ఒళ్లు చేసి, బుడి బుడి అడుగులతో నడవడానికి ప్రయత్నిస్తున్నాడు. అత్త, అమ్మ అంటూ చిట్టిపొట్టి పలుకులతో మమ్మల్ని రంజింపజేస్తున్నాడు. ఇప్పుడు వాడిని వదిలి నేను క్షణం కూడా ఉండలేను. వాడు నా సొంత బిడ్డ కాదన్న విషయమే మరిచిపోయాను. మేము ఇప్పుడు ఇల్లు మారడంతో ఇరుగుపొరుగువారికి కూడా తేజా మా పెంపుడు కొడుకని తెలియదు. నేను నా దిగుళ్ళన్నీ మరిచిపోయి, ఆరోగ్యంగా, ఆనందంగా ఉంటున్నాను. నా ఆనందం ఆయనకి నిశ్చింత కలిగించింది.

మొదట్లో అనూష తరచుగా ఫోన్లు చేసి తేజా యోగక్షేమాలు విచారించేది. ఇప్పుడు పదిహేను రోజులకో, నెలకో చేస్తోంది. ఒక్కసారి మాత్రం భార్యభర్తలిద్దరూ వచ్చి వాణ్ణి చూసి వెళ్ళారు.

మరో వారంలో తేజాకి పుట్టిన రోజు వస్తోంది. బర్త్‌డే ఫంక్షన్ పెద్ద హోటల్లో ఘనంగా జరుపుదామని ఆయనా, నేనూ నిర్ణయించుకున్నాము. నాకు ఈ మధ్య ఒక కొత్త భయం పట్టుకున్నది. ఏమంటే తేజా తండ్రి శరణ్ ఆరోగ్యం బాగుపడి, తన కొడుకు కోసం వస్తాడేమోనని.. బాబుని ఇచ్చెయ్ మంటాడేమో నన్న బెంగ నన్ను పీక్కు తినడం మొదలు పెట్టింది. ఆయనతో అన్నాను, శరణ్ వయసులో ఉన్నవాడు. మళ్ళీ పెళ్లి చేసుకోకుండా, పిల్లల్ని కనకుండా ఉండడు. అందుకని తేజాని మనకే ఇచ్చెయ్యమని అడుగుదామండీ..." అని.

"అతనొచ్చి బాబుని అడిగితే అప్పుడు చూద్దాంలే" అంటూ సమస్యను దాటవేశారు" ఆయన. "ఒకవేళ రేపు మనకి పిల్లలు పుట్టినా తేజాని పంపెయ్యొద్దు" అన్నాను. "సరే సరే..." అన్నారు. ఆయన నా తల నిమురుతూ. ఎందుకో ఆయన కళ్ళలో నీళ్లు తిరిగాయి.

పిల్లలకు నాలుగు రోజులు సెలవులు వచ్చాయంటూ పిల్లలతో సహా దిగింది అనూష ఒకనాడు మధ్యాహ్నం. భోజనాలయ్యాక పిల్లలు ముగ్గురూ వరండాలో ఆడుకుంటున్నారు. అదీ, నేనూ తీరిగ్గా టీవి చూస్తున్నాము హాల్లో. ఆయన ఏదో పనుందని ఊరు వెళ్లారు. రెండు రోజుల దాకా రారు.

"అయితే తేజా మీ ఇద్దరికీ పూర్తిగా నచ్చినట్లేనా..? వాణ్ణి దత్తత చేసుకుంటారా..? అడిగింది అనూష టీవీ చానల్ మారుస్తూ.

"ఏమిటీ శరణ్ మళ్లీ పెళ్ళి చేసుకున్నాడా..? తేజాని ఇక తీసుకువెళ్ళడుగా...? ఆతృత, ఆనందం పెనవేసుకున్న గొంతుతో అడిగాను.

"నేనొక పెద్ద తప్పు చేశానే... నువ్వు మనస్ఫూర్తిగా క్షమిస్తానంటే చెబుతా..." అన్నది అనూష తలవొంచుకుని.

"నువ్వా... తప్పు చెయ్యడమా..? నేను క్షమించడమా.... ఏం జోక్ చేస్తున్నావు తల్లీ..." నవ్వుతూ అడిగాను ఏదో సోది ప్రోగ్రామ్ వస్తుంటే టీవీ కట్టేస్తూ.

"చ... అబద్ధం కాదే... సీరియస్‌గా చెబుతున్నాను. రెండేళ్ల నాడు నువ్వు మా ఊళ్ళో ప్రముఖ గైనకాలజిస్టు దగ్గర అన్ని పరీక్షలూ చేయించుకున్నావు గదా..."

# హైటెక్కులనగరం

- చల్లా రవికుమార్



అక్కడ
ఆకలి విలువ తెలియదు
చీకటంటే అర్థమూ కాదు
అందుకే వందకేరట్ల నగల సింగారంతో
వెలిగిపోయే యువరాణిలా
ధగధగలాడిపోతుంది నగరం
పేదవాళ్ళ కాలనీల్లో
పగటి చాకిరీతో
సొమ్మసిల్లిన నగరం
టయోటా కార్ల కీచుశబ్దాలకి
అర్ధరాత్రి ఉలిక్కిపడి కూర్చుంది
ఆకలికీ, హైటెక్కులకీ మధ్య
ఆయోమయంలో ఏడుస్తుంది పిచ్చి నగరం
పాపం దీని ఒళ్ళంతా సింథటిక్ గాయాలే!

పగలు పనివాళ్ళ చెమటను పీల్చి
నైట్‌క్లబ్బుల్లో పరిమళాన్ని వెదజల్లే నగరం
రాత్రి చీకటి తెరను దించేటప్పటికీ
దిగులు ముఖానికి మెరుపు రంగేసుకుని
హైటెక్ వ్యభిచారిణిలా
ముస్తాబై కూర్చుంటుంది
టక్కరి నగరానికి ఎన్ని నైపుణ్యాలో కదా!

ఆ మూల –
కూలక మిగిలిన నవాబుల కొంపల్లో
గరీబుల ఆకలి మూల్గుల్ని
ఈ మూల డిస్కో థైతక్కలతో
గిటారు మోతల్లో మింగేసి
షాంపైన్ మత్తులో వూగుతోంది నగరం
ఉక్కు కండరాల నగరానికి
సత్తువలేని ఈ నరాల జబ్బేవిటో!
ఫారిన్ వ్యాపారాల పథకాలు
పార్టీ మార్పిడుల వ్యూహరచనలతో
ఛీర్స్ మోతల మధ్య
నగరం హృదయం చితికిపోయింది
అమానవీయ జీవన విలువల్లో
నగరం నలిగిపోయినా
మానవస్పర్శను మరిచిపోతుందా!

దాని కన్నీళ్ళు
మురికివాడల్లో కాలువలై ప్రవహిస్తుంటే
మూసేసిన ఫ్యాక్టరీ బయట
దాని కడుపు ఆకలి సైరనై కూస్తుంది
ఖరీదైన పార్టీల మత్తులో
ఉమ్మేసిన విస్తర్ల కోసం
చెత్తకుండీల సాక్షిగా
కుక్కలతో కయ్యానికి దిగింది
పేగులు పోటెత్తిన ఆకలి నగరం
రెడ్‌లైట్‌కాంతుల కాంక్షల కింద
దాని మానాలనిండా అవమానాల పుళ్ళే!

ఇలా చూడు–
రూపాయలు చేసిన గాయాలతో
దాని గుండె ఎలా నిర్జీవమయ్యిందో
పురిటి బాధల మన నగరానికిప్పుడు
పునర్జన్మకావాలి.

---

"అవును... చేయించుకున్నాను... పిల్లలు పుట్టే అవకాశం ఉందని, మందులు కూడా రాసిచ్చారు కదా..."

"నిజమే... నీకు అలాగే చెప్పాము. కానీ, నీలో లోపం ఉందనీ, బిడ్డలు కలిగే అవకాశం ఎంత మాత్రమూ లేదని తెలిస్తే నువ్వు తట్టుకోలేవనీ, ఏదైనా అఘాయిత్యానికి సిద్ధపడతావనీ...., జవహరూ, నేనూ నీ దగ్గర ఆ సంగతి దాచాము. నీకు ఎవరి పిల్లల్నీ పెంచుకోవడం కూడా ఇష్టం ఉండదు.... అందుకని.."

"అందుకని ఏం చేశారు..? దుఃఖంతో గొంతు పూడుకుని పోగా పెగుల్చుకుని అడిగాను.

"తేజా శరణ్ కొడుకని నీకు అబద్ధం చెప్పాము."

"అబద్ధమా...? మరి తేజా ఎవరి కొడుకు? శరణ్ ఎవరు...?"

"శరణ్ అంటూ ఎవరూ లేరు. తేజాని అనాథాశ్రమం నుంచి తెచ్చాము. నేనూ, అవినాషూ, జవహరూ కలిసి..."

"ఓసి దెయ్యమా... ఇంత పన్నాగం పన్నారా మీ ముగ్గురూ కలిసి...

నా మీద ఇంత కుట్ర చేస్తారా..? నా ఆచారమూ, సంప్రదాయమూ మట్టిలో కలుపుతారా..? ఆవేశం, కోపం, బాధ అన్నీ కలిసి నన్ను అతలాకుతలం చెయ్యగా ముక్కు పుటాలు అదురుతుండగా పెదవులు వణుకుతుండగా పెద్దగా అరిచాను." ఎంత పని చేశారే..?" అంటూ తలబాదుకుంటూ ఏడిచాను.

"నీకు ఇష్టం లేకపోతే తేజాని నేను తీసుకువెళ్ళిపోతాను. నా పిల్లల్తో పాటే పెంచుకుంటాను. అందుకు మావారూ, నేనూ సిద్దపడే వాణ్ణి అక్కడి నుంచి తెచ్చాము" అన్నది అనూష.

"అంటే పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం వడ్డించి, తినబోతుంటే విస్తరి లాగేస్తావన్న మాట... ప్రాణ స్నేహితురాలివని నమ్మితే ఇంత ద్రోహం చేస్తావన్నమాట... నిన్నేం చెయ్యాలి అసలు...?"

"నన్నేమైనా చెయ్యి... ఎన్నయినా అను... అన్నిటికీ సిద్ధపడే వచ్చాను. నీ మంచికోరే ఇదంతా చేశాను. నన్ను నమ్ము.." అన్నది నన్ను దగ్గరకు తీసుకుంటూ.

నేను దాన్ని విసురుగా తోసేసి, బెడ్‌రూమ్‌లోకి పోయి తలుపు బిగించుకున్నాను. ఆ రోజంతా బయటికే రాలేదు. ఏడ్చి ఏడ్చి నా కళ్లూ ముఖమూ వాచిపోయాయి. అనూష ఎంత తలుపు బాదినా నేను తియ్యలేదు. కిటికీలోంచి చూస్తూ అరిచి, అరిచి దానికి గొంతు నొప్పి పుట్టి ఉంటుంది.

మరునాడు ఉదయం అనూష నిద్రలేచేసరికి నవ్వు ముఖంతో కాపీ కప్పుతో దాని దగ్గరకు వెళ్లాను.

"ఏమిటీ...? కోపం పోయిందా అప్పుడే... ఇంకా ఎంత హంగామా చేస్తావో అనుకున్నా... హమ్మయ్య..." అని తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది నెత్తిమీద నుంచి కొండంత బరువు దింపుకున్నట్లు.

"అవునే... నా కోసం మీ ముగ్గురూ అంతగా ఆలోచించి, నా మేలు కోసం ఇంత చేస్తే మిమ్మల్ని అపార్థం చేసుకునే మూర్ఖురాలినా నేను...? ఏదో నిన్న సంగతి వినగానే కోపం, బాధ వచ్చాయి.

అయినా, నువ్వన్నట్లు మన ప్రయాణం ఎప్పుడూ ఉన్నతం వైపుకే సాగాలి. వ్యతిరేకం కాకూడదు. ఏదో నీ అంత కాక పోయినా నేను నీ స్నేహితురాలినే లేవే..." అన్నాను బుంగమూతి పెట్టి. అనూష హాయిగా నవ్వేసింది నన్ను దగ్గరకు తీసుకుంటూ.

# కన్నీటి చుక్కలు

- యస్. మునిసుందరం



బొగ్గుమండుతున్నపుడే అందంగా వుంటుంది
క్యాండిల్ కాలుతున్నపుడే వెలుగు చిమ్ముతుంది
గుండె బద్దలయినపుడే మనిషితనం వికసిస్తుంది
విరిగిన ఆశే జీవితానికి చుక్కాని అవుతుంది
గాయపడ్డ ప్రాణికి విషం ఐస్‌క్రీం అవుతుంది
స్పందనలేని జీవితం మట్టికి చిక్కుతుంది
విలువల చిందర వందర గందరగోళంగా మారుతుంది
చిరునామా మరచి స్నేహగీతం గల్లీ గల్లీ తిరుగుతుంది
అస్తిత్వాస్తిత్వాల మొగలి పొదలకు నిప్పుపెడితే
నాగుల కోనలు బుసలు కొడతాయి
గుండెల రక్తాశ్రువులు మనిషి మనిషినీ
ప్రేమ దండగా కూర్చమంటాయి.
పగిలిన అద్దం పెంకులను మూటగట్టమంటాయి
కానీ
అలసిన యీ గుండె బొచ్చెను
ముక్కలు చేద్దామని వుంటుంది.
అయితే తరాల ముసలి గోడలు
చిత్ర విచిత్రంగా అడ్డుకుంటాయి
శతాబ్దాలుగా ఆగని యీ కన్నీటి చుక్కలు
ఏ దేముడిని అభిషేకించను ?
మాయమైన నా మనిషిని
ఏ అరణ్యంలో వెదకను !
తడి ఎరుగని యీ ఇసుక వర్రలో
మందారాలు ఎట్లా పండించగలను ?
మందారాల ఎరుపు చురక
గుండె గుండెనూ గాయపరచినపుడే
సత్యం... శివమ్.. సుందరమ్

---

# చదువు - సరుకు

- లలితా భీమయ్య



అక్షరం అంగడి సరుకైనప్పుడు
అమ్మానాన్నల ఆకాంక్షల కోసం
పిల్లల ఆశల పత్రహరితాన్ని హరిస్తూ
వాళ్ళ స్వేచ్ఛా ప్రపంచంలో
మన ఆశల పిరమిడ్లు నిర్మించడం నేరం
పసిపాపల బాల్యాన్ని గోడల మధ్య బంధించి
ఆత్మీయతా అనురాగాలన్నీ తాకట్టు పెట్టి
అందని ద్రాక్షాలకోసం అర్రులు చాస్తున్నాం

కళ్ళముందే పసితనాన్ని ఘనీభవింపజేసే
కార్పోరేటు కాలేజీ గేట్లకు ఉరితీసి
రేపటి స్వప్నాన్ని వీక్షిస్తూ
వారి ప్రాథమిక హక్కులను అణిచేస్తున్నాం

జీవించేందుకు సంపదే కొలబద్ద అయినప్పుడు
ఆత్మీయతా అనురాగాలు అడుగంటుతాయి
బాల్యాన్ని కోల్పోతున్న పసి హృదయాలకు
చారెడు సంతోషాన్ని దానం చేద్దాం

---

# ప్రాణముడి

- ఏటూరి నాగేంద్రరావు



అమ్మ కడుపులో ఉమ్మ తాగినప్పుడేనా
బాల్చీలో చేతుల చప్పట్లాటప్పుడేనా
ఆకాశగంగ తొలిచినుకై రాలి
నడినెత్తిన మంచు కరెంటై తాకినప్పుడేనా
ప్రతి క్షణం, ప్రతి రెప్పా
నా శరీరం నిండా నీళ్ళేకదా
నరాల తీగల్లో ప్రాణమై పాకే నీళ్ళేకదా
నా నూరేళ్ళ జీవితానికి ప్రాంసరీ నోటు
నా వూపిరిలో ఆవిరై చినుకు స్పర్శ
నా బాధల్ని తోడేసే కన్నీటి చాంతాడే
నా చిరునవ్వుకి శ్రీరామరక్ష
అంతెందుకూ ఆకాశంతో అడుకొనే
చెట్టునడగండి విత్తుగా నాటినప్పటి కథ
తడి లేకపోతే నేల తల్లి వొడిలో
పచ్చని కలల ప్రపంచం వుందేమో
తడిలేని విత్తుకి పునర్జన్మ వుందేమో
తడిలేక, వేవిడిలేక ఆరడి పడుతూ
మట్టితల్లి మలమల్లాడుతున్నప్పుడైనా
కురిసే ప్రతి చుక్కకీ లెక్క కావాలి
జల ఖజానా ఖాళీ అవుతున్న వేళ
నేలకి ఒక పచ్చని కల కావాలి
చినుకు రాలటం కాదు
రాలిన చినుకుని రక్షించే దోసిలి కావాలి
తవ్విన కాలవలు కాదు
కాలవల్లో ప్రవహించే ప్రాణం కావాలి
ప్రాణమేకదా
మట్టికి - మనిషికీ
ముడివేసిన శాశ్వత బంధం!

# కవి, తిరుగుబాటుదారుడు
# ఫైజ్ అహ్మద్ ఫైజ్



- వేదుల రామకృష్ణ

**"గజల్ అనే కవితా రూపంలో ఫైజ్ ఎంత ఆరితేరిన నైపుణ్యం గలవాడంటే ఆయన గజల్ గురించి అంతవరకు వున్న చిత్రాన్ని మార్చి సరికొత్త అనుసంధానాల్ని సృష్టించారు. ఉదాహరణకు ప్రియుడు - ఉర్దూలో ఒక మూల అస్తిత్వం - అంటే నేస్తం, వహిశ, దైవం, మాతృభూమి వగైరా ఏమైనా కావచ్చు. ఫైజ్ ఈ అర్థాలన్నిటిని ఉపయోగించుకోవడమే కాకుండా ఇంకా పరిధి విస్తరించి విప్లవాన్ని కూడా చేర్చాడు. విప్లవం కోసం నిరీక్షణ ప్రియురాలి కోసం నిరీక్షించినంత మగతగా ఉంటుంది."**

---

ఫైజ్ అహ్మద్ ఫైజ్ శతజయంతి ఉత్సవాలు ప్రపంచంలో వివిధ ప్రాంతాల్లో జరుపుకుంటున్నారు. ఫైజ్ భారత ఉపఖండంలో అతి గొప్ప కవుల్లో ఒకరు.

అణచివేతకు వ్యతిరేకంగా, ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ కోసం జరిగే పోరాటానికి మానవాళి పట్ల ప్రేమకు బలమైన సైద్ధాంతిక ప్రతీక ఫైజ్. మార్క్సిస్టు నిబద్ధుడు, గొప్ప ఉర్దూ కవి, పాత్రికేయుడు, సినీ దర్శకుడు, కార్మిక సంఘ నాయకుడు, రేడియో ప్రయోక్త, ఉపాధ్యాయుడు, అనువాదకుడు ఆయన.

ఫైజ్ 1911 ఫిబ్రవరి 13న సియాల్కోట్‌లో ఒక సంపన్న కుటుంబంలో జన్మించారు. ఆయన ఆంగ్లం, అరబీ భాషలో ఎమ్.ఏలు చేశారు, ఆయనకు వచనం, కవిత్వం రెండూ రాయటంలో సహజమైన సామర్థ్యం వుంది. అతి పిన్న వయస్సు నుండే కవిత్వం మొదలు పెట్టాడు. అల్లామా ఇక్బాల్ ఆయన ప్రతిభను గుర్తించి ప్రోత్సహించారు. జాతీయ విముక్తి సంగ్రామంలో ఉర్దూభాష ఘనమైన పాత్ర పోషించింది. కమ్యూనిస్టు పార్టీ విద్యార్థులను అఖిల భారత విద్యార్థి సమాఖ్యలోను, రైతులను కిసాన్ సభలోను సంఘటితం చేస్తున్న తరుణంలో 1935లో అభ్యుదయ రచయితల సంఘం ఆవిర్భవించే ముందు వరకు ఉర్దూ కవిత్వం చాలావరకు ప్రేమా, ప్రేయసి వస్తువులకే పరిమితమైంది. సామాజిక సమస్యలతో నిమిత్తం వుండేది కాదు. ఫైజ్ మొదటి దశ కవిత్వం కూడా ఆ వయస్సుకి స్వాభావికమైన ప్రేమ వస్తువుతోనే నిండి వుంది.

అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం (పి.డబ్ల్యు.ఎ.) కవులు, రచయితల సంపూర్ణ వికాసానికి సరికొత్త శక్తినిచ్చింది. పి.డబ్ల్యు.ఎ. ఏర్పాటు ఉద్దేశం కళల్ని సంపన్న వర్గాల ప్రభావం నుండి విడిపించి వాటిని సమాజంలో వున్న ప్రస్తుత పరిస్థితులకు అనుసంధానం చేయటం. పి.డబ్ల్యు.ఎ. దృక్పథం ప్రకారం కళాకారుడు ఒక కొత్త సమాజ స్థాపన కోసం జరిగే పోరాటాలకు తోడ్పడాలి. ఫైజ్ పంజాబులో అభ్యుదయ రచయితల ఉద్యమ వ్యవస్థాపక సభ్యులలో ఒకరు. ఈ కాలంలోనే ఆయన కవిత్వం పరిధి విస్తరించటం ఆరంభమైంది. ఈ కాలం గురించి వివరిస్తూ సమకాలికుడైన ఎమ్.ఎన్.రషీద్ ఇలా రాశారు. ఫైజ్ దృష్టిలో భగ్న ప్రేమికుడి ఒంటరి ఆవేదన విశ్వమానవుడి ఆవేదనగా పరిణితి చెందేలా కవిత్వం ఒక కొత్త సున్నిత భావాన్ని సంతరించుకోవాలి. కొత్త అర్థాన్ని చాటిచెప్పాలి. కింద పంక్తుల్లో ఫైజ్ దీన్ని అతి స్పష్టంగా వెల్లడించారు.

ఔర్ భీ గమ్ హైం జమానే మే మొహబ్బత్ కే సివా
రాహతేం ఔర్ భీ హైం వసల్ కీ రాహత్ కే సివా
ముఝసే పహ్లీసి మొహబ్బత్ మేరీ మహబూబ్ న మాంగ్

ప్రపంచంలో ఇంకా బాధలు వున్నాయి. ప్రేమ బాధ కాక
సుఖాలు కూడా వున్నాయి. ప్రేమ బంధం సుఖం కాక
ఇదివరకటి ప్రేమ నా ప్రేయసి కొరకు
ఇప్పుడు అది చాలదు అంతటితో ఆగదు

'ఎ రిబెల్స్ సిల్హూట్ (తిరుగుబాటుదారుడి ముఖపార్శ్వం) అఘాశాహిద్ అలీ తన ముందుమాటలో ఫైజ్ గురించి ఇలా రాశాడు. "గజల్ అనే కవితా రూపంలో ఫైజ్ ఎంత ఆరితేరిన నైపుణ్యం గలవాడంటే ఆయన గజల్ గురించి అంతవరకు వున్న చిత్రాన్ని మార్చి సరికొత్త అనుసంధానాల్ని సృష్టించారు. ఉదాహరణకు ప్రియుడు - ఉర్దూలో ఒక మూల అస్తిత్వం - అంటే నేస్తం, వహిశ, దైవం, మాతృభూమి వగైరా ఏమైనా కావచ్చు. ఫైజ్ ఈ అర్థాలన్నిటిని ఉపయోగించుకోవడమే కాకుండా ఇంకా పరిధి విస్తరించి విప్లవాన్ని కూడా చేర్చాడు. విప్లవం కోసం నిరీక్షణ ప్రియురాలి కోసం నిరీక్షించినంత మగతగా ఉంటుంది."

ఫైజ్ అనే కలం పేరు (దీని అర్థం తోటి మనుషుల సేవకు అంకితం) పెట్టుకుని ఆయన ఉర్దూ కవనానికి విప్లవాత్మక గుణం తెచ్చిపెట్టాడు.

ఫైజ్ స్పష్టమైన ఆలోచనా ప్రపంచం నుండి వేరుపడి ఎవడూ వుండలేదు. ఒకరి గురించి లోతుగా తెలుసుకోవాలంటే బాధలు, వేదనలు పంచుకోవడంలోనే తెలుస్తుంది. ప్రేమ కష్టాలు, జీవిత కష్టాలు ఒకే నిర్వచనానికి భిన్న రూపాలు."

పెట్టుబడిదారీ వ్యవస్థ దోపిడీ మీద ఆధారపడి వుందని, సామాజిక మార్పు కోసం జరిగే పోరాటంలో కార్మికవర్గమే నాయకత్వం వహిస్తుందని ఫైజ్ నమ్మాడు. స్వాభావికంగానే ఆయన కవిత్వం కార్మికవర్గానికి స్ఫూర్తినిచ్చింది. ఆయన కవిత 'తరానా (గీతం)' కార్మిక వర్గపు గీతంగా మారింది. ఈ కవితలో ఆయన కష్టజీవులని పోరాటం కొనసాగించాలని ఆఖరి ఘట్టంగా దోపిడీ లేని సమాజం స్థాపించే వరకు విశ్రమించరాదని పిలుపునిస్తాడు.

అయ్ ఖాక్ నశీనోం ఉఠ్ బైఠో, అబ్ వక్త్ కరీబ్ ఆ పహుంచా హై,
జబ్ తఖ్త గిరాయే జాయేంగే, జబ్ తాజ్ ఉఛాలే జాయేంగే,
కట్ తే భి చలో బఢ్‌తే భి చలో,

బాజూ భి బహుత్ హైసర్ భి బహుత్,
చల్తే భి చలోకే అబ్ డేరే మంజిల్ పె హీ
డాలే జాయేంగే
ఓ కష్టజీవిలా లేవండి
ఇక సమయం దగ్గర పడింది
సింహాసనాలు కూలేవేళ
మకుటాన్ని ఎగరేసే వేళ
తలలు రాలినా ముందుకు పొండి
తరగని శ్రేణులు మీ అందరివీ
అలసట ఎరగక పదండి ముందుకు
గమ్యం చేరి ఆగండి

మానవాళి కష్టాలకు పెట్టుబడిదారీ వ్యవస్థలో దోపిడీయే కారణమని, కార్మికవర్గం నాయకత్వంలో ప్రజా పోరాటాలు ప్రపంచాన్ని, మనుషులందరు బతకడానికి మెరుగైన స్థావరంగా మారుస్తాయని ఫైజ్‌కి స్థిరమైన అభిప్రాయం వుంది. తన ప్రఖ్యాత కవిత 'హమ్ దేఖేంగే (మేము చూస్తాము)'లో ఆయన ఈ మార్పు అనివార్యతను వక్కాణించారు.

హమ్ దేఖేంగే
లాజిమ్ హై కి హమ్‌భీ దేఖేంగే, హమ్ దేఖేంగే
వో దిన్ కే జిస్ కా వాదా హై
జో లౌహై అజల్ పే లిఖ్ఖా హై
హమ్ దేఖేంగే
మేము చూస్తాము
మేమూ చూస్తాం, ఇది తథ్యం, మేము చూస్తాము.
మాకు చెప్పబడిన ఆ రోజు
జీవన ఫలకంపై చెక్కిన రాత
మేము చూస్తాము.

**ఫైజ్ పాకిస్తాన్‌లో చాలా కష్టాలు పడాల్సి వచ్చింది. ఆయన అక్కడ కార్మికవర్గాన్ని సంఘటితం చేయటానికి పూనుకున్నాడు. పాకిస్తాన్ వర్కర్స్ ఫెడరేషన్‌కి (కార్మిక సమాఖ్య) ఉపాధ్యక్షులుగా పని చేశారు. పాకిస్తాన్ టైమ్స్, ఇతర కొన్ని పత్రికలకు సంపాదకులుగానూ పని చేశారు. ఆయన పేదలు, కష్టజీవుల పక్షాన సంపాదకీయాలు, వ్యాసాలు రాశారు. బెరుట్ నుండి ప్రచురించబడిన ఆఫ్రికా - ఆసియా సాహిత్య పత్రిక 'లోటస్ (కమలం)కు ఆయన సంపాదకుడిగా పనిచేశారు. పాకిస్తానీ పాలక వ్యవస్థకు ఫైజ్ చర్యలు ఆగ్రహం కల్గించాయి. 1951లో ఆయన్ను రావల్పిండి కుట్ర కేసులో నిర్బంధించారు. పాకిస్తాన్ కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి సజ్జాద్ జహీర్, తదితరులతో కలిసి ప్రభుత్వాన్ని కులదోయటానికి కుట్ర పన్నారని ఆయనపై అభియోగం మోపారు. వివిధ కారాగారాలలోని శిక్షను అనుభవించి 1955లో ఆయన విడుదల అయ్యారు.**




సామ్రాజ్యవాదుల మధ్య ఆధిపత్య పోరాటం కారణంగా రెండవ ప్రపంచ యుద్ధం వచ్చింది. అనతి కాలంలోనే సోవియట్ యూనియన్‌పై జర్మనీ యుద్ధం ప్రకటించడంతో ఈ సామ్రాజ్యవాద యుద్ధం ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంగా మారింది. ఫాసిజం మానవాళికి పెను ప్రమాదంగా మారి దాన్ని ఓడించటమే అతి ముఖ్యమైన సవాలుగా మారింది. అందుకే, సామ్రాజ్యవాదంపై వ్యతిరేకత వున్న ప్రపంచంలో అన్ని అభ్యుదయ కాముకశక్తులు ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాటంలో చేరాయి. ఫైజ్ యుద్ధకాలంలో బ్రిటిష్ సైన్యంలో చేరారు. లెఫ్టినెంట్ కల్నల్ స్థాయికి ఎదిగారు. యుద్ధం ముగిసిన కొంతకాలానికి ఆయన సైన్యం నుండి వైదొలగారు.

1947లో దేశం స్వతంత్రం పొందింది. అభ్యుదయ రచయితల సంఘంలో తన ఎంతోమంది మిత్రుల్లాగా ఫైజ్ కూడా భారతదేశం బ్రిటిష్ వలస పాలన నుండి విముక్తి అయితే పేదలు, కష్టజీవులు కూడా అన్ని రకాల దోపిడీ నుండి విముక్తులౌతారని అనుకున్నారు. దురదృష్టవశాత్తు స్వాతంత్ర్యానికి భారీ మూల్యం చెల్లించాల్సి వచ్చింది. దేశం విభజించబడింది. ఊహకందని ఘోరమైన మత మారణహోమం రగిల్చి వేలమంది జనాల ప్రాణాలు బలి చేశారు. అంతేకాకుండా స్వాతంత్ర్యం బ్రిటిష్ పెట్టుబడిదార్ల నుండి భారత, పాకిస్తాని బూర్జువాలకు, భూస్వాములకు అధికార మార్పిడిగా మారింది. ఇది ఫైజ్‌కి, పి.డబ్ల్యు.ఎ.లో ఇతరులకు నిరాశ కలిగించింది. ఈ వ్యధను ఫైజ్ 'సుబహ - ఏ- ఆజాది (స్వాతంత్ర్యోదయం)' అనే కవితలో తెలియజేశారు.

యే దాగ్ దాగ్ ఉజాలా యే శబ్ గజీదా సహర్
వొ ఇంత జార్ థా జెస్‌కా, యే వో సహర్‌తో నహీం
ఈ మచ్చలు బడిన వెల్తురు, ఈ మసిబారిన ఉషోదయం,
మేము దేనికైతే వేచి వున్నామో ఇది ఆ ఉషోదయం కాదే!

స్వాతంత్ర్యం కష్టజీవులకు గౌరవప్రదమైన జీవితం కొరకు సాగిన పోరాటానికి ముగింపు కాదని ఫైజ్‌కి స్థిరమైన అభిప్రాయం. అందుకు ఆయన గమ్యం చేరుకునే వరకు పోరాటాన్ని ఆపవద్దని హెచ్చరిస్తూ కవితని ముగిస్తాడు.

అభి గిరాని - ఏ - శబ్‌మే కమీ నహీ ఆయా
నజాత్ - ఏ - దీదా ఓ దిల్‌కీ ఘడినహీ ఆయా
చల్తే చలో కే వో మంజిల్ అభీ నహీ ఆయా
రేయి బరువు ఇంకా తగ్గనే లేదు
కళ్ళు - హృదయం ఇంకా విముక్తి కాలేదు
నడుస్తూనే వుండు, ఇంకా గమ్యం రాలేదు

భారత, పాకిస్తాన్‌ల మధ్య విద్వేషం చరమస్థాయిలో ఉండగా, భారత ఉపఖండం ప్రజల విముక్తి పట్ల ఫైజ్‌కు ఉన్న ప్రేమ ప్రశ్నించరానిది. మహాత్మాగాంధీ హత్య జరిగినపుడు ఆయన అత్యంత ధైర్యసాహసాలు కనబర్చి లండన్ నుండి ఢిల్లీకి విమాన ప్రయాణం చేసి గాంధీ అంత్యక్రియలకు హాజరైనారు. ఫైజ్ కార్మిక వర్గానికి ఒక గొప్ప నేస్తం. ఆయన కవిత్వం పేద, కష్టజీవుల పోరాటాలకు స్ఫూర్తినిచ్చింది. ఫైజ్ రచనలు ప్రపంచమంతటా డజన్ల కొద్దీ భాషల్లో అనువదించబడ్డాయి.

ఫైజ్ పాకిస్తాన్‌లో చాలా కష్టాలు పడాల్సి వచ్చింది. ఆయన అక్కడ కార్మికవర్గాన్ని సంఘటితం చేయటానికి పూనుకున్నాడు. పాకిస్తాన్ వర్కర్స్ ఫెడరేషన్‌కి (కార్మిక సమాఖ్య) ఉపాధ్యక్షులుగా పని చేశారు. పాకిస్తాన్ టైమ్స్, ఇతర కొన్ని పత్రికలకు సంపాదకులుగానూ పని చేశారు. ఆయన పేదలు, కష్టజీవుల పక్షాన సంపాదకీయాలు, వ్యాసాలు రాశారు. బెరుట్ నుండి ప్రచురించబడిన ఆఫ్రికా - ఆసియా సాహిత్య పత్రిక 'లోటస్ (కమలం)కు ఆయన సంపాదకుడిగా పనిచేశారు. పాకిస్తానీ పాలక వ్యవస్థకు ఫైజ్ చర్యలు ఆగ్రహం కల్గించాయి. 1951లో ఆయన్ను రావల్పిండి కుట్ర కేసులో నిర్బంధించారు. పాకిస్తాన్ కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి సజ్జాద్ జహీర్, తదితరులతో కలిసి ప్రభుత్వాన్ని కులదోయటానికి కుట్ర పన్నారని ఆయనపై అభియోగం మోపారు. వివిధ కారాగారాలలోని శిక్షను అనుభవించి 1955లో ఆయన విడుదల అయ్యారు. కారగారవాసంలో ఫైజ్ ఇతర ఉద్యమకారులకు పత్రికలు, కలం, కాగితం అందకుండా చేశారు. కాని వారు అనుకున్నట్టు ఆ కారాగారవాసం, వస్తువులు ఇవ్వకపోవటం ఫైజ్‌ని కృంగదీయలేకపోయాయి. ఆయన కారాగార వాసంలో గడిపిన కాలంలో కూడా చాలా సృజనాత్మకమే. చక్కటి కవితలు ఆయన కలం నుండి జాలువారాయి. వాటిల్లో చెప్పుకోదగినది.

మతా- యే - లౌహ్ ఓ కలమ్ ఛిన్ గయీ తో క్యా గమ్ హై
కే ఖూన్ - ఏ - దిల్ మేం డుబాలీ హైం ఉంగలియాంమైనే
జబాంపె మొహర్ లగాదీ హై తో క్యా, కె రఖ్ దీ హై

హర్ - ఏక్ హల్కా - యే - జంజీర్ మే జబాఁ హమ్నే
కాగితం, కలం లాగేసుకుంటే ఏమయింది
గుండె రక్తంలో ముంచేసుకున్నా నా వేళ్ళను నేను
నోటికి తాళం వేస్తేనేమి మార్చేస్తాను
వేసిన ప్రతి సంకెళ్ళను మాట్లాడే నాలుకగా నేను

1958లో సైనిక తిరుగుబాటు ద్వారా జనరల్ ఆయూబ్‌ఖాన్ అధికారం కైవసం చేసుకున్న తరువాత ఫైజ్ కొద్దికాలం పాటు మరలా జైలు పాలయ్యాడు. మరణశిక్ష విధించబడిన తర్వాత ఏకాంత కారాగారవాసంలో తన మనసులో భావాన్ని ఆయన ఈ విధంగా వివరించారు. "ప్రేమలాగే కారాగారం కూడా ఒక ప్రాథమిక అనుభవం. అది ఆత్మకు ఎన్నో కొత్త తలుపులు తెరుస్తుంది."

కారాగారంలో ఉండగా రాసిన 'దస్త్-ఎ-సబా' (గాలి రాసిన రాత), 'జిందన్ నామా' (జైలు డైరీ) రచనలు ఆయన్ను అత్యంత ప్రతిభావంతుడైన కవి స్థాయికి చేర్చాయి.

దస్త్-ఎ-సబాలో ఆయన మార్క్సిస్టు మూల సిద్ధాంతపు దృక్పథాన్ని ప్రతిబింబిస్తూ ఇలా రాశారు, "మానవ జీవిత పోరాటం అవగాహన, దాంట్లో పాల్గొనడం, జీవితానికే కాకుండా కవులకు కూడా అత్యావశ్యకం.

ఆయన ప్రశంసనీయ సేవలను గుర్తిస్తూ సోవియట్ యూనియన్ ఆయనకు 1963లో లెనిన్ శాంతి పురస్కారం ప్రదానం చేసింది. ఆయనకు తన ప్రియమైన ఆశయం పట్ల ఉన్న నిబద్ధత, అనన్య సామాన్యమైన స్పష్టత ఆయన పురస్కార స్వీకార ఉపన్యాసంలో ప్రతిధ్వనించాయి. ఫైజ్ ఇలా అన్నారు "మానవ మేధస్సు, సైన్సు, పరిశ్రమ మనలో ప్రతి ఒక్కరికి సుఖంగా బతకడానికి కావలసిన ప్రతీది సమకూర్చగల పరిస్థితిని సృష్టించాయి. కాని అపరిమిత ప్రకృతి సంపద, ఉత్పత్తి కొద్దిమంది అత్యాశపరుల సొంతం కాకుండా మొత్తం మానవాళికి ఉపయోగడితేనే అది సాధ్యం కాగలదు. మానవ సమాజం పునాదులు అత్యాశ, దోపిడీ, యాజమాన్యం మీద కాకుండా న్యాయం, సమానత్వం, స్వేచ్ఛ, ప్రతి ఒక్కరి సంక్షేమంపై ఆధారపడితేనే ఇది సాధ్యమవుతుంది. ఎప్పుడు తన శత్రువుల చేతుల్లో ఓటమి ఒప్పుకోని మనవాళి ఎప్పటికైనా విజయవంతమవుతుందని, అంతిమంగా యుద్ధాలు, విద్వేషం, నిర్దయతకి బదులుగా మానవజాతి మీద పునాదులు పారశీ మహాకవి హాఫెజ్ సిరాజ్ ఇచ్చిన ఈ సందేశం మీద నిలుస్తాయని నేను నమ్ముతాను. "నీవు చూసే ప్రతి పునాది లోపభూయిష్టమే, ప్రేమ పునాది తప్ప, అది లోపరహితం."

ఈ ప్రభావవంతమైన ఉపన్యాసం ఫైజ్‌ని ప్రపంచమంతటా అభ్యుదయకాముకులకు దగ్గర చేసింది. ఆయన రచనలు డజన్ల కొద్ది భాషల్లో అనువదించబడ్డాయి. ఫైజ్ నిజమైన అంతర్జాతీయవాది. నోరులేని దుర్భర జీవితం గడుపుతున్న ప్రపంచ ప్రజలకు ఆయన వాణిగా నిలిచాడు. ఆయన ఆఫ్రికన్ ప్రజల విముక్తి పోరాటాల గురించి రాశారు. పాలస్తీనా ప్రజల పోరాటాలు ఆయన మనసును హత్తుకున్నాయి. అమెరికాలో నల్లజాతివాళ్ళ పోరాటాల గురించి కూడా ఆయన రాశారు. దోపిడికి గురైనవారు, కార్మికవర్గం పట్ల ఆయన నిబద్ధత చెక్కు చెదరనిది. ఆయనకు భయమంటూ లేదు, ఎన్ని కష్టాలైన ఓర్చి నిజం చెప్పటానికి ఆయన వెనకాడలేదు. ఒక న్యాయమైన సమాజం గురించి మాట్లాడడం ప్రతి ఒక్కరి బాధ్యత అని ఆయన అన్నారు.




ఆయన దృష్టిలో న్యాయం కోసం పోరాటంలో నిష్పాక్షికత అనేది లేదు, న్యాయం పక్షాన వుండాల్సిందే. దీనికి సంబంధించి ఆయన అవగాహన 'బోల్ (మాట్లాడు)' అనే పద్యంలో ప్రస్ఫుటమవుతుంది.

బోల్ కే లబ్ ఆజాద్ హైఁ తేరే
బోల్ కే జబాన్ అబ్ తక్ తెరీ హై
తేరా సుత్వన్ జిస్మ్ హై తేరా
బోల్ కే జాన్ అబ్ తక్ తేరీ హై
నీ పెదాలు ఇంకా స్వతంత్రమే, కనుక మాట్లాడు
నాలుక ఇంకా నీదే కనుక మాట్లాడు
నీదేహం కృశించినా ఇంకా నీదే
ప్రాణం ఇంకానీదే కనక మాట్లాడు

ఫైజ్ సమాజానికి నిబద్ధుడైన మహా మేధావి, అంకితభావం గల కమ్యూనిస్టు.

మార్క్సిజం ఒక సృజనాత్మకశాస్త్రం. ప్రపంచాన్ని రాజకీయ, ఆర్థిక, సైన్స్‌పరమైన, తాత్వికంగా వగైరా అన్ని రకాలుగా ఏకకాలంలో పరిశీలిస్తుంది. అన్ని రకాల ఆలోచనా పద్ధతుల్ని, మానవ మస్తిష్కం యొక్క సృజనాత్మక సామర్థ్యాల్ని దాటి వాటన్నిటిని ఒక ఏకతా సూత్రంలో పెడుతుంది.

ఫైజ్ ఒక విధంగా తన కాలంలో తన జీవిత కృషిలో ఇటువంటి సార్వత్రిక వైఖరిని ప్రతిబింబించాడు.

ఎడ్వర్డ్ సయిద్ తన వ్యాసం 'ది మైండ్ ఆఫ్ వింటర్ : 'రిఫ్లెక్షన్స్ ఆన్ లైఫ్ ఇన్ ఎగ్జాయిల్' (శీతాకాల స్మృతి : స్వదేశాన్ని విడిచిపెట్టిన జీవితం) లో ఇలా అంటారు, "ఫైజ్ గురించి అవగాహన చేసుకోవలసిన కీలకమైన విషయం ఏమంటే ఆయనను సంపన్నవర్గాలు, సామాన్య ప్రజలు ఇద్దరు కూడా చదివేవారు, వినేవారు. ఆయన స్వచ్ఛత, ఖచ్చితంగా ఉండటం, ఆశ్చర్యంగొల్పేవి. అందుకు మనం ఆయనలో యీట్స్ లాంటి శృంగార భావన, నెరుడా లాంటి శక్తి కలయికను ఊహించుకోవలసిందే. ఆయన 20వ శతాబ్దపు మహోత్తమ కవుల్లో ఒకరు."

విప్లవం కోసం పనిచేసే ఆశయం గల ప్రతి ఒక్కరు ఫైజ్ నుండి తప్పనిసరిగా నేర్చుకోవలసింది నిబద్ధతతో కూడిన పట్టుదలను సృజనాత్మకతతో మేళవించడం. ఫైజ్ ఈ పని తన కవిత్వం ద్వారా చేశారు. పాత, సాంప్రదాయ పద్ధతుల్ని విడిచిపెట్టే కన్నా వాటిని వాడుతూ తన ప్రేక్షకుల ముందు అవసరాను సారం వాటి రూపంలో మార్పు తీసుకువచ్చారు. ఆయన తన విప్లవాత్మక సందేశాన్ని పాత, కొత్త బాణీలో మేళవించి ఏకకాలంలో మనల్ని వినేలా, పాడుకొనేలా చేశాడు.

**"మానవ మేధస్సు, సైన్సు, పరిశ్రమ మనలో ప్రతి ఒక్కరికి సుఖంగా బతకడానికి కావలసిన ప్రతీది సమకూర్చగల పరిస్థితిని సృష్టించాయి. కాని అపరిమిత ప్రకృతి సంపద, ఉత్పత్తి కొద్దిమంది అత్యాశపరుల సొంతం కాకుండా మొత్తం మానవాళికి ఉపయోగడితేనే అది సాధ్యం కాగలదు. మానవ సమాజం పునాదులు అత్యాశ, దోపిడీ, యాజమాన్యం మీద కాకుండా న్యాయం, సమానత్వం, స్వేచ్ఛ, ప్రతి ఒక్కరి సంక్షేమంపై ఆధారపడితేనే ఇది సాధ్యమవుతుంది. ఎప్పుడు తన శత్రువుల చేతుల్లో ఓటమి ఒప్పుకోని మనవాళి ఎప్పటికైనా విజయవంతమవుతుందని, అంతిమంగా యుద్ధాలు, విద్వేషం, నిర్దయతకి బదులుగా మానవజాతి మీద పునాదులు పారశీ మహాకవి హాఫెజ్ సిరాజ్ ఇచ్చిన ఈ సందేశం మీద నిలుస్తాయని నేను నమ్ముతాను. "నీవు చూసే ప్రతి పునాది లోపభూయిష్టమే, ప్రేమ పునాది తప్ప, అది లోపరహితం."**

గొప్ప మానవతావాది, మార్క్సిస్టు అయిన ఫైజ్ 73 ఏళ్ళ ప్రాయంలో 1984లో మరణించారు. కాని ఆయన ప్రజల హృదయాల్లో జీవించే వున్నారు. ఆయన రచనలు కార్మిక వర్గ ఉద్యమాలకు స్ఫూర్తిని ఇస్తూనే వున్నాయి.

ఫైజ్ శతజయంతి ఉత్సవంగా జరుపుకునే సందర్భం. దోపిడి రహిత సమాజం, మనిషి గౌరవం, న్యాయం అనే భావన ఈ శత జయంతికి ప్రేరణ.

**(అమానుల్లా ఖాన్ ఆంగ్ల వ్యాసం ఆధారంగా)**

## మిణుగురులు

- ఎస్.ఎస్.బి. గేరా



ముండకోపనిషత్తు పుటల్లో రాజుకొన్న
అక్షర కణికలు
పెను మంటలై ఎగసి
తరతరాలుగా తిమిర రాశుల్ని తగలేస్తున్నా
కమ్ముకొస్తునే ఉంది కారు చీకటి
నిజాన్ని పోలిన అబద్ధపు చీకటి!
ఎప్పుడైతే
సమాచారం సరుకైపోయిందో
ఎప్పుడైతే
ప్రసార సాధనాల్లోకి
పెట్టుబడులు ప్రవహించాయో
ఎప్పుడైతే
ప్రచురణ సంస్థలకు
లాభాలూ, ప్రలోభాలే ప్రధానమయ్యాయో
అప్పుడే మాధ్యమాలకు
మార్కెట్ లక్షణాలు మొలిచాయి
రేటు పెరిగేటందుకు
ఏ రూటైనా రైటేనంటున్నాయి
అసత్యాన్ని అంటకాల్చాల్సిన చోట
అవినీతికి, అధికారాలకూ లొంగి
చల్లారి పోతున్నాయి
వాస్తవాన్ని వార్తగా మార్చే క్రమంలో
అక్షరాల్ని అచ్చుల్లోకెక్కించి నొక్కేస్తున్నాయి.
మాటల్ని కైమాగొట్టి, మసాలబెట్టి
ఛానళ్ళలోకి నెట్టి
చెల్లాచెదురుగా విసిరేస్తున్నాయి
పెట్టుబడులెన్ని పన్నాగాలు పన్నినా
ఎందరు గోబెల్స్‌ని
పట్టి గొంతు చించుకొన్నా
నిజం నిప్పులాంటిది
ఊదర కొట్టక్కర్లేదు గానీ
ఊపిరందిస్తే చాలు
గుప్పుమంటుందది
మిణుగురుల్లాంటి మాధ్యమాలు కొన్ని
మన మధ్యే తిరుగాడుతూ
అలాంటి ప్రయత్నమే చేస్తున్నాయి
మంట పరిమితమైనా
చీకటి సామ్రాజ్యాలకు,
సామ్రాజ్యవాద చీకట్లకు
నిర్భయంగా నిప్పంటిస్తూనే ఉన్నాయి
మిత్రులారా రండి,
వాటిని అక్షర కాగడాలుగా రగిలించి
ప్రజల చేతికందిద్దాం.

## స్పృహ

- జి. తిరుపతి



స్పృహ........ఏది నీ చిరునామా......
కవులు వ్రాసే కవితల్లోనా!
బూజు పట్టిన బుక్కుల్లోనా!
ఒకటి మాత్రం నిజం,
కడుపు నిండిన వాడి కలలోనైనా లేవు,
కడుపు మాడిన వాడికి కలలే లేవు!
ఇంకెందుకు నీ అవసరం
ఏనాడో పాతాళంలో పడిపోయావు
తాళం తీసే సాహసి కోసం వడపోయాలి
ఈనాడు
ఎన్ని కలల ప్రతిఫలమో ఈ ఎన్నికలు
కొందరేమో వేయనే వేయరు ఓటు
మరికొందరేమో చూడనే చూడరు అటు
ఎక్కడిదీ అలసత్వం..!
పడిపోయాయా జవసత్వాలు
కుటిల నీతికి
జటిల రీతికి
బలియవుతున్నా...!
సర్దుకుపోయే వ్యర్థ జీవులు
ఉన్నా ఒకటే లేకున్నా ఒకటే
జీవించడమే మార్గదర్శకమైతే...!
జాతి కోసం
జన జాగృతి కోసం
జీవించమని నేనడగను
ముందడుగే పోరాటమైతే....
దేశం కోసం,
దేశ సౌభాగ్యం కోసం,
ముందడుగు నేనడగను.
సమీకరించుటే విప్లవమైతే...!
భూమి కోసం,
భుక్తి కోసం,
విప్లవాలు నేనడగను
ప్రశ్నించుటే చైతన్యమైతే...!
జరుగుతున్న అన్యాయాన్ని ప్రశ్నించకున్నా
ఫరవాలేదు...కాని
నీకు... నాకు జరిగేది న్యాయమేనా?
అని తెలుసుకుంటే
అదియే "స్పృహ"
ఇది తెలుపు నరులెవరు?
కథ మలుపు "స్పృహ"
కలిగించున దెవరు?

## తత్త్వం తెలియాలి అంటే

- కోట్ల వెంకటేశ్వరరెడ్డి



ఎవరైనా సరే
ఎదురు తిరిగితే అంతే
చితి పేల్చుకుని
నిగ్గు తేలాలి
లేదా బుగ్గి కావాలి!
ఎప్పటికీ మాటల్తోనే పనులు కావు
చేతలు కావాలి
మట్టి పరిమళించాలంటే
చినుకై రావాలి
నింగి కరగనిదే
నేల పచ్చ తివాచీ పరవదు
కన్నీరు ఫలాలనిస్తుందా?
సానుభూతి సంపదలిస్తుందా?
పోరాటాలు నదుంబిగించనిదే
కుర్చీలు నిద్రలేవవు!
ఓటు బ్రహ్మాస్త్రమే
ఒక్క సారి ప్రయోగిస్తే
అయిదేళ్ళూ వేటాడాలి!
మేడిపట్టిన వాని చేయి
పై నుండాలి కదా
కిందెందుకుంది?
ఈ మర్మాన్ని ఛేదిస్తేగాని
అందరి తత్త్వాలు బయటకురావు!

## ఆధునిక ఇటలీ కవులు

**- సౌభాగ్య**



# గియుసెప్పె ఉంగరెట్టి

గియుసెప్పె ఉంగరెట్టి దేశ కాల పరిమితుల్లేని కవి. ఆయన వ్యక్తిగత జీవితాన్ని పరిశీలించినా ఆ సంగతి తెలుస్తుంది.

ఉంగరెట్టి ఈజిప్టులోని అలగ్జాండ్రియా నగర శివార్లలో ఎడారి సరిహద్దులో నివాసం ఏర్పరచుకున్న ఇటాలియన్ దంపతులకు జన్మించారు. వాళ్ళ పూర్వీకులెవరో ఇటలీ నించీ వచ్చి అక్కడ స్థిరపడ్డారు. అతడు చదువుకోడానికి చేరిన స్కూల్లో ఫ్రెంచి భాషలో బోధన జరిగేది.

విప్లవాత్మక భావాలతో నిండిన యవ్వనంలో ఉంగరెట్టి 1912లో పారిస్ వెళ్ళాడు. వేళ్ళే ముందు మార్గమధ్యంలో మొదటిసారి ఇటలీ సందర్శించాడు. పారిస్ చేరి 'అవంత్ గ్రేడ్' సాహిత్య బృందంలో ఎంతో మంది మిత్రుల్ని సంపాదించుకున్నాడు. తరువాతి కాలంలో 'ఇటాలియన్' ఫ్యూచరిస్ట బృందంలో చేరాడు. మొదటి ప్రపంచయుద్ధంలో ఇటలీ సైన్యంలో చేరాడు. యుద్ధానంతరం పారిస్ చేరి పెళ్ళి చేసుకున్నాడు. 1921లో ఇటలీ వెళ్ళి రోం నగరంలో స్థిర నివాసమేర్పాటు చేసుకున్నాడు. ముస్సోలినీ సిద్ధాంతాలతో ఆకర్షింపబడ్డాడు.

1931 - 35లో ఇటలీ సారస్వతం గురించి ఉపన్యసిస్తూ యూరోపుఖండమంతా పర్యటించాడు. 1939లో బ్రెజిల్‌లోని 'సావ్‌పాలో' యూనివర్శిటీలో 'ఇటలీ సాహిత్యంలో ప్రొఫెసర్‌గా నియమింపబడ్డాడు. అదే సంవత్సరం అతని కొడుకు అపెండిసైటిస్ ఆపరేషన్ చేయించుకుంటూ వైద్యుల నిర్లక్ష్యం వల్ల చనిపోయాడు.

1942లో ఉంగరెట్టి ఇటలీలోని ప్రొఫెసర్‌గా నియమింపబడ్డాడు. అప్పటికే అతను ప్రపంచ ప్రసిద్ధుడు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఆయన తన శక్తియుక్తుల్ని అనువాదానికి అంకితం చేశాడు. వృద్ధాప్యంలో ప్రపంచమంతా పర్యటించాడు. 1958లో ఆయన భార్య మరణించింది.

ఒక శీతాకాలంలో న్యూయార్క్ సందర్శన చేసి తిరిగి వచ్చాక శ్వాసకోస సంబంధమైన వ్యాధితో మిలాన్‌లో కన్నుమూశాడు.

తన కవిత్వం గురించి ఒక సందర్భంలో ఆయన వివరించిన అభిప్రాయాలు ఆయన కవిత్వాన్ని అర్థం చేసుకోడానికి ఎంతగానో ఉపకరిస్తాయి.

"పదాలకున్న కళాత్మక శక్తి ఎంత బలీయమైందంటే వాటివల్ల ఉద్దేశించిన వస్తువు రూపాంతరం చెందుతుంది. ఒక చెట్టుని ఉద్దేశించి 'చెట్టు' అంటాం. సాధారణార్థంలో అది చెట్టే. కానీ ఉన్నట్లుండి అది రూపకం పరివర్తన చెందే దశలో దాని అర్థం అనంతంగా విస్తృతమై అది రూపాంతరం చెంది ప్రకృతి దానికి స్థిరపరిచిన నియమిత అర్థం నుండి వేరవుతుంది. ఆశ్చర్యం, భయం, ఒంటరితనం, అనుబంధం, ఆత్మీయత, త్యాగం తదితర భావాలలో అది సంలీనమై ఉద్దేశించిన వస్తువుని అది ప్రభావితం చేస్తుంది. కాబట్టి జ్ఞానదాహమున్న కవి క్రమక్రమంగా వాస్తవం నించీ స్వీకరించిన వస్తువుని తన భావాలకు సంకేతంగా మలచుకుంటాడు" అంటాడు.

ఇక్కడ మల్లార్మే ప్రభావం కనిపిస్తుంది. తమ యవ్వనంలో మల్లార్మేని చదువుకున్న రోజుల గురించి చెబుతూ నేను ఆయన కవితల్ని చదువుతున్నప్పుడు నన్ను నేను కోల్పోయాను. ఆరాధనతో ఆయన్ని చదివాను. అన్నాడు. తరువాతి కాలంలో ఒక సందర్భంలో కవిత్వం గురించి చెబుతూ "అనిశ్చితమయిన వాటిలోని ఆత్మసారాన్ని గ్రహించే ఏకైక సాధనం కవిత్వం" అన్నాడు. పదాల పట్ల మల్లార్మేకి లాగే ఆయనకు మమకారం. మల్లార్మే పట్ల ఎంతగా గౌరవమున్నా ఉంగరెట్టి దృష్టి మల్లార్మే కన్నా మౌలికంగా భిన్నమైంది.

ఒక కవితలో

"కవి మెల్లగా దిగివస్తాడు
కాంతిలోకి కాలిడుతాడు
పాటల్తో సహా తరలి వస్తాడు
పాటల్ని నలుదిశలా చల్లుతాడు" అంటాడు.

ఇంకా ఈ కవిత్వంతో నాకు నేను మిగుల్చుకున్న దేమీ లేదు. అవ్యక్త రహస్యాన్ని, అనంత శూన్యాన్ని నా ఆత్మీయులుగా మిగుల్చుకున్నాను. మల్చుకున్నాను' అంటాడు.




గ్రీఫ్, ద బరీడ్ హార్బర్, ద సెన్స్ ఆఫ్ టైం, ద ప్రామిసెడ్ ల్యాండ్' వంటి ఎన్నో కవితా సంపుటాలు తెచ్చాడు.

ఆయన రాసిన 'మృత్యువు' కవిత ప్రసిద్ధమైంది.

'మృత్యువా! బుర్రలేని నా చెల్లెలా!
నీ ముద్దుతో నన్ను కలకు సన్నిహితం చేస్తావు
సమానం చేస్తావు
నీ సాహచర్యంతో నా పాదముద్రల్ని
ప్రపంచంలో వదలకుండానే వచ్చేస్తాను' అంటాడు.

అవిశ్రాంతంగా తిరిగిన ఆయన 'ఏకాంతాన్ని ఎంతగానో ప్రేమించాడు. ఒక కవితలో ఒంటరిగా, ఏకాంతంగా వున్నప్పుడు మనిషి తనను, తాను, వింటాడు, చూస్తాడు నిశ్శబ్దాన్ని పేరు పెట్టి పిలుస్తాడు' అన్నాడు.

మళ్ళీ ఎప్పటిలాగే
నా కళ్ళు అమాయకంగా దిక్కుల్లో చూశాయి
నేను శాశ్వత వసంతాన్ని సందర్శించాలి
ఓ స్మృతీ! నీకు తెలుసు
నిజాయితీ నిండిన నీకు తెలుసు
నిజానిజాలు నీకు తెలుసు

ఉంగరెట్టి ఆపాదమస్తకం లలిత కవి. సున్నిత, సుకుమార భావాల్ని వర్ణించడంలో అసాధారణ ప్రతిభావంతుడు.

'ఒక స్త్రీ ఉల్లాసంగా ఆకాశంలోకి లేచింది
మధురగానాన్ని మంద్రమంద్రంగా ఆలపించింది
పిల్లగాలి పిలవకున్నా ఆమెను అనుసరించింది
మంత్రబద్ధంగా ఆమెతో బాటు అలలా సాగింది
మెల్లగా ఆమెను భూమిపై దించింది
ఈ నేల నగ్నంగా వుంది
ఈ స్త్రీ ప్రేమించదగింది
ఈ గాలి బలమైంది, కానీ
ఈ కల మాత్రం చచ్చిపోయింది
అంటూ చిత్రమైన వర్ణన చేస్తాడు.

ఆయన నాలుగో కవితా సంపుటి 'గ్రీఫ్' వ్యక్తిగత విషయాల్తో నిండివుంటుంది. 1939లో అతని తొమ్మిదేళ్ళ కొడుకు చనిపోయాడు. ఆ సంపుటిలోని కవితలన్నీ మృత్యువు చుట్టూ అల్లుకున్నాయి.

ఉంగరెట్టి జీవితకాలంలోనే మహాకవిగా ఇటలీలో కీర్తింపబడ్డాడు.

ఆయన తన కవిత్వాన్ని ఒక 'ఆత్మకథా కథనంగా' భావించాడు. అందుకనే ఆయన తన రచన సంపుటాలకు' లైఫ్ ఆఫ్ ఎమాన్ అని పేరు పెట్టాడు.

కవిగా జీవించిన కవి ఉంగరెట్టి

## జూన్

ఈ రాత్రి నిశ్శబ్దంగా నా కోసం కళ్ళు మూస్తే
ఈ రాత్రి నా కోసం చనిపోతే
నేను యింకొకరి కళ్ళతో ఆమెను చూస్తాను.
నా ఇంటి చుట్టూ వున్న చెట్లను చుట్టిన తరంగ చక్రాలు
కునుకు తియ్యకుండా జాగ్రత్త పడతాను
నేను మళ్ళీ నీ శరీరంలో మేల్కొంటే
ఆ మెలకువ కోకిలగానంలా విలాసంగా తేలుతుంది
ఆ మెలకువ పండిన వరిధాన్యంలా
పసిడిరంగుతో ప్రకాశిస్తుంది.
పారదర్శక జలంలో నీ స్వర్ణ వర్ణ శరీర కాంతి
చీకటిగా గడ్డ కట్టినట్లుంటుంది
ప్రతిధ్వనించే గాలి పై కప్పు కింద
నువ్వు పూలకొమ్మలా ఎదురుచూడాలి
చీకట్లని కోస్తున్న నిశ్శబ్ద పరిసరంలో ఆకులు లేకుండా
అనాచ్ఛాదితంగా నువ్వుంటావు
దుమ్ము కొట్టుకుపోయిన నన్ను పరిశుభ్ర పరుస్తావు
అప్పుడు నీ కనైప్పలు సగం మూత పడతాయి
సాయంత్రంలాగా అప్పుడు
ప్రేమ మంచి మార్గానికి మళ్ళిస్తుంది
ఉపశమించిన ఉద్రేకాల్లో నేను లవణదిగంతాల్లో
నీ కనుపాపలు, నా కనుపాపలు ఒరిగిపోవడం చూస్తాను
ఆకాశం తలుపులేసుకుంది
మల్లె తీగ మగతగా తూగింది
నా నిద్ర ఎగిరిపోయింది
ఎగిరే అగ్ని శకలంలా వీధి చివర నిల్చున్నాను
ఇంతకూ ఈ రాత్రి నా కోసం మరణిస్తుందా?

## మరణ దర్శనం

రాత్రంతా అతను పళ్ళు కొరుకుతూ
బలమైన అతని చేతుల్తో
నిండు చంద్రుణ్ణి నలిపేయాలని చూస్తున్నాడు




నేను మాత్రం
నా నిశ్శబ్దంలోకి
వుపసంహరించుకుని
అనురాగం తొణికిసలాడే
ప్రేమలేఖలు రాస్తూ గడిపాను
జీవితాన్ని మరీ గాఢంగా కౌగలించుకోలేదు.

అనువాద కథ

# వాళ్ళు మాకు 'భూమి' ఇచ్చారు



- స్పానిష్ కథ : హ్వాన్ రుల్ఫో

అనువాదం : రంగనాథ రామచంద్రరావు

చెట్టు నీడకాని, చెట్టు నుంచి పుట్టిన మొక్క కాని, ఒక చిన్న వేరు కాని కనిపించకుండానే గంటలకొద్దీ నడిచిన తర్వాత మాకు కుక్క మొరగటం వినిపించింది.

హద్దులే లేని ఆ ఆరుబయలు దారిలో నడుస్తున్నప్పుడు ఆ ప్రదేశానికి ఆవల, ఎండిన చెరువులతో నెర్రలు ఇచ్చిన ఈ బయలు భూమి చివరన ఏమీ దొరకదని 'ఒక్కోసారి అనిపించటం కద్దు. కానీ ఏదో వుంది. అక్కడో పల్లె వుంది. మీరు కుక్కమొరగటాన్ని వినవచ్చు. గాలిలో తేలివచ్చే పొగను పీల్చవచ్చు. అదో భరోసాగా భావింపజేసే జనావాసాల పరిమళాన్ని ఆస్వాదించవచ్చు.

అయితే పల్లె ఇంకా చాలా దూరంలో ఉంది. పల్లె ఉనికిని మా దగ్గరికి చేర్చేది ఈ గాలి మాత్రమే.

ప్రొద్దుటినుంచి అదే పనిగా నడుస్తూనే ఉన్నాం. ఇప్పుడు మధ్యాహ్నం నాలుగు గంటల సమయం. మాలో ఒకడు ఆకాశం వేపు నిక్కి చూచి, కదలకుండా మండుతున్న సూర్యునివేపు దృష్టి సారించి ఇలా అన్నాడు.

"ఇప్పుడు నాలుగు గంటలైంది"

అతనే మెలితోన్.

అతనివెంట నేను, ఫావుస్తినో, ఎస్తెబాన్ ఉన్నాం.

మేము నలుగురం. ముందు ఇద్దరం. వెనుక ఇద్దరు.

నేను వెనుదిరిగి చాలా దూరం వరకూ చూశాను. ఎవ్వరూ కనిపించలేదు.

'మేము నలుగురమే' - అని అనుకున్నాను.

ఇంతకు ముందు అంటే దాదాపు పదకొండు గంటల సమయంలో ఇరవై మందికంటే ఎక్కువ జనం ఉన్నారు. వాళ్ళంతా ఒక్కోచోట కొంతమంది చొప్పున వేరై పోయారు. చివరికి మిగిలింది మా చిన్న గుంపు మాత్రమే.

"వర్షం వస్తుందో ఏమో" - అన్నాడు ఫావుస్తినో.

అందరం తలలు ఎత్తి మా మీదుగా సాగిపోతున్న ఓ పెద్ద నల్లటి మేఘాన్ని చూశాం. ఫావుస్తినో అన్నట్టు వర్షం రావచ్చేమోనని అనుకున్నాం.

అయితే మేమేమి ఆలోచిస్తున్నామో బయటికి చెప్పలేదు. చాలా సేపటి నుంచి మాకు మాట్లాడాలనే ధ్యాసే లేదు. కారణం ఉక్క!

మరోచోట ఎక్కడైనా మనసారా మాట్లాడవచ్చు. ఇక్కడ మాత్రం సాధ్యపడదు. ఇక్కడ మాట్లాడటం మొదలు పెడితే ఇక్కడంతా అలుముకున్న అతి వేడిమికి మాటలు వెచ్చనై, అవి నాలుకమీద ఎండిపోయి, ఊపిరి ఆగినట్టవుతుంది.

ఇక్కడి పరిస్థితి ఇలా వుంది. అందుకే ఎవరికీ మాట్లాడాలనే కోరిక లేదు.

ఒక పెద్ద వానచినుకు పడింది. వాన చినుకు పడ్డ విసురుకు నేలమీద ఒక గుంత ఏర్పడి అక్కడే అది ఎంగిలిలా గట్టి పడింది. పడ్డది ఒక్క వానచినుకే. ఇంకా పడుతుందేమోనని మేమంతా తలలెత్తి కళ్ళు విప్పార్చి చూశాం. కానీ చినుకు పడలే. వర్షం కురవలేదు.

మరలా ఆకాశంవేపు చూస్తే వర్షాన్ని నింపుకున్న ఆ మేఘం దూరంలో వేగంగా పరిగెత్తడం కనిపించింది. పల్లె నుంచి వీచే గాలి ఆ మబ్బును కొండల నీలినీడల వైపుకు తోసింది. ఇక్కడ పొరబాటున పడ్డ వర్షపు చుక్క నేలలో ఇంకిపోయి దాని దాహంలో మాయమయ్యింది.

ఇంత పెద్ద మైదానాన్ని సృష్టించిందెవరు? దేనికోసం?

మేము మళ్ళీ నడవసాగాం. వర్షం రాకను చూడటానికి కాస్సేపు నిల్చున్నాం. అంతే. వర్షం రాలేదు. ఇప్పుడు మళ్ళీ నడవసాగాం. మేము ఎంత దూరం నడచివచ్చామో అంతకంటే ఎక్కువ దూరంనుండి నడచివచ్చినట్టుగా నాకు అనిపించింది.



ఔను అలాగే అనిపించింది నాకు. ఒకవేళ వర్షమేమైనా వచ్చింటే, మరో విధంగా అనిపించేదేమో? అయినా చిన్నప్పటి నుంచీ చూస్తున్నాను. మైదానంలో ఎప్పుడూ వర్షం పడలేదు. నిజానికి వర్షం అని పిలవబడే నీళ్ళు కురవలేదు.

లేదు. ఈ మైదానం నుంచి ఏమీ ప్రయోజనం లేదు. కుందేళ్ళుకానీ, పక్షులుకానీ ఇక్కడలేవు. ఏమీ లేదు. ఒకటి రెండు తుమ్మచెట్లు. అక్కడక్కడ అరచేయంత ముడుచుకుపోయిన ఆకులుగల పిచ్చి చెట్లు తప్ప. ఇంతకుమించి అక్కడ వేరేమీ లేదు.

ఇలాంటిచోట మేము నలుగురం. మునుపెపుడో భుజానికి ఒక తుపాకీ తగిలించుకుని, గుర్రమెక్కి వెళ్ళేవాళ్ళం. ఇప్పుడు మా దగ్గర తుపాకులూ లేవు.

వాళ్ళు మా తుపాకులు తీసుకుని మంచివనే చేశారనిపించింది. ఈ ప్రాంతలలో ఆయుధాలతో తిరగటం అపాయకరం. ఇక్కడి జనం మా తుపాకులను చూచిన వెంటనే ఏ విధమైన హెచ్చరిక చెయ్యకుండానే చంపేస్తారు. గుర్రాలుంటే అది వేరు సంగతి. ఒక వేళ మేము గుర్రాల మీద వచ్చింటే ఈ సమయానికంతా వయ్యారంగా పారే నది నీటిని రుచి చూచి, వెంట తెచ్చుకున్నది తిని, తిన్నది అరగటానికి పల్లె వీధుల్లో మా ఉబ్బిన పొట్టలను ప్రదర్శించేవాళ్ళం. మా దగ్గర ఉన్నటువంటి ఆ గుర్రాలన్నీ ఇప్పుడు కూడా మా దగ్గర ఉండి ఉంటే ఈపాటికి అనుకున్నట్టుగానే చేసేవాళ్ళం. కానీ వాళ్ళు తుపాకులతోపాటు గుర్రాలనూ స్వాధీనం చేసుకున్నారు.

నేను నలువైపులా ఆ మైదానాన్ని కలయచూశాను. అల్లంత దూరం వరకూ ప్రాకిన, దేనికీ పనికిరాని మైదానం. కళ్లు దేన్నీ చూడలేక వాలిపోవాలి. అంతే. కేవలం నాలుగు ఊసరవెల్లులు మాత్రం తమ కన్నాల్లోంచి తలలు బయటకు పెట్టి మాడ్చి వేసే ఈ ఎండలు తలకు తగిలిన వెంటనే బండల పల్చటి నీడల్లోకి దాక్కుంటాయి. ఇక్కడ పనిచేయాల్సి వచ్చినప్పుడు ఇలాంటి ఎండలనుంచి తప్పించుకుని కాస్త సేదతీరటమైనా ఎలా? సేద్యం చేయటానికి మాకు ఇలాంటి బండరాళ్ళ భూములను ఇచ్చారు కదా!

"ఇక్కడినుంచి పల్లెవరకూ ఉన్న భూమి అంతా మీదే" - అన్నారు వాళ్ళు.

"ఏమిటి ఈ మైదానమా దొరా" - అని అడిగాం.

"ఔను ఈ మైదానమే. అల్లంతదూరం వరకూ విస్తరించిన అతి పెద్ద మైదానం".

మాకు కావలసింది ఈ మైదానం కాదు. నది దగ్గర ఉండే భూమి. నదికి ఆవల తుప్పలతో, పొదలతో, సరుగుడు చెట్లతో, పచ్చగడ్డి పెరిగిన మంచి పొలం మాకు కావాలి. బంజరు భూమిగా పిలవబడే ఈ గొడ్డు చర్మంలాంటి భూమి కాదు అని చెప్పాలనుకున్న మాట నాలుక చివరివరకూ వచ్చింది.

కాని ఇదంతా చెప్పటానికి వాళ్ళు అవకాశమే ఇవ్వలేదు. ఆ అధికారి మా దగ్గర చనువుగా మాట్లాడటానికి రాలేదు. ఆ భూమికి సంబంధించిన పత్రాలు మా చేతికి ఇచ్చి - "ఇంత పెద్ద పొలం దొరికిందని గుండెలు పగిలిపోయేను జాగ్రత్త!" అన్నాడు.

"ఇదా, ఇది కేవలం బంజరు భూమి" అన్నాం.

"వేల వేల ఎకరాలు"- అన్నాడు అధికారి.

"అయితే ఏం సార్, నీళ్లు లేవు. ఒక్క గుక్కెడు నీళ్ళు కూడా లేవు"

"వర్షకాలం వస్తుంది కదా! మీకు మాగాణీ భూమి ఇస్తామని ఎవరూ చెప్పలేదు. వర్షం వచ్చిన వెంటనే మంచి పంట పండుతుందిలే."

"కానీ దొరా, భూమి అంతా రాళ్లూ రప్పలూ, రాతి గని లాంటి ఈ నేలలో నాగలికొర్రు దిగుతుందని అనిపించటం లేదు.

విత్తాలంటే గునపం పట్టుకుని తవ్వాల్సిందే. అంతే. అలా చేసిన కూడా ఏదైనా పండుతుందనేది అబద్ధమే".

"అలాగని రాసివ్వండి. ఇక మీరు వెళ్ళొచ్చు. తిట్టాలనుకుంటే పెద్ద పెద్ద జమీందారులను తిట్టండి. మీకు పొలాలనిచ్చే ప్రభుత్వాన్ని కాదు."

"కాస్త ఆగండి సార్! ప్రభుత్వానికి వ్యతిరేకంగా మేమేమీ అనలేదు. మేము చెప్పిందేమైనా అది ఈ మైదానాన్ని గురించి మాత్రమే. వ్యవసాయం చేయటానికి సాధ్యపడని పొలాన్ని తీసుకుని ఏం చేయాలి సార్. ఆ విషయాన్నే మేము మీకు విన్నవించుకుంటున్నాం. కాస్త ఆగండి మళ్ళీ మొదటినుంచీ మాట్లాడుకుందాం."

అయితే వాళ్ళకు మా గోడు పట్టలేదు. ఇలా వాళ్ళు మాకు ఈ భూమినిచ్చారు. భగభగమండుతున్న ఈ పెనం మీద ఏవైనా మొలకెత్తుతాయేమోనని మేము విత్తుకోవాలట. లేదు. ఇక్కడికి ఏదీ రాదు. గద్దలు కూడా రావు. ఒక్కోసారి అవి ఏ మాత్రం చలనంలేని ఈ బండరాళ్ళ ప్రాంతాన్ని ఎంత త్వరగా దాటితే అంత మంచిదన్నట్టు తమకు సాధ్యమైనంత వేగంగా ఎగరటాన్ని చూడవచ్చు. ఇలాంటి బంజరు భూమి మీద నడిచేటపుడు మేము ముందు ముందుకు సాగటానికి బదులుగా వెనక్కు వెనక్కు మళ్ళుతున్నట్టుగా అనిపిస్తోంది.

"ఇదే వాళ్ళిచ్చిన భూమి" - అన్నాడు మెలితోన్.

"ఏమిటీ?" అని అడిగాడు ఫాపుస్తినో.

నేనేమీ చెప్పలేదు. మెలితోన్ బుద్ధి సక్రమంగా లేదు. అతను ఈ విధంగా మాట్లాడటానికి ఈ ఉక్కపోత కారణం కావచ్చు. అతని

టోపీ ద్వారా క్రిందికి దిగి అతని తలను వెడెక్కిస్తున్న ఉక్కపోత లేకపోతే ఇలా ఎందుకు మాట్లాడతాడు?

"వాళ్ళు ఇచ్చింది ఏ భూమి మెలితోన్?"

మెలితోన్ ఇలా అన్నాడు – "దీనివల్ల ఏదైనా ప్రయోజనముందా? ఏమీ లేకున్నా ఈ బయల్లో మన గుర్రాల ఉంచవచ్చు".

ఏ గుర్రాలు? ఏమిటా కథ?"– అని అడిగాడు ఎస్తెబాన్.

ఎస్తెబాన్‌ను నేను ఇంత దగ్గరినుంచి చూడలేదు. ఇప్పుడతను మాట్లాడటం వల్ల నాకు గమనించటానికి వీలుపడింది. అతను తొడుక్కున్న చొక్కా ఛాతీని మూసేదిగా మాత్రమే ఉంది. దాని అడుగున కోడిలాంటి ఒక తల కనిపిస్తోంది.

ఔను, ఎస్తెబాన్ తన చొక్కా అడుగున పెట్టుకున్నది ఒక ఎర్రటి కోడినే! దాని నిద్ర నిండిన కళ్ళను, ఆవులిస్తున్నట్టుగా కనిపించే ముక్కును చక్కగా గమనించవచ్చు.

"ఎస్తెబాన్ ఎక్కడినుంచి కొట్టుకొచ్చావ్ ఈ కోడిని?" – అని నేను అడిగాను.

"నాదే ఈ కోడి"– అన్నాడతను.

"మొదట్లో అది నీ దగ్గర ఉన్నట్టు లేదు. ఎక్కడైనా కొన్నావా ఏమిటి?"

"నేనేమీ కొనలేదు. మా ఇంట్లో వుండే కోడే ఇది".

"అంటే దాన్ని కోసి తినటానికి తెచ్చావుకదూ!"

"లేదు. సాకటానికే తెచ్చాను. దీనికి పొట్ట నింపటానికి ఇంట్లో ఎవరూ లేరు. అందుకే వెంట తీసుకొచ్చాను. నేను దూరప్రయాణం చేసినప్పుడల్లా దీన్ని కూడా వెంట తీసుకువెళ్తాను"

"ఊపిరి ఆడక అది చచ్చిపోతుందేమో? ముందు దాన్ని బయటికి తీయ్".

అతను కోడిని చంకన పెట్టుకుని ఉఫ్‌మని దాని వైపు ఊదాడు.

అటు తరువాత – "బండరాళ్ళ బయలు వచ్చేసింది." అన్నాడు.

ఎస్తెబాన్ ఇంకా ఏమి చెబుతున్నాడో నాకు వినిపించలేదు. కనుమలోకి దిగటానికి మేమంతా వరుసగా నడుస్తున్నాం. అతను మా ముందు నడుస్తున్నాడు. కోడిని తలక్రిందులుగా పట్టుకుని దాని తల రాళ్లకు తగలకుండా ముందుకు వెనక్కు ఊపుతూ నడుస్తున్నాడు.

కనుమలోకి దిగుతుంటే అక్కడి భూమి సారవంతంగా కనిపించింది. కనుమలోకి దిగే ఓ కంచరగాడిదల గుంపులా మేము నడుస్తుండగా మా అడుగుల వల్ల దుమ్ము పైకి లేస్తోంది. ఆ ధూళి మాకు ఇష్టం. రాళ్ళు రప్పలతో కూడిన ఆ బయలు భూమి గట్టినేలను తొక్కి తొక్కి పదకొండు గంటలు ప్రయాణించిన తర్వాత మా మీదకు ఎగిరి మట్టిలా రుచించే ధూళిలో స్నానించటం ఏంత హాయి.

నదికి అవల సరుగుడు చెట్లమీద గుంపులు గుంపులుగా కువకువమని సద్దు చేస్తూ ఏవో పక్షులు ఎగిరాయి.

అలా వాటిని చూస్తుంటే మాకూ సంతోషం వేసింది.

హఠాత్తుగా మా పక్కనే కుక్కలు అరుపులు వినిపించాయి. ఎందుకంటే పల్లె మీదుగా వీస్తున్న గాలి పల్లె కోలాహలాన్నంతా ఇక్కడికి తెచ్చి కురిపిస్తోంది. మేము మొదటి ఇంటిని సమీపిస్తుండగానే ఎస్తెబాన్ మళ్ళీ తన కోడిని పట్టుకున్నాడు. కట్టిపడేసిన దాని కాళ్ల కట్లను విప్పదీసి తిమ్మిరెక్కిన దాని కాళ్ళను ప్రేమగా నిమిరాడు. అటు తర్వాత – "నా దారి ఇటూ" అంటూ ఎత్తయిన చెట్ల నడుమ దారి చేసుకుంటూ కోడితో సహా కనుమరుగయ్యాడు.

మేము పల్లె వేపు నడవసాగాం.

వాళ్ళు మాకు ఇచ్చిన భూమి మా వెనుక, చాలా దూరంలో ఉంది! ●

---

# మనసంతా ఒక్కటి

- రాజేశ్వరి దివాకర్ల



లోకాభిరామాయణం
ముచ్చటించుకుంటూ
అమ్మలక్కలు
చేతులానుకునే పిట్టగోడలు లేక
బహుళ గృహాల నివాస భవనం
ఏకాంత మయింది.

పక్కింటి పిన్నిగారు
పనితీరిన వేళల్లో
కంటి చూపుల కథలకు
అతుక్కుని పోయి
బయటకు రావడం మానేసాక
తెరుచుకునే తలుపులు లేక
ఎదురిల్లు దూరమయింది.

హడావుడి సరోజ
అరకప్పు పంచదార అప్పుకు
పొరుగింటికి వెళ్ళక
ద్విచక్రవాహన సంచారం మొదలెట్టి
సరుకు సామాను లెప్పటికప్పుడు
తానే తెచ్చుకుంటున్నది కనుక
ఇరుగుపొరుగు తీపి బంధం
తెలియకనే తెగిపోయింది.

ఎవరికి వారుగా విడిపోతున్న
ఎత్తరి కట్టడంలో
ఎరిగున్న వారింట్లో అమ్మాయి
పెద్ద పదవుల కెదిగిందన్న వార్త
అందరి విజయంగా
ఆనందం ఏకమయింది

ఎంతో బుద్ధిమంతునిగా కనిపిస్తూ
ఉమ్మడిగా అందరినీ గౌరవించే అబ్బాయి
ఆ రోజు ఆందోళనలో పాల్గొని
ఆత్మాహుతి కెర అయ్యాడన్న వార్తను
అందుకోలేక
అంతస్థుల భవనమంతా
ఏకంగా వేలాడిపోయింది.

ఎవరింట్లో దీపం వారిదే అయినా
అందరినీ ఇంటికి చేర్చే
మార్గ పథంలో అరనిముషం
వెలుగు ఆరిపోతే చాలు
ఒక్కటిగా అందరూ తల్లడిల్లారు
చిన్న కాంతి చాలు
చీకటి తొలగిపోతుందని
మనసులన్నీ కలిపి వేడుకున్నారు

---

# 'అతడు'

- ఎరుకలపూడి
గోపీనాథరావు



అతణ్ణి చూడండి, పరికించండి
యుగయుగాల దోపిడీకి గురైన వర్గానికి
యుక్తమైన ఉపమానంలా వుంటాడతడు
వసంతమే ఎరుగని నిసర్గానికి ఉదాహరణమనిపిస్తాడతడు!
అతణ్ణి గమనించండి -
అతని బ్రతుకు గమనాలూ
అతని పతనోత్పతనాల జీవనగాన గమకాలూ -
కడలి కెరటాల్లా వుంటాయి!
స్వేదాలు చిందే అతని దేహం
నురుగులు గ్రక్కే సంద్రతరంగ సందోహంలా వుంటుంది!
అగ్నిపర్వతాలను అంతరంగంలో అణచుకున్న
సముద్రునిలా అశ్రుసాగరాలను
ఎదలో దాచుకున్న సమున్నతుడతడు!
అతణ్ణి పరీక్షించడం -
వ్యవస్థమీద వెటకారంగా విసిరిన అతని నవ్వు
మధురమందహాసమనుకోవడం
మన మతిమాలినతనమే అవుతుంది!
అతని నిశ్శబ్దం, నిష్క్రియాతత్వం
అతనిచేతగానితనం కానేకాదు సుమా!
విజృంభణముందు విధిగా వుండవలసిన విరామమది!
ఆటుపోటులను సహిస్తున్న అపారపారావారంలా
ఆకలీ, ఆవేదనా చక్ర పరిభ్రమణంలో సంచరిస్తున్న అతడు
ఎప్పుడెలా పరిణమిస్తాడో...పరివర్తిస్తాడో....పరిస్థితులే చెప్పగలవు!
నిమ్నుడనీ, నిరాయుధుడనీ, నిర్బలుడనీ, నిస్సహాయుడనీ
నీచంగా చూడకండి అతణ్ణి!
బ్రద్దలయ్యే అదును కోసం వేచియున్న జ్వాలాముఖిని
బండమారిన అగ్నిపర్వతంలా అంచనా వేస్తే ఎలా?
మర్మమెరిగిన పిపీలికానికి
మదమత్తమాతంగాన్ని మట్టి కరిపించడం ఎంత పని?
ఏకమైన చలిచీమల పటాలంచూసి
అజగర అహంకారమూ పటాపంచలై పోవాల్సిందే!
శాంతికపోతాల సమీకరణ ముందు
వేటగాళ్ళ వలలన్నీ చీలికలై, పేలికలై, చివికి, చితికి పోవల్సిందే!
....
అప్పుడతణ్ణి చూడండి
అభ్యుత్థానమధర్మస్య" ...... అంటూ
మరో అవతారం దాల్చడానికి సిద్దంగా వున్న సిద్ధుడిలా లేడూ...?

కథ

# స్వరం - అనుస్వరం

- మల్లారెడ్డి మురళీమోహన్



**కాగితం కింద అచ్చుకాగితం పెట్టి రాస్తే తయారయ్యే నకలులాంటిది నా జీవితం. నీడ లాంటిది నా జీవితం. అవును.... తెలుగు చిత్ర సీమని రెండు దశాబ్దాలుగా ఏలుతున్న వెండితెర వేల్పు విక్రాంత్‌కి నీడలాంటిది నా జీవితం.**

విక్రాంత్ - పక్క రాష్ట్రానికి చెందిన వాడైనా, భాష రాని వాడైనా... 'నటనలో జీవిస్తాడు'...కనుక అతడు 'సూపర్ స్టార్'. తెరపై పెదవులు మాత్రమే కదిల్చే అతని నటనకు గొంతు అరువిచ్చి జీవం పోసే నేను అతని తెర వెనుక 'గొంతు'ను. సూపర్ స్టార్ విక్రాంత్‌కి డబ్బింగ్ చెబుతుంటాన్నేను. అందుకే అతని నీడలాంటిది నా జీవితమని అంటున్నాను.

అందుకే నేను గొంతు విప్పే వరకూ నాకంటూ ఏ విధమైన గుర్తింపూ లేదు. రెండు దశాబ్దాల క్రితం ఇద్దరమూ ఒకే సారీ కెరీర్ మొదలుపెట్టాం. అతని నటననూ, నా గొంతునూ విడదీసి చూడలేని ప్రేక్షకులు అతని కోసమే నా 'గొంతు' పుట్టిందన్నారు. అతని నటనా, నా గొంతూ పడుగు పేకల్లా కలిసిపోయాయి. 'నేను' మాత్రం వేరు చేయబడుతున్నాను. నెమ్మది, నెమ్మదిగా అతను ఎదిగాడు. అతడితోబాటే నా 'గొంతూ' ను నేను మాత్రం 'నేను' గానే అక్కడే ఆరంభంలోనే ఉండిపోయా. అస్థిత్వం లేనివాడిలా...సామాన్యుడి వేలిముద్రలా.

అతని స్టార్‌డమ్ వెనుక నా 'గొంతు' దన్ను ఎంతో ఉందన్నారు. చాలామంది. కానీ లోగొంతులో. ఎందుకంటే 'స్టార్'కి ఎదురుగా నిలిచి చేదునిజాన్ని వెల్లడి చేసి, అతని ప్రాపకాన్ని పోగొట్టుకోవాలని ఎవరికుంటుంది. చెప్పండి?

అతనికీ తెలుసు.... అతని విజయగాథ వెనుక నా 'స్వరపేటిక' తెరుచుకుని వచ్చిన శబ్దాల సామర్థ్యం, భాగస్వామ్యం ఎంతో ఉందని. కానీ ఆ విషయం నలుగురి ముందూ బాహాటంగా ప్రకటించి తన 'స్టార్ వేల్యూ'లో కొంత భాగస్వామ్యాన్ని నాకు ఆపాదించేంత, లేదా పంచుకునేంత ఉదార స్వభావం అతనికి లేదు. అటువంటి ఉదార స్వభావం ఈ రంగంలో శిఖరాగ్రాన ఉన్నప్పుడు బహుశా లుప్తమై ఉంటుందేమో! ఈ రంగంలో ఉంటూ నేను గమనించిందదే. అవకాశాలు తగ్గుముఖం పట్టి అగ్రస్థానం నుండి జారుతున్నపుడే చాలా మందిలో 'ఆత్మ విమర్శ మొదలవుతుంది. ఈ రంగంలోనే కాదు, ఇది చాలా రంగాల వాళ్ళకి వర్తిస్తుంది.

సూపర్ స్టార్ విక్రాంత్‌ని వెతుక్కుంటూ రివార్డులతో పాటు చాలా మటుకు అవార్డులూ వచ్చాయి. కానీ అతని 'అసంపూర్ణ ప్రతిభ' ను పరిపూర్ణం చేస్తున్న నా గొంతుకు మాత్రం తగినంత గుర్తింపు దొరకలేదు. తెరపై అతనూ, తెర వెనుక అజ్ఞాతంగా నేనూ (నేనా? నా గొంతా??) ఎదుగుతూ వచ్చాం... సమాంతరంగా మాత్రం కాదు.

యాదృచ్ఛికంగాననుకోండి, విధివశాత్తూ అనుకోండి- ఏదో ఒక బలమైన సంఘటన చోటు చేసుకున్నాకే జీవితంలో 'అనిశ్చితి' ఏర్పడుతుంది. అటువంటి అనిశ్చితి, విక్రాంత్‌కి రోడ్డు ప్రమాదం జరగడం వలన నా జీవితంలో ఏర్పడింది. ఒక ఘోరమైన రోడ్డు ప్రమాదంలో విక్రాంత్ నడుముకి బలమైన గాయమై పూర్తిగా మంచానికే పరిమితమైపోయే పరిస్థితి ఎదురైంది. పరిశ్రమంతా తీవ్రమైన దిగ్భ్రమకు, ఆందోళనకూ గురైంది. అతనితో సినిమాలు తీస్తున్న వాళ్ళూ, తీయాలనుకుంటున్న వాళ్ళూ బాగా నష్టపోయారు. పూర్తయిన సిన్మాల నిర్మాతలు ఊపిరి పీల్చుకున్నారు. సగంలో ఆగిపోయిన సినిమాల నిర్మాతలు గుండెలు బాదుకున్నారు.

# తీగకు కాయ బరువైన చోట..

**- పోతగాని**



వాళ్ళు .......
ఆ రాత్రి రాయలేని రహస్య స్వగతాల పేగు కదిలి
మోయలేని మైల వస్త్రాలై విసర్జింపబడుతుంటారు!
పేగు తెగిన జీవన పతంగాలై
చీదరింపుల చిటారు కొమ్మల్లో చిక్కి
బతుకు పోరాటంలో ఊగిసలాడే,
ఒంటరి పెనుగులాటలౌతుంటారు.
కదిలిపోయే కాలం కాగితాలపై అనవరతం ఆరని
ఆకలి సంతకాలౌతుంటారు!
దుఃఖిత ఏకాంతాలు విస్తరించిన మౌన మైదానాలపై
గాయపడిన హృదయం నుండి రాలిపడిన వాగ్బింధువుల
వ్యక్తా వ్యక్త పలవరింతలౌతుంటారు!
ఆర్తిని పోగు చేసి మొగ్గలై ముకుళించిన హస్తాలతో
అంతులేని ఆవేదనల జలపాతాలౌతుంటారు!
ఓదార్పును విదిలించిన ఔదార్యాల వెనుక
నిరీక్షణ ఫలించని నయనారణ్యాలలో
విశ్రమించని అశ్రుశిశిరాలౌతుంటారు!
మంచు దుప్పట్లోకి తల దూర్చి అచ్ఛాదనలేని దేహాలపైకి
ఆకాశ దీపాల వెలుగులకు ఆహ్వాన గీతికలౌతుంటారు!
ఎంగిలి మెతుకులకై ఆశపడి
అనుక్షణం వంచించబడుతున్న ఊడిగాలౌతుంటారు!
దూషణలై దూసుకొస్తున్న మాటల ఈటెలు
మస్తిష్కంలోకి దిగబడుతుంటే
బతుకును బత్తాయి తొక్కలా వలిచి
గుండెను తొనలు తొనలుగా చీల్చి
జీవరసం జుర్రుకోబడుతున్న వ్యధార్త అనుభూతులౌతుంటారు!
గమ్యం తెలియని గమనంలో
అడుగడుగునా పాదాలకు గుచ్చుకుంటున్న
పల్లేరు కాయల్ని పెరికేస్తున్నట్లు
ఎత్తలేని బరువులై వేధించే ప్రతి క్షణాన్ని
పంటి బిగువున గతంలోకి విసిరేసుకుంటున్న
అవిరామ జీవన పోరాట యోధులవుతుంటారు
వాళ్ళు.....
ఆనందాలకు, ఆవేశాలకు అతీతులైన వాళ్ళు
చీకటి వాస్తవాలపై
వెన్నెల వస్త్రాలు కప్పుకోవడం తెలియని వాళ్ళు
బాధల్ని బాటలుగా మలచుకోవడం అలవాటైన వాళ్ళు
అసహన రేఖల్ని కౌగలించుకొని
ఊహా వాహికను వెతుక్కుంటూ
మగత మజిలీలలో కలత నిద్రలవుతుంటారు!
తూరుపు వాకిలి తలుపు తెరుచు కోకముందే
గతం సమాధుల్ని పెకిలించుకొని
సందేహ సంధ్యలైన బతుకుల్ని మేల్కొలుపుకుంటారు!
చిగురించే మానవతల చిరునామా వెతుక్కుంటూ
వేల వేల ప్రశ్నల కొడవళ్ళను దారిపొడవునా విసిరేస్తూ
"ఈ పాపం ఎవ్వరిదని" వెర్రికేకలేస్తుంటారు.
అంతలోనే తేరుకొని -
ఆశల్ని, నమ్మకాల్ని వెంటబెట్టుకొని
రాత్రి ఎడారి శిధిలాలను తొక్కుకుంటూ
సా...గి...పోతుంటారు......

---

అతనిపై వెలుగు పడుతున్నంత వరకే నీడలాంటి నా జీవితమూ వెలిగి ఉంటుంది. అతనే చీకట్లోకి నెట్టి వేయబడ్డప్పుడు 'నీడ' లాంటి నాకు ఇంకెక్కడ చోటు ఉంటుంది?

రెండు దశాబ్దాలుగా నా 'గొంతు' పై అతనికి మాత్రమే పేటెంట్ హక్కులున్నట్టు కేవలం అతని నటనకే పరిమితమైంది. ఇప్పుడు ఆ చట్రాన్ని ఛేదించుకుని, ఆ పరిధి నుండి బయటికి వస్తేనే గానీ నాకు మనుగడా, బ్రతుకు ఉండవు.

ఇప్పుడు నాలో ఆత్మశోధన మొదలయింది. నిజానికి అతని నటనకు నా గొంతు పరిపూర్ణతనిచ్చిందా? లేక నా 'గొంతు' కే అతని నటన రూపమిచ్చి, ప్రాణం పోసి పరిపుష్టినిచ్చిందా? ఇన్నాళ్ళుగా నేను ఒక విధమైన అభద్రతా భావంతో కృంగిపోయానా?? అతని నట జీవితం మంచాన పడి, నా 'స్వరం' ఇక భవిత లేనిదై మూగబోనుందా?

ఇలా నిరాశా, నిస్పృహల్లో నేనున్నపుడు ఊహించిన కోణాల్లో అందివచ్చిన అవకాశాలు నా జీవితంలో అనిశ్చితిని పటాపంచలు చేశాయి. విక్రాంత్ నటనకే కాదు, నా 'గొంతు' కీ 'స్టార్‌డమ్' ఉందని నిరూపించగలిగేట్టూ, అతను మళ్ళీ నటించగలిగే స్థితిలో లేనందున, ఆ లోటుని నా 'గొంతు' కొంతమేరకైనా భర్తీ చేయగలదని నమ్మకం ఉన్న కొందరు నాకు కొన్ని అవకాశాలిచ్చారు.

రేడియోల్లో, టీవి ఛానాళ్ళలో ప్రకటనల 'వాయిస్ ఓవర్' కి, 'యాంకరింగ్‌కి' అవకాశాలు ఒక్కటొక్కటిగా రాసాగాయి. క్రమంగా నేనూ బిజీ అవ్వసాగాను. సాయంత్రపు ఎండ మీద పడ్డప్పుడు నీడ పెరిగినట్టు, జీవితపుమలి సంధ్యలో నా కెరీర్ మళ్ళీ పుంజుకోసాగింది. నా గొంతు - నాదిలాగే మ్రోగుతోందిప్పుడు. అస్థిత్వం, ఆత్మవిశ్వాసం కూడగట్టుకున్న నా 'స్వరం' ఇప్పుడు పలికే ప్రతి పలుకూ 'నాదే'.

మర్రిమాను నీడలో మరే మొక్కా పెరగదంటారు. విక్రాంత్ విశ్రమించాక, ఆ చట్రం నుండి బయటకొచ్చి ఎలుగెత్తి పలుకుతున్న నా గొంతులాగే నాపేరుకీ ఓ ప్రత్యేకత ఉందనిపిస్తోంది. నారదముని చేతిలో సంగీత వాయిద్యం పేరూ అదేనన్న ప్రత్యేకత తప్పితే మరేమీ లేదనుకున్నా నా పేరులో. కానీ ఇప్పుడు చెప్పాలనుంది... నాపేరు 'మహతి' అని.

# విధ్వంస పర్వంలో వితండం



- తెలకపల్లి రవి

**ట్యాం**కుబండ్‌పై తెలుగు ప్రముఖుల విగ్రహాల విధ్వంసం ప్రజాస్వామిక భావనల పట్ల గౌరవం వున్నవారంతా నిశితంగా ఖండించవలసిన చర్య. మీడియా ప్రతినిధులపై దాడి, కెమెరాల విధ్వంసం ఇంకా దారుణమైనవి. ఇదే ప్రాంతానికి చెందిన మరో ఇద్దరు నాయకులపై దౌర్జన్యం గతంలో ఇక్కడి ఇద్దరు ఎంఎల్‌ఎలపై జరిగిన దానికి కొనసాగింపు. వీటిని ఖండించడమంటే తెలంగాణా ప్రజలను లేదా ఉద్యమాన్ని అవమానించడంగా చేసే వ్యాఖ్యలు రెండు విధాల పొరబాటు. ఒకటి - జరిగిన దాన్ని పరోక్షంగా సమర్థించడం. రెండు - తమ నిర్వాకాన్ని ప్రజలందరికీ ఆపాదించడం. మార్చ్ నిర్వాహకులు విగ్రహ విధ్వంసం అసమంజసం అంటూనే అదేదో తెలంగాణా సాంస్కృతిక ఆధిపత్యంపై పోరాటానికి వ్యక్తీకరణ అంటూ ఆమోదముద్ర వేస్తున్నారు. ఈ వితండంలో విలువల విధ్వంసం మరింత విధ్వారమైంది.

విడిపోయినా కలిసి వుండొచ్చని హితవు చెప్పేవారు నిన్నటి తరం మహనీయుల విగ్రహాలను కూడా చిరునామాలను బట్టి చూసి విధ్వంసం చేయడం దేనికి నిదర్శనం? కరసేవకులు, తాలిబాన్లు, శివ సైనికుల వంటి వారు తప్ప లౌకిక ప్రజాస్వామికవాదులెవరూ ఇలాంటి పనులకు పాల్పడరు. లోగడ కరసేవలకు ఆధ్వర్యం వహించిన, ఇప్పుడు కూడా విధ్వంస ఘట్టంలో భాగస్వాములుగా వున్న నేతలే అందరికన్నా ముందు ఖండించడం ముందు జాగ్రత్త కావచ్చు. ద్వంద్వ భాషణాల కాంగ్రెస్, తెలుగుదేశం, బిజెపిలను అలా వుంచితే సిపిఐ, న్యూ డెమోక్రసీ నాయకులు, ప్రతినిధులు కూడా విధ్వంసాన్ని ఖండించారు గాని అలాంటి సందర్భంలో భాగం పంచుకుని ఆ పైన ఏం చెప్పినా జరిగిన వికృతం మాసిపోదు.

రాష్ట్ర రాజధానిలో సచివాలయ సమీపాన ఏదైనా ఏర్పాటు చేసేటప్పుడు మొత్తం రాష్ట్రాన్ని గమనంలో వుంచుకోవడం సహజం. దాంతో పాటే సామాజిక పొందికను కూడా చూడక తప్పదు. తన చేతనైన మేరకు వివిధ కోణాల నుంచి చూసి అన్ని ప్రాంతాల వారితో యోచించి ఎన్టీఆర్ ప్రభుత్వం 1986లో విగ్రహాలను ప్రతిష్టించింది. వారిలో దాదాపు అందరూ సంస్కర్తలు కవులు, కళాకారులు, చారిత్రక వ్యక్తులే. మాననీయులే. కాస్త తేడాలున్నా - కె.సి.ఆర్., జానారెడ్డి, నాగం, సుఖేందర్ రెడ్డి, మందా జగన్నాథం, అందరూ - వాటిని స్థాపించిన సమయంలో ఎన్టీఆర్ పార్టీ వెనకే వున్నారు. ఇప్పుడు వారు విధానం మార్చుకోవచ్చు. అంతమాత్రాన గడియారం వెనక్కు తిరగదు. 1986లో ఆ విగ్రహాలను ప్రతిష్టిస్తే ఆ తర్వాత కాలంలో మరణించిన దాశరథి, కాళోజీ, అయిలమ్మ వంటి వారి విగ్రహాలు ఎందుకు పెట్టలేదని ప్రశ్నించడం అలాంటిదే. కొమరం భీమ్ విగ్రహం పెట్టడానికి అందరూ అంగీకరించినా అలక్ష్యం చూపింది పాలకులే తప్ప ప్రాంతాల తేడాలు కాదు.

అస్తిత్వం గురించి, ఆధిపత్యాల గురించి ఎంతైనా మాట్లాడవచ్చు గాని దానికి అనేక కోణాలుంటాయి. తెలంగాణా ప్రజలు వెట్టిచాకిరీలో మగ్గిపోవడానికి కారణమైన నిజాంను నెత్తిన పెట్టుకుని మాట్లాడటం ఒకవైపు - నిజాం రాజు జన్మ జన్మాల బూజు అన్న దాశరథి విగ్రహం పెట్టాలనడం మరో వైపు ఎలా పొసుగుతాయి? హైదరాబాద్‌లో 1946-51 నాటి తెలంగాణా సాయుధ పోరాట వీరుల స్థూపాలు పెట్టకపోవడానికి వారి కమ్యూనిస్టు రాజకీయాలు ప్రధాన కారణం. ఈ పదేళ్ళలో ప్రాంత స్మరణ చేసిన వారైనా ఆ విగ్రహాలను ఎన్ని చోట్ల పెట్టారు? దొడ్డి కొమరయ్య, అయిలమ్మ భవనాలు కమ్యూనిస్టులు పెట్టుకున్నారే గాని వీరు కాదే? తెలంగాణా సాయుధ పోరాట తొలి అగ్ని కణం దొడ్డి కొమరయ్య చిత్రం కూడా లేదు. ఇటీవలనే పన్నీరు రమేష్ అనే మిత్రుడు కడవెండిపై పరిశోధన చేసి కొమరయ్య కవల అయిన వాళ్ళ అన్నయ్య చిత్రం తెస్తే దాని ఆధారంగా ఒక వూహాచిత్రం ప్రజాశక్తి బుక్‌హౌస్ తీసుకొచ్చిన పుస్తకంలో ప్రచురించాము. ఈ రచయిత సంపాదకత్వంలో వెలువడిన వీర తెలంగాణా మాది పుస్తకంలోనూ అలాటి వీరుల కథలు అనేకం వున్నాయి. ఆపైన వరంగల్‌జిల్లా వీరగాథలు పుస్తకం వచ్చింది. నల్గొండకు సంబంధించింది రాబోతుంది. వీటిలో విప్లవ చైతన్యం వున్నా విభజన రాజకీయాలుండవు గనుకే కొందరికి గిట్టదు. అది వారి ఇష్టం. కాని ఇప్పటి తమ విభజన వాదాన్ని వందల ఏళ్ళ నాటి ఎర్రాప్రగడకు, మొల్లకు వర్తింపచేయడం ఏ నాగరికత? ఏ విధమైన చారిత్రకత? రాముణ్ణి కూడా మానవీయంగా చిత్రించిన మొల్ల, చాపకూటితో సమతను నేర్పిన బ్రహ్మన్న, బ్రహ్మమొకటేనన్న అన్నమయ్య, విశ్వనరుడనేనన్న జాషువా, మనుష్యుడే నా సందేశం అన్న శ్రీశ్రీ. వీళ్ళ విగ్రహాలు విద్వేషానికి ధ్వంసం చేయడం ఏం సాధించడానికి? ఖైరతాబాద్ జంక్షన్‌లో విశ్వేశ్వరయ్య, ట్యాంక్‌బండ్ పక్కనే అంబేద్కర్ వీరిని కూడా ప్రాంతాల వారీగా చూద్దామా? కాటన్ మాకు ఆనకట్టలు కట్టాడా, కందుకూరి మా పెళ్ళిళ్ళు చేశాడా? అని అడగడంలో అమాయత్వం వుందా, అసహనం రగిలించే వ్యూహం

# బొబ్బిలి నానీలు



- బొబ్బిలి జోసెఫ్

కమ్యూనిస్టు గాంధీ
ఎర్ర సత్యాగ్రహి
గట్టిమేల్ తలపెట్టిన
సుందరయ్య

హైవేలో
గోతులన్నీ
అద్దాలముక్కలైనాయి
ఇప్పుడే వర్షం వెలిసింది

ముళ్ళపొదకు
మస్తు(త్తు) గా పూచాయి
ఘుమఘుమలాడే
గులాబీలు

మేధావుల్ని గుర్తించడం
మహాకష్టం
అందరూ జుట్టుకు
రంగేసుకున్నారు

టీ - టిఫిన్ చేశాడు
హోటల్ నుండి కదలడే?
బయట జోరున
వర్షం కదా!

పూజలు ఘనమే
చివరికి నీట ముంచి
వదిలేశారు
అయ్యో! గణపతీ!
స్వస్థత ప్రార్థనలు

వైద్యం నాస్తి
మూఢభక్తి
శాశ్వత నిద్రప్రాప్తి

ప్రతి వాడు
అందరి వాడు
అందుకే ఆత్మహత్య
సామాజిక నేరం

తాకుతూ పోతోంది
తడిమినా చిక్కదు
ఏం మాయలాడివే
ఓ చిరుగాలీ!

రాజకీయం
వ్యాపారం
పెట్టుబడి
ప్రజల అమాయకత్వం

---

వుందా? విగ్రహాలదేముంది అని తీసిపారేయదలిస్తే అప్పుడు తెలుగు తల్లికి చెల్లిలాంటి తెలంగాణా తల్లి వచ్చేదేనా? ఆ తెలంగాణా తల్లి విగ్రహాన్ని విధ్వంసం చేసిన వారిలో విభజనవాద నాయకులు వున్నారని పోలీసులు వెల్లడిస్తే మౌనం పాటించడంలో మతలబేమిటి? ఇదే శీర్షికలో తెలుగు తల్లి అనేది ఒక భావన అని, తల్లి అంటేనే విశ్వజనీనమని అన్నందుకు కొందరు విరుచుకుపడ్డారే?

కేంద్రం సృష్టించిన సంక్షోభంలో ప్రధాన రాజకీయ పార్టీలు చదరంగం ఆడుతుంటే ఆ వైరుధ్యాలు విడమర్చి చెప్పవలసిన మేధావులనేవారు, కవులు, కళాకారులు కూడా కొట్టుకుపోవడం విచారకరం. తెలంగాణా భాష అంటూ విడిగా వుందని అశాస్త్రీయ వాదనల నుంచి సహజ వైరుధ్యాన్ని చూపించే కుటిల వాదనల వరకూ చాలా చాలా వస్తున్నాయి. ఉచ్చారణలో ఏ తేడాలున్నా తెలుగు భాష లిపి, సంస్కృతి అవిభాజ్యం, ఆదిలాబాద్ నుంచి మహబూబ్‌నగర్ వరకూ ఏకరూప సంస్కృతి ఉచ్చారణ ఏమీ వుండవు. యాదగిరి నరసింహస్వామి, కొమరవెల్లి మల్లన్న జాతరలు ఒక్కలా జరగవు. ఇప్పుడు కొన్ని ఛానళ్ళలో కృత్రిమంగా వాక్యం చివర పదాలు మార్చేవారు తెలంగాణా సహజ పదజాలాన్ని కృతకం చేస్తున్నారు కూడా. సినిమాలలో భాషను తక్కువ చేశారని, మరెవరో కవులను తక్కువగా చూశారని విమర్శించదలిస్తే అలా చేసిన వారి కుసంస్కారాన్ని తప్పు పట్టాలి. నిజాం రాజు రాజకీయ అవసరాల వల్ల చారిత్రికంగా వచ్చిన ఈ తేడాలకు ఇప్పటి జనం కారణం కాదు. దోచుకోవడంలో ఏ ప్రాంతంలోని పెత్తందార్లు తక్కువ కాదు. వారిలో వారికి ఉండే తేడాలతో జనానికి సంబంధం లేదు. అసమానతల వ్యవస్థలో తేడాలు ఎప్పుడూ వుంటాయి గాని వాటిపై చేయాల్సిన పోరాటాలు వేరు. సాంస్కృతిక ఆధిపత్యం అన్న మాటను అసందర్భంగా వాడటం స్వార్థపరులకే ఉపయోగం. సురవరం ప్రతాపరెడ్డి రాసింది ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పోతన రాసింది ఆంధ్ర మహాభాగవతం. వారికి ఇప్పటి రాజకీయ అవసరాలు, వ్యూహ ప్రతివ్యూహాలు తెలియవు. గతమంతా ఎందుకు, ఇప్పుడు కూడా గద్దర్‌ను తెలుగువారందరూ తమవాడిగా చూస్తారు తప్ప ఆయన పుట్టిన వూరిని రాజకీయ భావాలను బట్టి పరిమితం చేయరు.

ఇప్పుడు మనం ఏం కావాలంటే అలా చేయొచ్చు. పాలక వర్గీయులు ఏదో నిర్ణయం తీసుకుంటున్నట్లు నమ్మించవచ్చు. కొయ్య గుర్రంపై స్వారీ చేస్తూ వేల మైళ్ళ వేగంతో దూసుకుపోతున్నట్టు నటించవచ్చు. కాని అవకాశవాదుల, అరాచక శక్తుల హానికర పోకడలను గమనించకుండా అస్తిత్వవాదం పేరుతో వారిని భుజాన మోయడం ఆందోళనకరం. ప్రాణాల పట్ల విలువున్న వారెవరూ ఆత్మహత్యలను ఊతపదంగా వాడరు. ఆ గుండెకోత అందరిదీ. అందుకు బాధ్యత అందరిదీ. ప్రత్యేక రాష్ట్రం ఇస్తే పాదాలు పాలతో కడుగుతామని ప్రకటించడంలో లేని ఆత్మగౌరవ సమస్య వందల ఏళ్ళ నాటి మొల్లతోనో, ఎర్రాప్రగడతోనో, కందుకూరి వీరేశలింగంతోనో రావడం వెనుక వున్నది రాజకీయమే. విగ్రహాల విధ్వంసంపై నిఘా వర్గాల స్పష్టమైన నివేదికలను ఎందుకు పట్టించుకోలేదనే ప్రశ్నకు స్పష్టమైన సమాధానమే లేదు. తర్వాత నమోదు చేసిన కేసులపై వస్తున్న ఆరోపణలకూ వివరణ లేదు. సీమాంధ్ర, తెలంగాణా పేర్లతో ఇరువైపులా శక్తి కొద్ది మాట్లాడే నేతల విన్యాసాలకు అంతు లేదు. ఈ స్వకీయ వ్యూహాలు విరమించేంత వరకూ తెలుగు వెలుగులపై దాడి జరుగుతున్నట్టే భావించాలి. ఈ విలువల విధ్వంసాన్ని ఒక పాఠంగా తీసుకోవడం అందరికీ మంచిది. అంతేగాని ఎక్కడెక్కడ బొమ్మలు పడగొట్టారో ఏకరువు పెట్టి సమర్థించుకోవడం మొదలెడితే రేపు ఇదే అరాచకం తమపైకి మరలవచ్చు. అసహనం వల్ల కలిగే అనర్థమే అది. అయితే చైతన్యవంతులైన తెలుగు ప్రజలు అన్ని రకాల అవకాశవాదాలకూ సమాధానమివ్వడం త్వరలోనే చూడొచ్చు. ●



## రక్తపు మడుగులో

**- డా|| బావికాటి రాఘవేంద్ర**

విశ్వమంతా పోరే...
ఆధిపత్య పోరు
పోరుల స్కేలులో
సీమ పోరు చిన్నదే... కాని భిన్నం

గొడవలూ గృహదహనాలు
ఖూనీలు కోర్టులూ...
కోహినూర్ కోసమో
ఢిల్లీ పీఠం కోసమో కాదు
పల్లెపై పట్టు కోసం! పేడ దిబ్బ కోసం!

క్రూసేడుల పోరులో చీలిన దేశాల్లా
ఫ్యాక్షన్ పోరులో భస్మంగాని పల్లెలే లేవు
రక్తం చిందని సెంటు స్థలం లేదు

వజ్రవైడూర్యాల సీమ
బాంబులతో కత్తులతో
కుటిల నేతల ముఠా కక్షలతో
నెత్తురు మడుగులో తడిసి తడిసి
ఘోషిస్తోంది

పార్టీ
ఫ్యాక్షనై
పల్లెల్ని ముట్టబెడుతుంటే
పెట్రోలుపోసే
పాలిటిక్స్‌ను
బడితతో సత్కరిస్తూ...
ఫ్యాక్షన్ వేళ్లను తెగనరకడానికి
కొత్త ఆయుధం తయారు చేస్తా!
కర్షక కార్మిక కళ్యాణం కోసం
సూర్యునిలాంటి తత్వవేత్తను సృష్టిస్తా!!

## స్కామాయణం

**- జంకె కృష్ణారెడ్డి**



'రాజా'ధిరాజ రాజమార్తాండ
పేరు ప్రజలది, లాభం ఏలికలది!
లోటు బడ్జెట్ పాపం మాత్రం
సమస్త ప్రజాస్వామ్యానిది
జెండాలు, అజెండాలు వేరైనా
కనిపించని కామన్ అజెండా - స్కాం!
మొన్న లక్షలు, నిన్న కోట్లు
నేడు లక్షల కోట్లు
రేపటి స్కాములను లెక్కించడానికి
'ఐన్‌స్టీన్' మళ్ళీ పుట్టాల్సిందే!
నియంత్రణ సంస్థలెన్ని వున్నా
స్కామ్ లేని స్కీమే లేదు
ముడుపుల్లో నిండా మునిగిన
'స్కాంస్టర్స్'కిదే నా సందేశం
తిన్నదంతా స్వదేశీ బ్యాంకులలో
జమ చేయండి
కొంతైనా దేశభక్తిని చాటండి!!

## అంతర్మధనం!

**- వి. సూర్యారావు**



మహాత్మా
శాంతి అంటే నేడు
అదో భ్రాంతి
ఇల్లు విడిచిన వాడు
ఇల్లు చేరటమే
పెద్ద క్రాంతి-

సత్యం అంటే నేడు
అదో చిక్కు ముడి
అసత్యం ఇపుడు
అంతటా తెరిచున్న
మొసలి నోరు ఒడి

మహాత్మా!
అభివృద్ధి అంటే నేడు
ప్రజల గోల

గోవిందం
ముడుపులు మాత్రం ఎపుడూ
హుండీల్లో..

వెలుతురు అంటే నేడు
చీకటి సంపాదన
ఆ తవ్వకాల్లో
ఎడతెరిపి లేకుండా
కురిసిన గుప్తనిధులు-

మహాత్మా!
దేశం అంటే నేడు
శ్రమజీవులు చిందించిన
స్వేదం, నెత్తురు.
అది ఆ రాజకీయ దుర్గంధంలో
దోపిడీలో
స్విస్ బ్యాంకులో
మూల్గుతున్న
కరెన్సీ కట్టలే ఇపుడు
ఈ ప్రజాస్వామ్యం
ఈ ప్రజాసేవా
అంతా ఒట్టి భ్రమ
మా నినాదాలు ఆర్తనాదాలు
మావి..
వారి దుర్నీతులు
కుయుక్తులు వారివి

## సాక్షి

**- నల్లా త్రినాధ దుర్గా శ్రీనివాస్**



దీపం
చిన్నదైనా...
చీకటిని చీల్చినట్లు
అక్షరం
అనంతంగా ప్రవహిస్తోంది!
చరిత్రకు సాక్షీభూతంగా!!
రేపటి
నా రక్తానికి...
అరుణోదయంగా!!

## సంకెళ్లు తెంచి!!

**- పురిజాల సుధాకర్**

హృదయం కోర్కెల పంజరంలో
ఉదయం హృదయం గుప్పెటలో
రక్తనాళాలలోని రుధిరం
సముద్ర కెరటాల పరవళ్లతో
సంఘం చేసే కట్టుబాట్ల
వలయాలు
ఉదయాన్ని బంధించే సంకెళ్లు!

ఆ సంకెళ్ళు -
ఆ వలయాలు -
త్రెంచుకొని ప్రకాశించిన ఉదయం



హృదయానికి ప్రతిన్యాయం!
ఆకాశం విచిత్రమైనది!
నిశీధిని కౌగలించుకుంటుంది!
ఉదయాన్ని ఆహ్వానించుతుంటుంది!
పిడికెడు శూన్యం కూడా అనంతం!
బంధించుతున్న ప్రకృతిసైతం
ప్రగతిపథం వైపు మళ్లుతుంది!



# ఎండమావి వంటి నగదు బదలాయింపులు

- జయతిఘోష్

నగదు బదలాయింపు పథకాల ఉద్దేశమేమంటే, పేదలకు డబ్బు ఇచ్చి దానితో ఏమైనా చేసుకునే స్వేచ్ఛను కల్పించటం. ఇకపోతే ఈ నగదు బదలాయింపు ఎవరికి చెందుతుంది? ఎంత మొత్తాన్ని పొందుతారు? ఒకవేళ అందరికీ ఈ బదలాయింపు వర్తిస్తుందంటే, అప్పుడు పరిసరాల్లో డబ్బు పుష్కలంగా ఉంటుంది. అలాకాక, ఎంపిక చేసినవారికే ఇచ్చేటట్లయితే ఎప్పుడూ ఉండే సమస్యలు తలెత్తుతాయి. అంటే అర్హులైన వారిని అన్యాయంగా తొలగించడం, అనర్హులకు ఇవ్వటం, పెద్ద ఎత్తున జరిగే పాలనా వ్యయం వగైరాలు వుంటాయి.

అంతర్జాతీయ అభివృద్ధి కార్యక్రమాల్లోనూ, పేదరికం తగ్గింపు వ్యూహంలోనూ ఇటీవలి కాలంలో నగదు బదలాయింపులు వేలం వెర్రిగా మారాయి. ప్రస్తుతం భారతదేశంలోని విధాన నిర్ణేతలు దీన్ని అనుకరించడంలో తలమునకలయ్యారు. ప్రభుత్వ ఆర్థిక సర్వే 2010-11 ఇందుకు సంబంధించిన ఆలోచనలను ముందుకు తెచ్చింది. వస్తువులపై ఇచ్చే కొన్ని సబ్సిడీల స్థానంలో నగదు బదలాయింపులను చేర్చాలంటూ తన బడ్జెట్ ప్రసంగంలో ఆర్థిక మంత్రి స్పష్టంగా చెప్పారు. అసలు ఈ వ్యూహం ఏమిటి? ఇటీవలి అంతర్జాతీయ అనుభవాన్ని బట్టి నగదు బదలాయింపు అనేది షరతులతో కూడినది (నిర్దిష్టమైన డిమాండ్లను నెరవేర్చుకునేందుకై కుటుంబాలకు ఇచ్చేది) లేదా షరతులు లేనిది. ఎంపిక చేసిన వారికి (నిర్దిష్టమైన ప్రమాణాలను కలిగిన కుటుంబాలకు లేదా వ్యక్తులకు) లేదా సార్వత్రికంగా వర్తించేది. వస్తువులను, సేవలను అందజేయడానికి బదులు ప్రజలకు ప్రభుత్వం నగదును బదలాయిస్తుంది.

నగదు బదలాయింపు చాలా సులువైనది. పసిపిల్లలకు సైతం అర్థమయ్యేదిగా వుందని జోరుగా ప్రచారం జరుగుతోంది. అసలు ప్రజలు పేదలుగా ఎందుకున్నారు? ఎందుకంటే వారి దగ్గర డబ్బు లేదు. కాబట్టి వారికి డబ్బు ఇద్దాము. అలా చేస్తే వారింకెంత మాత్రం పేదలుగా ఉండరు! నగదు బదలాయింపు ప్రతిపాదకులు ఇదేదో విప్లవాత్మకమైన సరికొత్త భావనగా చెబుతున్నారు. నిజానికి దీనికి చాలా చరిత్రే ఉన్నది. పేదలకు చెల్లింపులు చేసేందుకు వీలుగా ధనికుల నుంచి శిస్తుల రూపంలో వసూళ్ళు చేయాలని కౌటిల్యుని అర్థ శాస్త్రం చెబుతున్నది. విపత్తుల సమయంలో ధన సహాయాన్ని అందించడమే కాదు. తనను తాను పోషించుకోలేని పేదలకు కూడా సహాయం చేయాలని కౌటిల్యుడు చెప్తాడు. మధ్యయుగాల్లో ముస్లిం పాలకులు జకత్ పద్ధతిని ప్రవేశపెట్టారు. పేదలకు, వృద్ధులకు, అనాథలకూ, వితంతువులకూ, వికలాంగులకూ రాజ్య ధనాగారం నుంచి సహాయం లభించేది. ఇంకా ఇటువంటివే చారిత్రికాధారాలు కావలసినన్ని ఉన్నాయి.

నగదు బదలాయింపు పథకాల ఉద్దేశమేమంటే, పేదలకు డబ్బు ఇచ్చి దానితో ఏమైనా చేసుకునే స్వేచ్ఛను కల్పించడం. ఇకపోతే ఈ నగదు బదలాయింపు ఎవరికి చెందుతుంది? ఎంత మొత్తాన్ని పొందుతారు? ఒకవేళ అందరికీ ఈ బదలాయింపు వర్తిస్తుందంటే, అప్పుడు పరిసరాల్లో డబ్బు పుష్కలంగా ఉంటుంది. అలాకాక, ఎంపిక చేసినవారికే ఇచ్చేటట్లయితే ఎప్పుడూ ఉండే సమస్యలు తలెత్తుతాయి. అంటే అర్హులైన వారిని అన్యాయంగా తొలగించడం, అనర్హులకు ఇవ్వటం, పెద్దయెత్తున జరిగే పాలనా వ్యయం వగైరాలు ఉంటాయి. ఈ బదలాయింపులను సమర్థంగా నిర్వహించగలమన్న కచ్చితమైన హామీ ఉన్నట్లయితే వీటిని బదలాయించడం సాపేక్షకంగా తేలికగా ఉంటుంది. ఈ నగదు బదలాయింపులు కుటుంబ ఆదాయాలను ప్రభావితం చేస్తాయి. దీనితో ప్రజా వ్యయం పెరుగుతుంది. ఇది ఏ రకమైన వ్యయమనేది ఇక్కడ ఎదురయ్యే ప్రశ్న.

మనకు బాగా తెలిసిన పలు విజయగాథలు ఎంపిక చేసిన వారికి వర్తించేవి, షరతులతో కూడినవి. బ్రెజిల్‌లో బోల్సా ఫామిలియా పథకం అమలులో ఉన్నది. ఇక్కడి ప్రభుత్వం ఇచ్చే నగదు నెల ఆదాయం కన్నా తక్కువగా వుంటుంది. ప్రభుత్వ ఆరోగ్య కేంద్రాల మీద ఆధారపడినవారై ఉండాలి. అలానే పాఠశాల హాజరు 85 శాతంగా ఉండాలి. మెక్సికోలో ఒపోర్టునిడాడిస్ అనే నగదు బదలాయింపు పథకం అమలులో వున్నది. ఇది చాలా షరతులతో కూడుకున్న క్లిష్టమైన పథకం. వయసు, లింగం, కుటుంబంలోని ప్రతి సభ్యుని విద్యా స్థాయి, విద్యుత్, కొళాయి సౌకర్యాలు, కుటుంబ ఆస్తులు వగైరాలు చూస్తారు. కుటుంబ సభ్యులు ముఖ్యంగా తల్లులు సమావేశాలకు హాజరవుతూ, 'స్వచ్ఛంద' సామాజిక శ్రమలో పాల్గొనాలి.

పురోభివృద్ధి స్వభావం కలిగిన పునఃపంపిణీ బదలాయింపులు వాంఛనీయమనటంలో సందేహం లేదు. నిజానికి పునఃపంపిణీ అనేది ఏ ఆర్థిక వ్యవస్థలోనైనా విస్తృతమైనదీ, సంక్లిష్టమైనదీ అని చెప్పవచ్చు. పేదలకు కనీస ఆదాయాన్ని ఒనగూర్చే పథకాలు, వయో వృద్ధులకు పింఛన్లు, బాలబాలికలకు ప్రయోజనాన్ని చేకూర్చే కార్యక్రమాలు, నిరుద్యోగ భృతి ఇతర సామాజిక భద్రతా పథకాలు వంటివి ఏ నాగరిక సమాజంలోనైనా కోరుకోదగినవే. పేద దేశాలు కూడా అనుసరించదగినవే. స్వల్పకాలంలో ఇవి సానుకూల ఫలితాలను ఇస్తాయి. దీర్ఘకాలంలో ఆరోగ్యకరమైన, విద్యాధిక, సురక్షిత జనాభా తయారవుతుంది.

కనుక, ఇక్కడ ఎదురయ్యే ప్రశ్న ఏమంటే, మొత్తం మీద నగదు బదలాయింపు పథకాన్ని వ్యతిరేకించటమా లేదా అన్నది కాదు. మొత్తం అభివృద్ధి వ్యూహంలో, పేదరికం తగ్గింపులో వాటికున్న నిర్దిష్ట ప్రాధాన్యత ఏమిటన్నదే. నగదు బదలాయింపులనేవి నిత్యావసర సరకుల, సేవల స్థానాన్ని భర్తీ చేయలేవు. కాకుంటే వాటికి సహాయకారిగా ఉంటాయి. కాని ఈ బదలాయింపులనేవి ప్రభుత్వం అందించవలసిన సేవలను తగ్గిస్తాయని, డబ్బును బదలాయించడం ప్రభుత్వానికి సులభమని చెప్పుకొస్తున్నారు. పేదలకు ప్రభుత్వం నగదు బదలాయింపు చేసినట్లయితే, ప్రభుత్వం ఇచ్చేవాటి కోసం చూడకుండా ప్రైవేట్ మార్కెట్ల ఉత్పత్తుల్లో తాము కోరుకున్న వస్తువులు, సేవలు వారికి అందుబాటులోకి వస్తాయన్న వాదన పలు దేశాలలో వినపడుతున్నది. ఈ తరహా వాదనలో ఒక అంశం మరుగున పడుతున్నది. ఉదాహరణకు బ్రెజిల్‌లో అమలవుతున్నా బోల్సా ఫామిలియా పథకం పిల్లల పాఠశాల కనీస హాజరుపై ఆధారపడి ఉన్నది. దీనికి కారణం పేద కుటుంబాల పిల్లలు హాజరు కావడానికి వీలైన నాణ్యత కలిగిన ప్రభుత్వ పాఠశాలలు ఇక్కడ తగినంత సంఖ్యలో ఉండటమే. అంటే నాణ్యమైన పాఠశాలల పైనా, ఉపాధ్యాయ విద్య పైనా ప్రభుత్వ పెట్టుబడులు కొనసాగుతున్నాయన్న మాట. ప్రజలకు అందజేసే కొద్దిపాటి మొత్తాలు స్థానికంగా ఉండే సాధారణ వైద్యులను సంప్రదించడానికి పనికొస్తాయే గాని అన్ని సౌకర్యాలున్న ప్రైవేట్ ఆసుపత్రులకు వెళ్ళేందుకు ఉపయోగపడవు. నిత్యావసర సరకుల ధరలు పెరుగుతున్న సమయంలో నగదు బదలాయింపు వల్ల పెద్దగా ఫలితముండదు.

పలు వర్ధమాన దేశాలలో కేవలం నాణ్యమైన విద్యను అందించే పాఠశాలలనే కాక ఇంకా అనేకమైన వాటికి ప్రాధాన్యత ఇస్తున్నారు. బడికి పిల్లలను పంపిన తల్లిదండ్రులకు ప్రోత్సాహకాలు ఇస్తున్నారు. రహదారులు, ఆరోగ్య కేంద్రాలు, విద్యుత్, కొళాయి నీరు, పాఠశాలలు, విమానాశ్రయం లేదా పలు రైల్వే స్టేషన్లు వంటి మౌలిక వసతుల గురించి పట్టించుకోవడం లేదు. ఆహారంతో సహా వివిధ రకాల వాటిని పంపిణీ చేయడానికి బదులు నగదు బదలాయింపు పథకాన్ని తీసుకు రావాలన్నదే యుపిఎ ప్రభుత్వ ఎజెండా అన్నది స్పష్టమవుతున్నది. కిరోసిన్, ఎరువులకు సబ్సిడీలను ఎత్తివేసి వాటి స్థానంలో ఎంపిక చేసిన లబ్ధిదారులకు నేరుగా నగదు బదలాయించే పద్ధతిని ప్రవేశపెట్టాలని ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ ప్రతిపాదించాడు. ఆయన తన ప్రసంగంలో ఈ విధంగా చెప్పాడు. "మరీ ముఖ్యంగా ఇంధనం, ఆహార ధాన్యాలపై ప్రభుత్వం సబ్సిడీలను అందజేస్తున్నది. ముఖ్యమైన ఈ అవసరాలు సాధారణ ప్రజలకు అందుబాటు ధరలలో లభించేలా చేయడమే ప్రభుత్వ ఉద్దేశం. అయితే ఇంధనంపై ఇచ్చే సబ్సిడీలో అధిక భాగం నిజమైన లబ్ధిదారులకు అందడం లేదు. సబ్సిడీపై కిరోసిన్‌లో అత్యధిక భాగం దారిమళ్ళుతున్నది... కిరోసిన్, ఎరువుల సబ్సిడీలు ఖచ్చితంగా ఉపయోగపడేలా చూసేందుకు దారిద్ర్య రేఖకు దిగువన వున్న వారికి దశల వారీగా నగదు బదలాయింపు పథకాన్ని వర్తింపు చేస్తాము" అని ఆయన చెప్పారు. ఈ వైఖరి వల్ల తక్షణమే ఎదురయ్యే రెండు సమస్యలున్నాయి. ఒకటి : కొత్తగా నియంత్రణలు ఎత్తివేయనున్న నిత్యావసర వస్తువుల మార్కెట్లలో పెరిగే ధరలకు అనుగుణంగా ఈ నగదు పంపిణీ పథకం ఉంటుందా? రెండవదేమంటే కిరోసిన్, ఎరువులను సబ్సిడీపై పొందే లబ్ధిదారులకే నగదు అందుతుందని ప్రభుత్వం ఎలా చెప్పగలదు? ఈ రెండవ సమస్య భారతదేశంలో అందరికీ తెలిసిందే. ప్రజా పంపిణీ వ్యవస్థ విధానంలో దారిమళ్ళడం సాధారణంగా జరుగుతున్నది. వస్తువులను దారి మళ్ళించి వాటిని నిల్వ చేయడం లేదా అమ్మటం కన్నా నగదును దారి మళ్ళించడం ఎంత సులభం?

సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకుంటే నగదు పంపిణీలో తలెత్తే సమస్యలను తొలగించవచ్చునని ప్రభుత్వం భావిస్తున్నది. అయితే పేదలెవరు? నగదు అందుకోవలసిన రైతులెవరు? అన్న విషయాలను సాంకేతిక విజ్ఞానంతో కాక సామాజిక, రాజకీయ అంశాలతో నిర్ణయించాల్సి వుంటుంది. మార్కెట్లపై నియంత్రణలను ఎత్తివేస్తే అవి అందుబాటులో ఉంటాయన్న నమ్మకం లేదు. నిత్యావసర సరుకుల పంపిణీ కన్నా నగదు బదలాయింపు పథకం ఏమాత్రం మెరుగైనది కాదు.

## నానీలు

**- కందిపాటి గోపాలరావు**



ఆస్తిపంపకాలు
పూర్తయ్యాయి
అప్పులాగ
అమ్మ మిగిలింది

మారణహోమం
బెల్టు బాంబుతోనే కాదు
బెల్టుషాపుతోనూ
సాధ్యమే

గాయానికి
గేయానికి కులంలేదు
విషాదమందుకే
మా "విషాద"మైంది

చెట్టుకీ
పుట్టకేకాదు
మనిషికూడా
మట్టే ఊయలతొట్టి

ఐదేళ్ళకోసె
'పోలింగ్' చుక్కలు
ప్రజాస్వామ్యానికి
'పోలియో' రాకుండా

స్వలింగసంపర్కం
తప్పుకాదట
అర్ధనారీశ్వరుడు
వ్యర్థనారీశ్వరుడే




# ఒక స్వప్న చేలాంచల కవిత్వం

- కుమారస్వామి

ఆకుపచ్చని కలల్ని, సోయగాలు పలికే నవయవ్వన కవితాలతల్ని, జ్ఞాపకాల తుఫానుల్ని, పల్లె సొబగులు దర్శించాలంటే కొన్ని రంగుల పద్యాన్ని చదవాల్సిందే.

కవికీ సమాజానికీ జరిగే అంతర్ బహిర్ యుద్ధారావమే కవిత్వమన్నాడు చలం. దాన్ని వెంకటకృష్ణ తన 'కవన'లో ఇలా చెపుతాడు. లోపలి మెలిక/ బాహ్యంగా సాగుతుంది/ బయట విస్ఫోటనం/ లోపల లావాలా మెలికలు తిరుగుతుంది.

'కవిత్వం జవజవలాడాలి. జలజలా ప్రవహించే ఉత్తేజమై ముందుకు రావాలి. భావం పాతదైనా తనదైన శిల్పంతో కొత్త ముద్రలు వేయాలి. కవిత్వం కావాలి కవిత్వం. అక్షరం నిండా జలజల లాడిపోయే కవిత్వం కావాలి, కవిత్వం....' అంటూ త్రిపురనేని శ్రీనివాస్ ఒక హెచ్చరిక చేస్తాడు. అందుకేనేమో వెంకటకృష్ణ "మనుషుల్ని చిగురించే కాలం కోసం" కవితలు మట్టిలో కలసిన/ ప్రతి ప్రతిఘటనా/ ఒక చెట్టై/ మట్టి మిగిలిన/ ప్రతి చోటా మొలకెత్తి/ అలా చివరి మనుషుల్ని చిగురిస్తుంది." అంటూ మనుషులు పోరాటాల్లో ప్రభవిస్తారని చెపుతున్నాడు.

కవి కవిత్వాన్ని ఎలా ఆవిష్కరిస్తాడో 'కవి - తీవ్ర ధ్వని'/ కొన్ని రంగులూ - ఒక పద్యం/ కవన/ కవిత్వం' కవితల్లో వెంకటకృష్ణ సరికొత్తగా మనకు సాక్షాత్కారం చేస్తాడు.

ఒకడుగు వేసి/బాటలు నేర్పడం' కవిత్వమంటాడు. 'కలిపినది కుంచైనా/ కలిసినది హృదయ గతమై/ అవగతమవ్వాలి/ రంగులో గాఢత పాలో/ ప్రతీకతో సరిపోలిక ఏ స్థాయో/ అంచనా కావాలి' అంటూ కవిత్వం ఎలా ఉండాలో చెపుతాడు. నీటి గుసగుసలన్నీ/ ప్రతిధ్వనించే/ తుఫాను స్వరంలా/.... /వెదురు వనంలో/ వేణు స్వరంలా మారిన చిరుగాలిలా/ లోగొంతుకన/ తీవ్రధ్వనిని/ నిక్షేపిస్తాడు కవి' అంటూ కవి ఏ విధంగా ధ్వనిస్తాడో చెపుతాడు.

కవిత్వం సమాజానికి దర్పణంగా నిలుస్తుంది. సమాజంలో జరిగే సంతోషాలను, దుఃఖాలను కవి తన కవిత్వంలో ఇముడ్చుకుంటాడు. చిత్రకారునిలా కాక సమాజ చోదక శక్తిగా మారతాడు. సమాజం ఎలా ఉండాలో శాసనం చేసే అనధికార శాసనకర్తలుగా షెల్లీ ఏనాడో పేర్కొన్నాడు. వెంకటకృష్ణ కూడా ఇందుకు మినహాయింపు కాదు. సమాజంలో ప్రస్తుతం జరుగుతున్న హిందూ, ముస్లిం మతోన్మాదాన్ని, ప్రేమోన్మాదాన్ని, ఉగ్రవాదాన్ని తన కవిత్వంలో వ్యక్తీకరించకుండా ఆగలేకపోయాడు.

'ఆపరేషన్ గుర్రపుడెక్క' కవితలో ప్రేమోన్మాదుల చర్యల్ని నిరసిస్తాడు- 'అభద్రతా అలలు రేపుతూ/ కన్నెకలల కాసారంలో / కల్లోల అలజడి రేపుతూ/ ప్రేమ వేధింపులు గుర్రపు డెక్క' అంటాడు.

గుజరాత్‌లో తీరందాటిన/ కారు కాషాయమేఘం/ ఒరిస్సాలో మోహరించింది./ దక్షిణాదిన దాపురించుకున్న దారుణాలకు/ ముందస్తు సూచనలా/ కమలం వికసిస్తున్నది/ హిందూ తీవ్రవాదం మోడీ ఆధ్వర్యంలో గుజరాత్ గాయమైంది. అది ఒరిస్సాలో క్రిస్టియన్ మైనార్టీలపై దాడి చేసింది. ఆంధ్రావనిలో మదనపల్లెలో కూడా అది తన విశ్వరూపాన్ని చూపింది.

హిందూత్వవాదుల కాషాయ ఉగ్రవాదం దక్షిణాదిన ముఖ్యంగా కేరళలో పొంచుకొని ఉంది.

'నేనూ నువ్వు - ఒక ఆకు పచ్చని సర్పం' కవితలో ముస్లిం ఉగ్రవాదం చేస్తున్న విధ్వంసంపై తన వ్యతిరేకతను ఇలా వ్యక్తీకరిస్తాడు. ఇవే చరణాలు విప్లవం పేరుతో అరాచకాలు సాగించే విప్లవపార్టీలకూ వర్తిస్తాయి.

'రాజ్యం మీది ప్రతీకారంతో/ సామరస్యాన్ని పిపీలికం చేసి కబళిస్తూ/ జనం మీద విద్వేషం కక్కుతుంటే/ యీ స్వరాన్ని ఎలా క్షమించను?'

విప్లవం పేరుతో అమాయకులను వధిస్తూ ప్రజలను మరచి మందుపాతరాలతో విప్లవం వస్తుందని విప్లవనినాదాలు వల్లించే విప్లవ పార్టీలపై భ్రమలన్నీ తొలగిన విప్లవ ప్రేమికులకు తన కవిత వినిపిస్తాడు-

'ఏ ఫలితాలు/ ఎవ్వరి అనుభవాలో/ తేల్చేదినం/ ఎప్పటికీ రాదని/ ఎరుక అవుతున్న కొద్దీ/ ఆచరణలు వాస్తవం/ ఆమడదూరం నిలుస్తున్న వైనం/ చూసి గుండె దిటవు చేసుకుంటున్నారు.'

వెంకట కృష్ణ తన తడారని జ్ఞాపకాలను తుఫాను హోరులాంటి ఆలోచనలను ఒడిసిపట్టుకోవడానికి కవిత్వాన్ని ఆలంబన చేసుకున్నాడు. ఒక నోస్టాలిజియాలోకి వెళ్ళిపోతాడు. ఒక్కోసారి ధ్యానముద్రలోకి వెళ్ళి కొన్ని అదృశ్యమైన దృశ్యాలను కవితా యవనికపై అక్షరాల కుంచెతో చిత్రీకరిస్తాడు. అందుకు ఆయన తీవ్రంగా తపనపడతాడు ఇలా.....

'లోనిది వెలుపలికి రూపు కట్టడానికి/ బయటిది లోపల జీర్ణం చేసుకోవడానికి/ ఎడతెగని అవస్థలా మొదలు పెడతాను' అంటాడు. అలాగే శ్రమజీవుల కోసం చిరుగాలి పాటతో గళమెత్తి పాడుదాం రమ్మని అందరిని ఆహ్వానిస్తాడు.....

'కలుపు తీస్తున్న ఆ తల్లుల చేతుల్లో/ వున్నది సంగీత పరికరాలే/ లయబద్ధంగా/ భూమిని సారం చేస్తున్న యత్నాలే/ చెమట చుక్కను జీవన వేర్లకు/ ప్రాణపాటగా అందిస్తున్న సందర్భాలే/ వాళ్ళకోసం/ చిరుగాలిలా మారుదాం రా!' అంటాడు.

శిల్పరాహిత్యం నేటి కవులకు ఫ్యాషనైంది అనే విమర్శకులకు చక్కని సమాధానమిస్తుంది ఈ కవిత్వం. అభ్యుదయాన్ని భావుకతను కలిపి కవిత్వాన్ని ఆవిష్కరించాడు వెంకటకృష్ణ. శిల్ప సౌందర్యంతో భావుకతతో అభ్యుదయాన్ని వర్తమాన దృశ్యాన్ని పల్లె పదసోయగంతో మనముందు ఆవిష్కరించిన కొన్ని రంగులు ఒక పద్యం' కవిత్వాన్ని మనమందరం చదువుకోవాలి.

# మరుగున పడిన మానవత్వాన్ని తట్టిలేపే కథలు



- దుప్పల రవికుమార్

మంచి సాహిత్యం అధ్యయనం చేయడం ద్వారా జీవిత చలనసూత్రాలు పాఠకుడికి అర్థమవుతాయనుకుంటే, మరి సాహితీ సృజన ద్వారా రచయితలకు ఒనగూడే మేలేమిటన్నది జవాబు కనుక్కోవాల్సిన ప్రశ్న. కథలు చదవడం ద్వారా జీవితంలో మనకెదురయ్యే కొన్ని సంఘటనలను, కొందరు మనుషులను ఎలా ఎదుర్కోవాలో తెలుసుకోవడానికి పనికొస్తుందని భావిస్తే, మరి కథలు రాయడం ద్వారా కథకులకు మరెన్ని ప్రయోజనాలుంటాయో వారినే అడిగి తెలుసుకోవడం సబబు. కథకులు తమకున్న అవగాహన మేరకు జీవిత సంఘటనల శకలాలను కథలుగా రాసి పత్రికలకు పంపించినప్పుడు వారి వారి అభిప్రాయాభిరుచులకు అనుగుణంగా కథలను ఎంపికచేసి పత్రికాధిపతులు ప్రచురిస్తారు. ఆ పత్రికలు, ఆ పత్రికల ద్వారా వెలువడే సాహిత్యం కేవలం ఆ అభిప్రాయాలను పంచుకుని, పెంచుకునే పాఠక వర్గానికే చేరతాయన్నది బహిరంగ రహస్యం. కాబట్టి విమర్శకులకు కథా పఠనంతో పాటు కథా రచనతో ఒనగూడే ప్రయోజనాలను పాఠకులకు వివరించాల్సిన బాధ్యత వుంది.

ఇంతకుముందు తన 22 కథల సంపుటి 'ఆమె నవ్వు'తో తెలుగు కథాప్రియులను ఆలోచింపజేసిన యాళ్ళ అచ్యుతరామయ్య యిప్పుడు తన తాజా పదిహేను కథల సంపుటి 'పంజరంలో స్వేచ్ఛ'తో మన ముందుకొచ్చారు. ఈ కథలన్నీ ఒక వరుసలో చదివిన తర్వాత పాఠకుడి హృదయం బరువెక్కుతుంది. మేధ పదునెక్కుతుంది. మానవ జీవితంలోని నిస్సహాయత పట్ల విసుగొస్తుంది. అంతలోనే మూర్తీభవించిన మానవీయత మనసులో కొత్త సంతోషం నింపుతుంది. దీనికి కారణం సప్తవర్ణ శోభిత జీవితాన్ని కథా రచయిత తన కథల్లో యథాతథంగా చిత్రించడమే. తన కథల్లోకి వెళ్ళే ముందర రచయిత పాఠకుడిని ఒక్కమారు ఆపి ఈ విధంగా ఆత్మీయ పలకరింపుతో స్వాగతిస్తారు. "జీవితం ఓ కెలైడోస్కోప్. పరికరం ఒకటే అయినా ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా అందులో దృశ్యాలు గోచరించినట్టుగానే – దృష్టి కోణం బట్టి మానవ జీవితం కూడా అనేక రకాలుగా దర్శనం ఇస్తూ వుంటుంది. బహుముఖాలుగా కనిపించే ఈ జీవితాన్ని – వీలైనంత సమగ్రంగా దర్శించాలంటే ఒకరి అనుభవాలను మరొకరితో పంచుకోవడం ఒకటే దారి. ఆ అనుభవాలను సృజనాత్మకత జోడించి మనసుకు హత్తుకునేటట్లు చెప్పగలిగితే – అవి కళారూపాలుగా నాలుగు కాలాల పాటు నిలబడతాయి. నేను కథలు చదివినా, రాసినా ఆ ఉద్దేశంతోనే. సమాజం నుండి నేర్చుకున్నదాన్ని, సాహిత్య రూపంతో తిరిగి అందివ్వడమంటే – ఓ సామూహిక ఆలింగనమే!" అన్న మాటలతో రచయిత అంతరంగం బట్టబయలవుతుంది. రచయిత సాహిత్యం ద్వారా సమాజాన్ని, సమాజం ద్వారా సాహిత్యాన్ని ఆదాన ప్రదానాలకు మొగ్గు చూపుతుండటం రచయిత దృక్పథాన్ని తెలియజేస్తుంది.

ఆల్విన్ కంపెనీ మూతపడి మూర్తికి ఉద్యోగం పోవడంతో డీలా పడిపోయిన వైనంతో మొదలైన కథ బతుక్కి అర్థంతో ఈ కథా సంపుటి మొదలవుతుంది. నిరాశావాదంతో ప్రారంభమైన ఈ కథ ఎంతో ఆశావహ దృక్పథంతో ముగుస్తుంది. ట్రేడ్ యూనియన్‌లో పనిచేస్తున్న కృష్ణారావు ఇచ్చిన చైతన్యం వల్ల మూర్తితో పాటు వృద్ధురాలైన అతడి తల్లి కూడా ఉద్యమంలో పాల్గొంటుంది. ఒకవైపు ప్రపంచీకరణ చేస్తున్న దుష్పరిణామాలను కథలో వివరిస్తూనే పురాణ గాథను కూడా కథలో చొప్పించడం ద్వారా ఈ కథ మరింత ప్రయోజనం సాధించిందనే చెప్పాలి. ఏకచక్రపురం ప్రజలను రోజుకొకరు చొప్పున బలి తీసుకుంటున్న బకాసురుడు తన విధ్వంసకాండను మరిన్ని గ్రామాలకు విస్తరింపజేయడానికి వీలుగా నిర్మించిన పథకం ప్రస్తుతం మన జీవితాల్లో నిత్యం చూస్తున్నదే. ప్రపంచ బ్యాంకు కనుసన్నల్లో పనిచేస్తున్న ప్రభుత్వాలు ప్రస్తుతం ఏం చేస్తున్నాయో వాటినే పురాణ ప్రతీకల ద్వారా రచయిత చెప్పడం విషయం పాఠకుల్లో సూటిగా నాటుకోవడానికే. మన చుట్టూ జరుగుతున్న విషయాలను విశ్లేషించడానికి సోషలిస్టు దృక్పథం ఉండాలని ఎవరైనా ఒప్పుకుని తీరతారు గాని, మన తెలుగు మేధావులు ఆ పని చేయడానికి పూనుకొన్నప్పుడు మరీ థీరిటికల్‌గా మాట్లాడతారు. అలాంటి లోటును అచ్యుతరామయ్య కథలు తీరుస్తాయని చెప్పడానికి మంచి ఉదాహరణ ఈ కథ.

ఈ కథలన్నీ చదువుతున్నప్పుడు మన మనసుల్లో ఎక్కడో దాగి వున్న మానవీయతను తట్టిలేపి మనుషులుగా మన కర్తవ్యాన్ని కుదిపి ప్రబోధిస్తాయి. బతుకు మొదలయిందే ఇప్పుడు కథలో కొడుకు కోడళ్ళ నిర్లక్ష్యపు నీడలో బతుకుతున్న తులసమ్మ చిరకాల కోరిక తిరుపతి వెళ్ళి స్వామిని దర్శించుకోవడం. కానీ ఆ సమయంలోనే ఆమె తప్పిపోయి పూలమ్ముకునే అరుణ చెంతకు చేరుతుంది. జీవితంలో

మోసపోయిన అరుణ కుంగిపోకుండా జీవితంతో పోరాడుతుంటుంది. తనను వదిలించుకున్న కుటుంబ సభ్యులను విడిచిపెట్టిన తులసమ్మ తిరుపతిలోనే కొత్త బతుకు మొదలుపెట్టడానికి సిద్ధమవుతుంది. పరీక్షలు పోయాయని, ఉద్యోగం పోయిందని, తనను ప్రేమించడం లేదని, భర్త లేదా భార్య మాట వినలేదని ఆత్మహత్యలు చేసుకునే పిరికి మనస్తత్వం వున్నవారికి ఈ కథ జీవితపు కొత్త వెలుగులను దర్శింపచేస్తుంది. ఆర్థిక భారమనుకుని కన్నవారినే వదిలించుకోవాలనే ఆలోచనలు బిడ్డలకు రావడం బహుశా ఈ యుగలక్షణం కావచ్చు. కానీ ఈ ఆలోచనల వెనుకనున్న ఆర్థిక పార్శ్వాన్ని రచయిత విస్మరించకుండానే మానవీయ అంశాన్ని మన మనసుకు హత్తుకునేటట్లు చెప్తారు. ఇటువంటిదే మరో కథ ఆమె ప్రపంచం. ఉద్యోగంతో నగరానికి చేరుకున్న మధు పల్లెలో తన తల్లికి పిచ్చిపట్టిందని తెలుసుకుంటాడు. బాధపడతాడే గాని, తల్లిని తన దగ్గరకు తీసుకొచ్చి మంచి వైద్యం అందివ్వడానికి సందేహిస్తాడు. ఇంతలో తన ఆఫీసులోనే అటెండరు ఏసుపాదంలోని మానవీయ కోణం తెలుసుకున్నాక తన తల్లి దగ్గరకు బయల్దేరతాడు. అసలు మనకు నేరుగా పరిచయం కాని ఏసుపాదం విశ్వరూపం మధుకు కనిపించడం వల్లనే అతడిలో మార్పు సాధ్యమైంది. అన్నా వదినల నుంచి తన తల్లిని దొంగిలించి తన ఇంటికి తెచ్చుకుంటాడు. తల్లి ఇంటికి రాగానే మధు భార్య కాస్త డ్రమెటిక్‌గా అత్తగారిని అక్కున చేర్చుకున్నట్టు కనిపిస్తుంది. నిజానికి అప్పటికే మధు చేరుకున్న మానసికావస్థలో భార్య వద్దన్నా ఆమెను గట్టిగా మందలించేవాడే గాని, తల్లిని విడిచిపెట్టేవాడు కాదు. ఆ విధంగా కథను చాలా ఎమోషనల్‌గా రచయిత నడిపించారు.

ఈ కథాసంపుటికి శీర్షికగా వుంచిన 'పంజరంలో స్వేచ్ఛ' కథ కథనపరంగా, వస్తుపరంగా ఉన్నతమైనది. మాయమాటలు చెప్పి పెళ్ళయిన పార్వతిని ఆటో డ్రైవర్ రమేష్ మోసం చేస్తాడు. నాటుసారా అమ్మే నాగమణి ఆమెను కాపాడి ఆశ్రయమిస్తుంది. తర్జన భర్జనలు పడి, పార్వతిని ఆమె భర్త రమణ దగ్గరికే చేర్చాలని నిర్ణయించి పంచాయతీ పెట్టిస్తారు. రమణకు నచ్చచెప్పి, బుద్ధి చెప్పి పార్వతి కాపురం సరిదిద్దుతారు. అక్కడితే ఆగితే ఇది మామూలు కథే అయి వుండేది. కాని మంచి కథ ఎందుకయిందంటే కథలో మరో ఉపకథ మనకు రచయిత పరిచయం చేస్తారు. పంజరంలో వున్న చిలుసు బయట స్వేచ్ఛా ప్రపంచంలోకి రమ్మని పిల్లి నచ్చచెప్తుంది. కాని, పంజరం బయటకొచ్చిన చిలుక తాను ఎగర(లే)కుండా రెక్కలపైన ఈకలు కత్తిరించారని తెలుసుకుంటుంది. ఇంతలో పిల్లి, కుక్క తనపై దాడికి దిగడంతో వెంటనే చిలుక పంజరలోకి పోయి తలుపు వేసుకుంటుంది. బయటకీ లోపలికీ సరిపోల్చుకుని పంజరంలో స్వేచ్ఛను మేలనుకుంటుంది అని చెప్పడం ద్వారా చిలుకలాంటి సగటు స్త్రీ నిస్సహాయతను మగజాతికి తెలియజేస్తారు.ఆ నిస్సహాయత స్త్రీలది కూడా కాకపోవడం పురుషాధిక్య సమాజంలోని వైరుధ్యానికి నిదర్శనంగా రచయిత చూపించారు. ఈ సిస్టమాటిక్ ట్రీట్‌మెంట్ ద్వారా ఈ కథ కొత్త ఎత్తులు ఎక్కింది.

ఒకరోజు పేపర్లో తాను తప్పిపోయినట్టు ప్రకటన చేసి ఖంగుతింటాడు సంజీవరావు. తీరా ఆ ప్రకటన ఇచ్చింది తన భార్యేనని తెలుసుకుని శివాలెత్తిపోతాడు. సంజీవ్‌లోని ఆదర్శభావాలను చూసి, ఎంతగానో ప్రేమించి పెళ్ళి చేసుకున్నానని, క్రమంగా మోరల్‌గా కరెప్టయి ఆదర్శాలు విడిచిపెట్టేసిన తన భర్త తనకు ఉన్నా లేనట్టేనని నిర్మల అతడిని తిరస్కరిస్తుంది. ఆఖరికి పోలీస్ ఇన్‌స్పెక్టర్ వచ్చినపుడు తన భర్త చనిపోయాడని నిర్మల ద్వారా చెప్పించడం ద్వారా మిస్సింగ్ కేస్ కథలో రచయిత పాఠకుడికి షాక్ ఇస్తారు. రచయితలో పదునెక్కిన స్త్రీవాద దృక్పథానికి ఉదాహరణగా నిలిచే కథ ఇది. తన తొలి కథా సంపుటి "ఆమె నవ్వు'లో కన్నా తీవ్రమైన భావావేశాలు, పదునైన ఆలోచనలు ప్రదర్శించిన మలి కథల పుస్తకంలో మౌనభాష, పుస్తకాల పురుగువంటి వ్యంగ్య కథలూ లేకపోలేదు. నగర జీవితంలోని హడావిడి నుంచి తన కుటుంబానికే కాక ఏకంగా అపార్ట్‌మెంట్ వాసులందరికీ మూర్తి ఇచ్చిన చిన్న ట్రీట్ - టెర్రెస్ మీద వెన్నెల్లో పిట్ట కతలు, నెయ్యి గోంగూర పచ్చడన్నమూ దొరుకుతాయి. లైన్‌మేన్‌కు డబ్బులిచ్చి తానే కరెంట్ తీయించి, అందరినీ మేడమీదకు చేరేలా చేసిన 'అమృతం కురిసిన రాత్రి' కథలో మూర్తిగారిని మెచ్చుకోకుండా ఉండలేం. చదువుతుంటే మన మనసులోనూ అమృతం కురిపిస్తుంది. కథల పుస్తకం పూర్తిచేసిన చాలా రోజుల వరకు మనల్ని వెంటాడే కథ అక్షయ పాత్ర. హైదరాబాద్ లోతట్టు ప్రాంతంలో నివసిస్తున్న రవీందర్ ఇంట్లోకి తీవ్ర వర్షాల వల్ల నీళ్ళు వచ్చేసి సామాన్లన్నీ మునిగిపోతాయి. కట్టుబట్టలతో బయటపడిన రవీందర్ కుటుంబాన్ని మానవీయ సుందరం ఆదుకుంటాడు. కథ చెప్పడానికి ఇంతే అయినప్పటికీ రచయిత ఎంతో నైపుణ్యంగా వరద బాధితుల కడగండ్లను తాను అనుభవించిన రీతిలో మనసు చెమ్మగిల్లేలా కథనం చేశారు. అక్షయపాత్ర నుంచి రచయిత మనకు మంచితనాన్ని మనసునిండా వడ్డిస్తారు.

కథలు చదవడం ద్వారా మనలోనూ మరుగునపడి వున్న మహత్తర మానవీయతను తట్టిలేపడమే ఈ కథలు చదవడం వల్ల కలిగే ప్రయోజనం. గతానికి వర్తమానానికి లంకెగా నిలిచే జ్ఞాపకాలను నిరంతరం కొనసాగించే ఏకైక ప్రక్రియ సాహిత్యం. ప్రస్తుతం ప్రపంచీకరణ తన కుట్రలతో అతి ప్రధానమైన కుట్రగా అపురూపమైన జ్ఞాపకాలను రద్దు చేయడానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నట్టు కెనడియన్ జర్నలిస్టు నావోమీ క్లీన్ తన "షాక్ డాక్ట్రిన్" పుస్తకంలో విపులంగా విశ్లేషిస్తున్నారు. మన నిత్యజీవితంలో ఎదుర్కొంటున్న అనేక మానవ సంబంధాల వెనుకనున్న కీలకాలను చిత్రించడం ద్వారా ఆ సంబంధాల సంక్లిష్ట కోణాల గురించిన ఎరుక పాఠకుడికి కలిగించడం ద్వారా కథాసాహిత్యం అతడి జీవన దృక్పథాన్ని ఉన్నతీకరిస్తుంది. తెలియని ఏదో వస్తువు కోసం మనం తీస్తున్న ఈ పరుగు పందెంలో మన జ్ఞాపకాలను సదా చిరస్మరణీయంగా ఉంచేది సాహిత్యమే. అందులో ఎలాంటి పారిభాషిక పదజాలమూ, ఊకదంపుడు ఉపన్యాసాలూ లేని ఇటువంటి హాయిగొలిపే, ఆలోచన పెంచే కథలు చదవడం ప్రస్తుత యువతకు ఎంతైనా అవసరం. రండి. మనమీ కథల పుస్తకాన్ని చదివి, మరింత మందిచేత చదివిద్దాం. జీవితంలో ఒక భాగాన్ని వివరించే కథను చెప్పడంలో రచయిత ఎంతో నైపుణ్యం సాధించారు. ఎంతో ఒడుపుగా సంభాషణలు రాయడం, సంఘటనలు సృష్టించడం, కథలో జోక్యం చేసుకోకుండా కథనం నడపడం వంటివి ఒంటపట్టించుకున్న రచయిత ఇకపై మొత్తంగా జీవితాన్ని చిత్రించే నవల లేదా నవలిక రచనకు పూనుకుంటే బాగుంటుందని సూచన. ●




## పిట్ట కొంచెం - కూత ఘనం

(బాలల కథా సంపుటి)

- యాసలపు సూర్యారావు

వెల : రూ. 25/- పేజీలు : 40

ప్రతులకు : 9491439012

ఈ కథల్లో మానవీయ స్పందనల్ని ప్రస్తుతించే రక్తదానం, సంస్కారం, గుడి - బడి, ఆదర్శ బాలలు, వివేకం గెలిచింది, విశ్వాసం వంటి కథలు పిల్లల్లో ఉత్తమ పౌరుల లక్షణాల్ని పెంపొందిస్తాయి అనడం సందేహం లేదు. విశ్వాసం కథ మంచి కథ. నువ్వు రాజువా... మంత్రివా అన్నది కాదు. ప్రేమ ముఖ్యం అన్నది హృద్యంగా చెప్పిన కథ ఇది.

- ప్రభు




## ఆకుల కదలికలు

(నానీలు)

- చల్లగాలి బాబూరావు

వెల : రూ. 40/- పేజీలు : 70

ప్రతులకు : 09941469728

చల్లగాలి బాబూరావుగారి కవిత్వంలో చక్కదనమూ, చిక్కదనమూ సమపాళ్ళలో వుంది. విషయాన్ని అభివ్యక్తీకరించడంలో హుందాతనం కనిపిస్తోంది. వీటి వెనుక సామాజిక చైతన్యం వైపు పరుగులు తీసే మనోనేత్రాలు కనిపిస్తాయి. అంతేకాదు, కవిత్వం ద్వారా సమాజానికి ఏదైనా మంచి చేయాలన్న తపన కనిపిస్తోంది.

- యస్సార్ పృథ్వీ




## కథా జ్వాల (కథల సంకలనం)

- జ్వాలాముఖి

వెల : రూ. 80/- పేజీలు : 188

ప్రతులకు : 9177881201

విషాద జీవితంపాలైన రకరకాల పీడితులు ఒక్కటై వలను ఎగరేసుకుపోయిన పావురాలుగా మారటం చదువుతుంటే ఏడుపూ, నవ్వూ ఒకేసారి వస్తాయి. దివిసీమ తుఫాను సందర్భంగా జరిగిన అనేక సంఘటనలు తళుక్కున మెరిసి, వాటిని అర్థం చేసుకోవలసిన తీరును తెలుసుకుంటాం. ఈ కథనంలో 'పంజరం ఎగిరిపోయింది' కథే, 'ఉప్పెన విప్పిన పొదుపు కథలు'గా రూపు దిద్దుకున్నది. నిజంగా ఇవి పొద్దుపొడుపు కథలు.

- డా॥ జతిన్‌కుమార్




జనులు - మహాజనులు

## మధ్యయుగాల మహాచరిత్ర

- మైకేల్ ఇలిన్, ఐ. సెగాల్

వెల : రూ. 90/- పేజీలు : 260

ప్రతులకు : 040-27608107

(ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)

ఈ కథంతా మనోహరమైన శైలిలో వ్రాయబడింది. ఇదొక వచో గీతం : ఎన్నో ప్రాచీన గాథలు చమత్కారంగా, సజీవంగా చెప్పబడినాయి ఇందులో. శరత్కాలపు వెన్నెలలా హాయిగా, చల్లగా, మనోరంజకంగా వుంటుందీ గ్రంథం. ఆహ్లాదకరమైన విజ్ఞానోద్యాన వనంలో విహరిస్తున్నట్లుంటుంది. ఇది చదువుతూంటే: శతాబ్దాల క్రిందట జీవించిన స్త్రీ పురుషులు ఈ నాటి మన ఇరుగు పొరుగు మానవులుగా వారి కృషిని గూర్చి సజీవంగా తోచే కథలు, గాథలు చెప్పగల దిట్ట రచయిత ఇలిన్. రుచీపచీ లేని చప్పని చరిత్ర గ్రంథాల్లా గాక దీన్ని ప్రారంభిస్తే కొసకంటా క్రింద బెట్టనీయదు.

- మహీధర జగన్మోహనరావు




## ఆశల రెక్కలు

- వంగర పరమేశ్వరరావు

వెల : రూ. 50/- పేజీలు : 74

ప్రతులకు : 9440520586

రెక్కలు, రూపం ఎప్పుడు బాగా విజయవంతమవుతుందంటే లోకంలో బాగా నలిగిపోయిన అంశాలు కాకుండా, కొత్త అంశాన్ని చెప్పినప్పుడు లేదా అదే అంశాన్ని బలపరిచే ఉపమానంగాని, ధ్వనిగాని, వైచిత్రి గాని - కొత్తదనం కలిగి ఉన్నప్పుడు.

వంగర పరమేశ్వరరావు రెక్కల్లో ఎక్కడైనా సామాన్యంగా అనిపించే రెక్కలున్నాయి గాని, ఎక్కువగా రెక్కలు రూపాన్ని బాగా వినియోగించుకున్న భావ ప్రసారమే కనిపిస్తుంది.

- డా॥ అద్దేపల్లి రామమోహనరావు




## ఆశారాజు కవితా వైభవం

- సౌభాగ్య

వెల : రూ. 80/- పేజీలు : 118

ప్రతులకు : 98481 57909

'రాయటమంటేనే జీవించడమైనప్పుడు నేను రాయకుండా ఉండలేను' అని ప్రకటించుకున్న ఆశారాజు - పద్యం కానివాడు యుద్ధం కానివాడూ చచ్చినా బతికినా ఒక్కటే అని నిశ్చయించుకున్న ఆశారాజు జీవితాన్ని కవిత్వం చేసుకున్నవాడు, కవిత్వాన్నే జీవితంగా మలుచుకున్నవాడు, అలాంటి 'అచ్చం నడిచొస్తున్న కవిత'లా వున్న ఆశారాజు విస్తృతమైన, వైవిధ్యభరితమైన కవిత్వానికి సౌభాగ్య పట్టిన కవితా హారతి ఇది.

- శిఖామణి

# కొత్త పుస్తకాలు




సామాజిక . రాజకీయ . సాంస్కృతిక

## గమనం

- తెలకపల్లి రవి

వెల : రూ.200/- పేజీలు : 424

ప్రతులకు : 040-27608107

(ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)

సామాజిక, సాంస్కృతిక, రాజకీయ కల్లోలాలనూ, వాద వివాదాలనూ చారిత్రక దృక్పథంతో సోదాహరణంగా విశ్లేషించిన నూట పాతికపైగా వ్యాసాలు ఉన్న ఈ పుస్తకం అధ్యయనానికి అరుదైన ఉపకరణం. వైవిధ్యభరితమైన అభిరుచికి దర్పణం.

- ప్రచురణకర్తలు




## హాస్య సంజీవిని

మూఢనమ్మకాలు, దురాచారాలపై బ్రహ్మాస్త్రం

- కందుకూరి వీరేశలింగం

వెల : రూ.80/- పేజీలు : 182

ప్రతులకు : 040-27608107

(ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)

వీరేశలింగం అనగానే వితంతు పునర్వివాహాలు ప్రధానంగా గుర్తుకొస్తాయి గాని సమాజంలో పేరుకుపోయిన ప్రతి చెడునూ ఆయన చీల్చి చెండాడాడు. ఆచారాలు, శాస్త్రాల పేరిట సాగిన బూటకాలను పటాపంచలు చేశారు. పెద్ద మనుషుల అల్పబుద్ధులను బదాబదలు చేశాడు. ఆనాటికి అది గొప్ప సాహసమే ఈనాటికి కూడా వాస్తు పేరిట, శకునాల పేరిట సాగే తతంగాలను చూస్తూనే వున్న మనం వీరేశలింగం అన్నేళ్ళ కిందటే వాటిని వినోదాత్మకంగా, విశ్లేషణాత్మకంగా చెప్పిన తీరుకు విస్తుపోకుండా ఉండలేము.

- ప్రచురణకర్తలు




## అదే ఆకాశం

(అనేక దేశాల అనువాద కవితలు)

- ముకుంద రామారావు

వెల : రూ.60/- పేజీలు : 108

ప్రతులకు : అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు

దాంబికమైన శబ్దాల రణగొణ ధ్వనికి దూరంగా తనదైన దారిన ప్రయాణిస్తున్న కవి ముకుంద రామారావు. నిశ్శబ్దంలోని సౌందర్య రహస్యం ఈయనకి తెలుసు. కవిగా, పాఠకునిగా ఉదాత్తమైన అభిరుచి వున్న ముకుంద రామారావు ప్రాకృతిక సంవేదనల్లోని అందం ఏమిటో గ్రహించారు. ఈ అందాన్ని తెలుగు పాఠకులకి అందించాలన్న తపన, లాలస ఈ అనువాదాలకి ఆయన్ని ప్రేరేపించాయి.

- గుడిపాటి




భారత స్వాతంత్ర్యోద్యమం

## ఆంధ్రప్రదేశ్ ముస్లింలు

- సయ్యద్ నశీర్ అహమ్మద్

వెల : రూ.250/- పేజీలు : 394

ప్రతులకు : 94402 41727

సయ్యద్ నశీర్ అహమ్మద్‌గారు వృత్తిరీత్యా చరిత్రకారుడు కాకపోయినా ప్రవృత్తిరీత్యా గొప్ప చరిత్ర ప్రేమికుడు. మంచి చరిత్ర పరిశోధకుడు. ఆయన రచించిన అనేక వ్యాసాల్ని, పలు గ్రంథాల్ని చదివే అవకాశం నాకు కల్గింది. వాస్తవానికి సమాజంలో చారిత్రక అవగాహనకు, చైతన్యాన్నీ, స్ఫూర్తిని వ్యాప్తి చేయడంలో నశీర్ అహమ్మద్ లాంటి పరిశోధకుని పాత్ర ఎంతైనా శ్లాఘనీయం. చరిత్ర పరిశోధన, రచనలో ఆయన అనుసరించిన పద్ధతి హేతుబద్ధంగా, శాస్త్రీయంగా ఉంటుందని చెప్పడానికి 'భారత స్వాతంత్ర్యోద్యమం : ఆంధ్రప్రదేశ్ ముస్లింలు' గొప్ప నిదర్శనం.

- ఆచార్య అడపా సత్యనారాయణ




## మనిషి కోసం...

- గుత్తికొండ సుబ్బారావు

వెల : రూ.80/- పేజీలు : 76

ప్రతులకు : 94401 67697

తాను రచయితగా కన్నా సాహిత్య కార్యకర్తగా ఉండటానికే ఎక్కువ ఇష్టపడేవాడు శ్రీ గుత్తికొండ. ఆ రోజుల్లో ఆయన తపాలా శాఖలో హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తూ "స్పందన సాహితీ సమాఖ్య" అనే సంస్థ ద్వారా విస్తృతంగా సాహితీ కార్యక్రమాలు నిర్వహిస్తుండేవాడు. ప్రముఖ కవి శివారెడ్డితో కలిసి 'వేకువ' పత్రికని నడిపిన సంగతి ఆనాటి కవులకు ఇంకా గుర్తుండే వుంటుంది. ఇదిగో, ఇప్పుడు మీ చేతుల్లో ఉన్న "మనిషి కోసం" కవితా సంపుటిలోని కవితలు అప్పట్లో రాసినవే!

- డా॥ జి.వి. పూర్ణచందు




## మోహనీలిక (కవిత్వం)

- దుర్గాప్రసాద్ అవధానం

వెల : రూ.30/- పేజీలు : 76

ప్రతులకు : 94926 08314

మొత్తానికి మొత్తం
నా మెదడ్నిండా
ఒకరిని మరొకరిలా చూపెట్టే
ఎన్నో ఆలోచనల అద్దాలు
ఎప్పటికప్పుడు
నేనెవరి ఆలోచనల అద్దంలో
మారిపోయే వక్రబింబాన్నో

- దుర్గాప్రసాద్ అవధానం




## సహిత (సాహిత్య వ్యాసాలు)

- ఓల్గా

వెల : రూ.60/- పేజీలు : 280

**ప్రతులకు : అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు**

మధురవాణి వేశ్యావృత్తిలో ఉన్న వ్యక్తి. సంగీత సాహిత్యాలతో పరిచయం ఉంది. తల్లి పెంపకంలో సుశిక్షితురాలై మంచివారి యెడల మంచిగాను, చెడ్డవారి యెడల చెడ్డగానూ ప్రవర్తించమన్న తల్లి మాటలను విలువైన మాటలుగా గుర్తుంచుకున్నది. అయితే చాలాసార్లు ముఖ్యంగా స్త్రీలకు సహాయపడే సందర్భాలలో ఆమె తన పట్ల చెడ్డగా ఉన్నవారి పట్ల కూడా మంచిగానే ఉన్నది. తల్లి మాటలకు తన వివేకాన్ని కూడా జోడించి మానవ సంబంధాలలో ఎంత సున్నితంగా, అదే సమయంలో ఎంత ఆత్మగౌరవంతో ఉండవచ్చో మనకు నేర్పింది.

- ఓల్గా




## పుస్తకంలో నెమలీక

(కవితా సంపుటి)

- ఓరుగంటి పురుషోత్తం

వెల : రూ.50/- పేజీలు : 66

**ప్రతులకు : 9703336584**

ఈ కవితల నల్లుకునే క్రమంలో అనేక భూమికల కింద ఈ కవి తనను తాను విభాగించుకొని, ఆయా పాత్రలకు స్పష్టమైన పరిపుష్టి నిచ్చుకుంటూ ప్రప్రథమంగా ఒక బాలుడుగా, ఒక చూపరిగా, ఏదో వొకింత కోల్పోయిన వాడిగా, యింకేదో పొందినవాడుగా, ముఖ్యంగా ఒక పిల్ల మనో విశ్లేషకుడుగా, బాల్యం పక్షాన వకాల్తా పుచ్చుకున్నవాడుగా తనను తాను మలచుకొని, తన కోణంలో - తన శక్తి మేరకు తన అభివ్యక్తి సామర్థ్యాన్ని రూపొందించుకోగా నిర్మితమైన సంపుటే ఈ "పుస్తకంలో నెమలీక".

- వేణు సుంకోజు




## నిత్యానుశీలనం

- ఆచార్య వెలుదండ నిత్యానందరావు

వెల : రూ.125/- పేజీలు : 144

**ప్రతులకు : 09441666881**

'నిజాం పాలనలో వెలవెలబోయిన తెలుగు వెలుగు' అనే వ్యాసం నిత్యానందరావు పరిశోధన తత్పరతకు దర్పణంలా నిలుస్తుంది. ఈ వ్యాసం కొరకు వారు సేకరించిన సమాచారం అపూర్వం. మరో వ్యాసంలో బోయి భీమన్న సదాశివధ్యాన తత్పరుడనీ, వారు రచించిన శృంగార లేఖా కావ్యం 'రాగవైశాఖి' ఆంధ్ర సారస్వతంలో విలక్షణ ప్రయోగమనీ విశ్లేషణాత్మకంగా నిత్యానందరావు వివరించారు. హైమావతీ చరణచారణ లాస్య విలాసం ఈ రాగవైశాఖియని పేర్కొనడం చమత్కృతి.

- డా॥ కె.వి. రమణాచారి




## సూర్యోదయానంతరం

(కవిత్వం)

- డా॥ ఎస్. షమీఉల్లా

వెల : రూ.70/- పేజీలు : 128

**ప్రతులకు : 94418 83190**

అణగారిన గొంతుకల పట్ల ఆర్తి, ముక్కలవుతున్న మానవ సంబంధాల పట్ల నిరసన, జీవితాన్ని శాసిస్తున్న వ్యాపార ధోరణుల పట్ల తిరుగుబాటు, 'షమీఉల్లా' కవిత్వ లక్షణం.

- ప్రచురణకర్తలు




## విద్యా ప్రస్థానంలో ప్రత్యేక ప్రయోగాలు

- వి. బాలసుబ్రమణ్యం

వెల : రూ.100/- పేజీలు : 176

**ప్రతులకు : 040-27608107**

**(ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)**

ఆధునిక కాలంలో విద్యా బోధన ప్రజాస్వామికంగానూ పిల్లల భాగస్వామ్యాన్ని పెంచే విధంగానూ వుండాలన్న భావంతో ఏకీభవించని వారుండరు. అలాటి ప్రయోగాత్మక ప్రత్యామ్నాయ విద్యాసంస్థలు నడిపి చక్కటి ఫలితాలు సాధించిన ఉదాహరణలూ వున్నాయి. ప్రత్యామ్నాయ భావాలను తీర్చిదిద్దిన ప్రముఖులూ వున్నారు. అన్నిటినీ మించి బోధనాపద్ధతులకు సంబంధించి ఉపాధ్యాయుల ప్రత్యక్షానుభవాలు కూడా వున్నాయి. ఈ మూడు అంశాలను మేళవింపుగా ప్రస్తుత సంకలనం రూపొందింది.

- ప్రచురణకర్తలు




## జీవన బంధం (మనోవిశ్లేషణ)

- అలపర్తి పిచ్చయ్య చౌదరి

వెల : రూ.50/- పేజీలు : 108

**ప్రతులకు : 98493 51604**

తన జీవితంలో తారసపడిన వివిధ వ్యక్తులను క్షుణ్ణంగా పరిశీలించి, విశ్లేషించిన కథనమిది. మైత్రీ సంబంధాలలో మిత్రలాభం, మిత్రభేదం, వ్యక్తులలోని ద్వంద్వ నీతి, వాటిని ఖండిస్తూ సత్ప్రవర్తనకు మార్గదర్శకాలను సూచిస్తూ, జీవితం సాఫీగా, విజయవంతంగా సాగిపోయేందుకు తన జీవితాన్నే దర్పణంగా చూపిస్తూ వచ్చారు. అటాచ్డ్ డిటాచ్‌మెంట్‌తో తమ గమనాన్ని వివేకంతో సరిదిద్దుకోవాలంటారు.

- మల్లెమాల వేణుగోపాలరెడ్డి

# "కళలు సమాజంలోంచి పుట్టినవే"



మెరుగు సభలో ప్రసంగిస్తున్న వి.ఎ.కె. రంగారావు
చిత్రంలో చాగంటి తులసి, చీకటి దివాకర్

విజయనగరం 'సాహితీ స్రవంతి' ఆధ్వర్యంలో మార్చి 10న చీకటి దివాకర్ నిర్వహణలో సాగిన 'మెరుగు' కార్యక్రమంలో వి.ఎ.కె. రంగారావు 'నృత్యం - సమాజం' అనే అంశంపై ప్రసంగించారు. జి.ఎస్. చలం ప్రారంభవచనాలు పలుకుతూ యిటీవల మరణించిన సాహితీమూర్తులు వడలి మందేశ్వరరావు, ముళ్ళపూడి వెంకట రమణ, మిక్కిలినేనిలకు గౌరవసూచకంగా సంతాపం ప్రకటించారు. అనంతరం శ్రీమతి సుభద్ర 'ఎంత చక్కనిదోయి యీ తెలుగు తోట' అన్న గీతాన్నాలపించారు.

"తన జీవితమంతా నాట్యరీతులతోనూ, సినీ సంగీత పోకడలతోనూ పెనవేసుకొని, ప్రతిభకు కొలమానాలు యూనివర్శిటీ లిచ్చిన డిగ్రీలు కావని, అలాగే బిరుదులకూ - వాటి స్థాయిని మించిన ప్రజాభిమానం చేకూర్చి పెట్టిన 'మేలు మడేలు' వి.ఎ.కె. రంగారావు అంటూ డా॥ తులసి పరిచయం చేశారు.

వి.ఎ.కె. రంగారావు మాట్లాడుతూ నా గురించి ఏవైతే చెప్పారో అవన్నీ నిజం, ఆ గౌరవం పొందే అర్హత నాకుందని చెప్పడానికి నేనేమీ సంకోచించను. అయితే అది నేనెన్నుకున్న జీవన విధానం వల్లనే ఏర్పడింది. నాకు ఊహ తెలిసేప్పటికి నా చుట్టూ సంగీత, నృత్య కళల వాతావరణం ఉంది అన్నారు. 54 సంవత్సరముల క్రితం యిక్కడి హస్తబల్ కళావేదికలో 'శ్రీకృష్ణప్రియ' అనే పేరుతో నాట్యం చేశాను. పేరును బట్టి ఆడపిల్ల అనుకున్నారు. అమ్మ వీణ వాయించే వారు. మా దివాణంలో గడ్డిభుక్త సీతారం అనే ఆవిడ సైరంధ్రి చేసే పనులు అంటే పూలు మాలలల్లడం, అలంకరించడం, నాట్యం చేయడం లాంటివి చేసేదనీ, విజయనగరంలో కమలకుమారి అనే నాట్యకత్తె కళావరు రింగు (అసలు పేరు సరిదె లక్ష్మీనరసమ్మ) అలాగే మద్దెల పోతప్పడుగారి రాముడు, బెంగుళూరు నాగరత్నమ్మ... యిలా నాకు వాటిని సంగీతం అంటారని తెలిసే నాటికే వాళ్ళ ప్రభావం నామీద పడింది అన్నారు. కళలు అనేవి అనుకోని, ఎక్కడో కూర్చొని సృష్టించినవి కావు. మనిషి భావావేశాలు పరాకాష్ట చెందినప్పుడు వివిధ రూపాల్లో ప్రస్ఫుటమవుతుంటాయి. అవి కళలుగా రూపొందుతాయి. ఉత్కృష్టమైన దశకు చేరిన కళ మనిషిని అంతర్లీనంగా స్పృశించి పునీతుణ్ని చేస్తుంది. గ్రీకులో 'కెథార్సిస్' అంటారు. అది మనిషిలోని అంతర్లీనంగా అణచివేయబడ్డ అనుభూతుల్ని వ్యక్తీకరించే నాటక ప్రక్రియ అన్నమాట. జపాన్‌లో రంగస్థల మాధ్యమం 'కవూకి' అలాంటిదే. నేను ప్రవృత్తినే జీవితంగా ఎంచుకున్నాను. అందుకోసం ఎన్నో వదులుకున్నాను. సంసార బాదరబందీలు ఏర్పరచుకోలేదు. ఎక్కడికి కావాలంటే అక్కడికి బయలుదేరడం, నాక్కావలసినవి సంపాదించుకోవడం, 1904 నుంచి 2011 వరకూ సంగీతానికీ, సినీ సంగీతానికీ సంబంధించి 42,000 గ్రామ్‌ఫోన్ రికార్డులు సేకరించాను. 1,25,000 పాటలకు సంబంధించి డిఫరెంట్ ట్రాక్స్ కూడా ఆ ప్రయత్నంలో భాగంగానే సేకరించగలిగాను. మల్లాది వారు నన్ను గుర్తించి నాచేత శ్రీ పంచకం రాయించారు. ప్రస్తుత సినీ సంగీతాన్ని శాసిస్తున్న ఇళయరాజా, రెహమాన్‌లు పాశ్చాత్య సంగీతాన్ని మన సంగీతంలో చొప్పిస్తున్నారని చాలామంది నన్ను ప్రశ్నిస్తుంటారు. కానీ సంగీత త్రిమూర్తులలో ఒకరైన త్యాగరాజు 'గాడ్ సేవ్ ది కింగ్' అనే ప్రాచుర్యం పొందిన ఆంగ్ల గీతం నడకలో 'శరశరసమరై' అనే గీతాన్ని కుంతలవరాళిలో స్వరపరిచారు. అలాగే రవీంద్రనాథ్ టాగూర్ బాణీలో వున్న 'వందేమాతర'గీతం 'ఆనందమఠ్' సినిమాలో హేమంత్‌కుమార్ చాలా స్ఫూర్తిదాయకంగా స్వరపరచి మామూలుగా పదివేలమంది ఆస్వాదించే స్థాయి నుంచి పది లక్షల మంది సామాన్య జనానికి చేర్చి ఉగ్రూతలూగించారు. జయదేవుని అష్టపదుల్లో వున్నది శృంగారమో, బంగారమో నాకు ఆ వయసులో తెలియకపోయినా ఆ పదాల్లో ధ్వని నన్నాకట్టుకుంది. అందువల్ల సంగీతం యింకో సంగీతం ప్రమేయం లేకుండా వుండదు. అసలు సంగీతమనే కాదు ఏ కళా యితర కళల ప్రమేయం లేకుండా వుండవు. మరొకటి ప్రేరణ పొందినట్లే కాలానుగుణంగా, సమాజావసరాల కనుగుణంగా కొత్త కొత్తగా సృజింపబడుతుంటాయి. మనుషుల వలన, మనుషుల కొరకు, మనుషుల చేత అవసరార్థం సృష్టించబడినవే యీ కళలు. ఎవరో సృష్టించారన్న అభూత కల్పనలు నమ్మక్కర్లేదు అంటూ తన ప్రసంగాన్ని ముగించారు.



మెరుగు సభలో ప్రారంభ గీతం ఆలపిస్తున్న శ్రీమతి సుభద్ర

- పి.వి. శ్రీనివాసరావు

## విగ్రహాల విధ్వంసం, మీడియాపై దాడి గర్హనీయం

మిలియన్ మార్చ్ పేరుతో ట్యాంక్‌బండ్‌పై ప్రదర్శన సందర్భంగా తెలుగుజాతి వైతాళికుల విగ్రహాలను విధ్వంసం చేయడం, మీడియాపై దాడులు సాగించడం అత్యంత గర్హనీయమని సాహితీ స్రవంతి పేర్కొంది. ఈ మేరకు సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి, రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె.ఆనందాచారి, రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్ ఒక సంయుక్త ప్రకటన విడుదల చేశారు. మొత్తం తెలుగు ప్రజల సాంస్కృతిక వికాసానికి పాదులు వేసిన మహనీయులపై, వందల ఏళ్ళ కిందటే సంఘ సంస్కరణకు కృషి చేసిన మహనీయుల వారసత్వంపై దాడి రాష్ట్ర ప్రజలందరికీ మనస్తాపం కలిగించే ఘటన అని ఆవేదన వ్యక్తంచేశారు. అభ్యుదయగాముకులు, విప్లవ భావశిల్పులు అయిన మహా వ్యక్తుల విగ్రహాలపై దాడి, ధ్వంసం ఏ విధంగానూ సమర్థించుకోలేనివని పేర్కొన్నారు. మీడియాపై దాడి ప్రజాస్వామికవాదులు హర్షించలేని చర్య అని, ఇందుకు కారకులైన వారిపై తగిన చర్యలు తీసుకోవాలని, ఇటువంటి ఘటనలు పునరావృతం కాకుండా చూడాలని సాహితీ స్రవంతి తరఫున విజ్ఞప్తి చేశారు. తెలుగు ప్రజల సమరశీల, ప్రగతిశీల చైతన్య పరిరక్షణకు పిలుపునిచ్చారు. రచయితలు, కళాకారులు, సాంస్కృతిక కార్యకర్తలు సంయమనంతో సుహృద్భావ వాతావరణం నెలకొల్పాలని కోరారు.

## 'బంతిపూలమాల' ఆవిష్కరణ

సాహితీ స్రవంతి భద్రాచలం డివిజన్‌శాఖ ఆధ్వర్యంలో, ఫిబ్రవరి 27న స్థానిక హెడ్ పోస్టాఫీసు సెంటర్‌లో వీధుల రాంబాబు రచించిన 'బంతిపూలమాల' బాలల కథాసంపుటి ఆవిష్కరణ జరిగింది. కె.ఆనందాచారి అధ్యక్షోపన్యాసం చేస్తూ మిత్రులు వీధుల రాంబాబు సాహితీ స్రవంతి బాధ్యులుగా వుంటూనే ఇటు తెలుగు సాహిత్యంలోనూ, అటు హిందీ సాహిత్యంలో కూడా మంచిపట్టు సాధించారన్నారు. వారు రచించిన బంతిపూలమాల కథలు పిల్లలకు నీతిని బోధించే రీతిగా చక్కని పదాలతో అల్లారన్నారు. ఇటువంటి బాల సాహిత్యం ప్రతి ఇంట ప్రత్యక్షం కావాలన్నారు. బంతిపూల మాలను శ్రీమతి శైలజామిత్ర ఆవిష్కరించారు. రెడ్డి రాఘవయ్య పుస్తక సమీక్ష చేస్తూ 'బంతిపూల మాల'లోని కథలు అందరూ చదవదగ్గవనీ, నీతిదాయకమైనవనీ, రచనాశైలి రమ్యంగా వుందనీ కొనియాడారు.



ముఖ్య అతిధులు మాగంటి సూర్యం, పంచాక్షరయ్య, పోతగాని సత్యనారాయణ, మాల్యశ్రీ తదితరులు మాట్లాడారు. సభలో వెంటుపల్లి సత్యనారాయణ, సాహితీ స్రవంతి బాధ్యులు తాతోలు దుర్గాచారి, పి.విష్ణుమూర్తి, జి.రామరాజు వైద్యుల వెంకటేశ్వర్లు ఆర్.ఎస్.రావు, తిరుపాలు తదితరులు, కవులు, రచయితలు, సాహిత్యాభిమానులు పాల్గొన్నారు.

## కందుకూరి శ్రీరాములుకు ఈదూరు సుబ్బయ్య సాహితీ పురస్కారం

ఈదురు సుబ్బయ్య సాహితీ పురస్కారాన్ని ఫిబ్రవరి 12న నెల్లూరు ఐ.ఎమ్.ఎ. భవనంలో జరిగిన అవార్డు ఫంక్షన్‌లో నెల్లూరు జిల్లాపరిషత్ చైర్మన్ కాకాణి గోవర్ధనరెడ్డి, శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం "డీన్" ఆచార్య ఎండ్లూరి సుధాకర్‌లు, అవార్డును, నగదు పురస్కారాన్ని కవి కందుకూరి శ్రీరాములుకు అందజేసారు. నెల్లూరు జిల్లా రచయితల సంఘం అధ్యక్షులు డా॥శ్రీనివాస తేజ, రాష్ట్ర జర్నలిస్టు సంఘం ఉపాధ్యక్షులు ఎ.జయప్రకాష్, ఈతకోట సుబ్బారావు, ఈదూరు రవి, ఏటూరి నాగేంద్రరావు, 'పినాకిని' సంపాదకులు వంజవాక సతీష్‌కుమార్, ఈదూరు శేషయ్య, డా॥ ఈదూరు సుధాకర్‌లు, చిన్ని నారాయణరావులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ అవార్డు సభలో కాకాణి గోవర్ధనరెడ్డి మాట్లాడుతూ ఇంత విలువైన సాహితీ పురస్కారాన్ని స్థానికానికే పరిమితం చేయకుండా రాష్ట్రవ్యాప్తంగా నిర్వహించడం కందుకూరి శ్రీరాములు సాహిత్యాన్ని వెలుగులోకి తెచ్చిన సాహితీ పీఠం నెల్లూరుకు మార్గదర్శకమని అభినందించారు. ఆచార్య ఎండ్లూరి సుధాకర్ మాట్లాడుతూ..."ఈ యంత్రయుగంలో అందరం బాల్యాన్ని, గ్రామాల్ని మర్చిపోతున్న తరుణంలో కందుకూరి – తన ఊరిపేరుపై "రావు రూకుల" కవిత్వ గ్రంథాన్ని వెలువరించడం – ప్రతి అక్షరం తన ఊరుని" స్నేహితుల్ని – బాల్యాన్ని స్పృశించడం గొప్ప అనుభూతి నిచ్చిందని కొనియాడారు. ఈ కార్యక్రమాన్ని నెల్లూరు జిల్లా రచయితల సంఘం కార్యదర్శి ఆహ్వానించి ప్రారంభించారు. ప్రముఖ నవలా రచయిత డా॥జయప్రద జ్యోతి ప్రజ్వలన చేసారు.




**ఫిబ్రవరి 12న జరిగిన ఈదూరు సుబ్బయ్య సాహితీ పురస్కార సభలో జ్యోతి ప్రజ్వలన చేస్తున్న ఈదూరు శేషయ్య, చిత్రంలో జడ్.పి. ఛైర్మన్ కాకాణి గోవర్ధనరెడ్డి, ఆచార్య ఎండ్లూరి సుధాకర్, కందుకూరి శ్రీరాములు, ఈతకోట సుబ్బారావు, వంజవాక సతీష్‌కుమార్‌రెడ్డి**



# "అంతర్వాహిని" ఆవిష్కరణ సభ

ఫిబ్రవరి 28న హైదరాబాద్‌లోని త్యాగరాయగానసభలో ఎస్వీ రఘువీర్ ప్రతాప్ రాసిన పుస్తకం "అంతర్వాహిని" ఆవిష్కరణ జరిగింది. సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన పద్మభూషణ్ డా॥సి.నారాయణరెడ్డి పుస్తకాన్ని ఆవిష్కరించి ప్రసంగించారు. సభాధ్యక్షత ఆచార్య ఎన్.గోపి వహించగా విశిష్ట అతిథిగా డా॥ పోతుకూచి సాంబశివరావు ఆత్మీయ అతిథులుగా, కళా వెంకట దీక్షితులు, కన్నోజు లక్ష్మీకాంతం, శైలజామిత్ర పాల్గొని ప్రసంగించారు. డా॥నోరి రాజేశ్వరరావు పుస్తక పరిచయం చేయగా కొంపెల్ల శర్మ, రత్నాకర శర్మలు స్వాగతం, వందన సమర్పణ చేశారు.



మార్చి 20న కరీంనగర్‌లో సారస్వత జ్యోతి మిత్ర మండలి పక్షాన బొ.వె.రా. భవన్‌లో అక్షర సౌజన్యం (రేగులపాటి కిషన్‌రావు), నడుస్తున్న చరిత్ర (పంజాల జగన్నాథం) పుస్తకాల ఆవిష్కరణ దృశ్యం




మార్చి 10న విశాఖపట్టణం నేవల్ డాక్‌యార్డు మేఘాద్రి ఆడిటోరియంలో 40వ భద్రతా జాతీయ వారోత్సవ కవితా పోటీలో విజేత మహ్మద్ అబ్దుల్ అజీజ్‌ను సత్కరిస్తున్న విశాఖ నేవల్ డాక్‌యార్డు అధిపతి రియర్ అడ్మిరల్ విజయకుమార్ నంబాలా

## చందాదారులకు ఓ విన్నపం

★ ప్రస్థానం చందాదారుని చిరునామా పైన చందా యొక్క కాలపరిమితి సూచిస్తూ నెల - సంవత్సరం ఇస్తున్నాం. అది గమనించి వెంటనే మీ చందాను పునరుద్ధరించుకోగలరు. (రెన్యువల్స్).

★ కంప్యూటర్‌లోని రికార్డులో చందా ముగియడంతోనే ఆ చందాదారుని పేరు ఆటోమేటిక్‌గా డిలీట్ అవుతుంది. చందా కాలం ముగిసిందని ముందుగానే వారి చిరునామాకు కార్డు రాస్తున్నాం.

★ ఆన్‌లైన్‌లో చందాను రెన్యువల్ చేసుకోవచ్చు. ఖాతా పేరు: ప్రస్థానం, ఖాతా నెం. 52001500585. బ్యాంక్: ఎస్‌బిహెచ్. ఆన్‌లైన్‌లో 5, 10 సంవత్సరాల చందాలు మాత్రమే అంగీకరించబడతాయి.

★ సాహితీస్రవంతి కార్యకర్తలు, అభిమానులు చందాలను ఆన్‌లైన్‌లో జమచేసేటప్పుడు కనీసం 5 చందాలను ఒకసారి జమచేయగలరు. ఒకసారి ఆన్‌లైన్‌లో జమచేసినందుకు రూ. 25/-లు కట్ అవుతుంది.

★ 5 సం॥ చందా డిస్కౌంట్‌లో రూ. 500/- కట్టడం వల్ల మీకు అన్ని సంచికలు క్రమంగా అందుతాయి. గ్యాప్‌లు రావు. రూ. 100/- ఆదా కూడా అవుతుంది. (5 × 120 = 600).

★ ఎం.ఓ. పంపే వారు కూపన్‌కు ఒకవైపున మీ పూర్తి చిరునామా, ఫోన్ నెం. రాయండి. అడ్రస్ మారితే వెంటనే కార్డు రాయండి. ఇ-మెయిల్ కూడా పంపవచ్చు. Prasthanam _ss@yahoo.co.in.



ఫిబ్రవరి 27న మార్కాపురం నెల నెలా వెన్నెల సాహితీ వేదిక ఆధ్వర్యంలో కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీశ్రీల జీవిత విశేషాలను గురించి ఉపన్యసించిన ఒంగోలు భారతీయ సాహిత్య పరిషత్ కన్వీనర్ మేళ్ళ చెరువు లక్ష్మీ కాంతారావు, ఆకాశవాణి డైరెక్టర్ వై. నాగేశ్వరరావులను సత్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో కార్యదర్శి కె.వి. రమణారెడ్డి, కె. మధుసూధనశాస్త్రి, ఓరుగంటి మల్లిక్, ప్రత్తిపాటి పర్వతాచారి, తోట శ్రీనివాసరావు, మంత్రి కృష్ణమోహన్, జి.ఎల్.వి. రమేష్‌బాబు

# విలువలకు దర్పణం పట్టాలి



మార్చి 20, 21 తేదీల్లో మచిలీపట్నంలోని కృష్ణా విశ్వవిద్యాలయంలో జర్నలిజంపై జరిగిన రెండురోజుల సదస్సులో ప్రసంగిస్తున్న ప్రజాశక్తి బుక్‌హౌస్ సంపాదకులు తెలకపల్లి రవి, వేదికపై పలువురు సంపాదకులు

పత్రికా, ప్రసార మాధ్యమాలు విలువలకు దర్పణం పట్టాలని జర్నలిజంపై జరిగిన జాతీయ సదస్సులో వక్తలు అభిలషించారు. కృష్ణాజిల్లా మచిలీపట్నంలోని కృష్ణా విశ్వవిద్యాలయంలో మార్చి 20, 21 తేదీలలో జర్నలిజంపై జరిగిన రెండు రోజుల సదస్సును రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి పి. రఘురాం ప్రారంభించారు. విశ్వవిద్యాలయ ఉపకులపతి ఎం.కె. దుర్గాప్రసాద్ అధ్యక్షత వహించారు. 'సమాచార మాధ్యమాలు పోకడలు - నైతిక విలువలు' అంశంపై రఘురాం మాట్లాడుతూ వర్తమాన సమాజంలో మీడియా ఎదుర్కొంటున్న అనేక సంక్షోభాలను చర్చించుకోవడానికి ఇలాంటి సదస్సులు దోహదపడతాయన్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమీ ఛైర్మన్ పి. సురేంద్ర మాట్లాడుతూ ప్రస్తుతం మీడియా రంగం పెను సవాళ్ళను ఎదుర్కొంటోందన్నారు. సమాజంలో ఉన్న అనేక సమస్యల పరిష్కారానికి మీడియా నుంచి స్పందన కోరుతున్నందున మీడియా కూడా ఒత్తిడికి గురవుతోందని చెప్పారు. కృష్ణాజిల్లా రచయితల సంఘం గౌరవాధ్యక్షులు మండలి బుద్ధప్రసాద్ మాట్లాడుతూ ముట్నూరి కృష్ణారావు వంటి మహనీయులు ఆనాడే కృష్ణ పత్రికను స్థాపించి తెలుగు జర్నలిజానికి పాదులు తీశారన్నారు. 'సమాచార మాధ్యమాలు - సంస్కృతి - నేర వార్తలు' అంశంపై ప్రజాశక్తి బుక్‌హౌస్ సంపాదకులు తెలకపల్లి రవి మాట్లాడుతూ నేడు పత్రికా యాజమాన్యాలు పాలక వర్గాలకు సేవ చేసేలా మారిపోయాయని, ఈ వైఖరి విలువల పతనానికి దారితీస్తుందనీ చెప్పారు. నేర కథనాలను ప్రసారం చేసేటప్పుడు మూలాల్లోకి వెళ్ళి సమాచారం అందించడంలో వైఫల్యం కనబడుతోందని చెప్పారు. అధికార భాషా సంఘం పూర్వ అధ్యక్షులు ఎ.బి.కె. ప్రసాద్ 'సమాచార మాధ్యమాలు - ప్రజాస్వామ్య ధోరణులు' అనే అంశంపై మాట్లాడుతూ వ్యవస్థను బాగుచేసే క్రమంలో మీడియా ప్రముఖ పాత్ర పోషిస్తోందన్నారు. రాష్ట్ర గ్రంథాలయ పరిషత్ ఛైర్మన్ పద్మశ్రీ తుర్లపాటి కుటుంబరావు 'నాటి తరం పాత్రికేయులు' అంశంపై మాట్లాడుతూ విలువలకు ఆనాడు అత్యంత ప్రాధాన్యత ఉండేదనీ, యజమానులు కూడా పాత్రికేయులు పాటించే విలువలకు అత్యంత ప్రాధాన్యత ఇచ్చేవారనీ చెప్పారు. వార్త పత్రిక సంపాదకులు టంకశాల అశోక్ 'పత్రికలు - విలువలు' అంశంపై మాట్లాడుతూ విలువలు ఒక కొయ్యగుర్రంలా మారిపోయాయని ఆవేదన వ్యక్తం చేశారు. సీనియర్ సంపాదకులు జి. శ్రీరామమూర్తి మాట్లాడుతూ విలువలు అవసరమని ప్రజలు గుర్తించి డిమాండ్ చేయాలన్నారు. డాక్టర్ నాగసూరి వేణుగోపాల్, ఆంధ్రప్రభ సంపాదకులు పి.విజయ్‌బాబు తదితరులు ప్రసంగించారు. సదస్సుకు కృష్ణా విశ్వవిద్యాలయం రిజిస్ట్రార్ డి. సూర్యచంద్రరావు, జర్నలిజం శాఖ అధ్యాపకులు కర్ణమహారాజన్, వినయ్‌కుమార్, విజయలక్ష్మి తదితరులు పర్యవేక్షించారు.

# తెలుగు యూనివర్సిటీ సాహితీ పురస్కారాలు

తెలుగు సాహిత్యంలోని వివిధ ప్రక్రియల్లో వెలువడిన ఉత్తమ గ్రంథాలకు పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం సాహితీ పురస్కారాలను ప్రకటించింది. భట్టిప్రోలు కృష్ణమూర్తి రచించిన 'పురుషోత్తముడు' కావ్యానికి పద్య కవితా పురస్కారం లభించింది. డాక్టర్ అమ్మంగి వేణుగోపాల్ రచించిన 'భరోసా' ఉత్తమ వచన కవితా సంపుటిగా ఎంపికైంది. గొరుసు జగదీశ్వర్ రెడ్డి రచించిన 'గజ ఈతరాలు' కథల సంపుటి కథా పురస్కారాన్ని దక్కించుకుంది. డాక్టర్ కేశవరెడ్డి రచించిన 'మునెమ్మ' ఉత్తమ నవలగా గుడిపాటి రచించిన 'సంవిధానం' ఉత్తమ సాహిత్య విమర్శనాత్మక గ్రంథ పురస్కారాన్ని పొందాయి. డాక్టర్ వి.ఆర్. రాసాని రచించిన 'మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ' ఉత్తమ నాటకంగా ఎంపికైంది. ఆర్. శాంతసుందరి రచించిన 'ప్రేమ్‌చంద్ బాలసాహిత్యం' పదమూడు కథల గ్రంథం అనువాద పురస్కారాన్ని దక్కించుకుంది. డాక్టర్ గుమ్మన్నగారి బాల శ్రీనివాసమూర్తి రచించిన ఆత్మకథల్లో 'ఆనాటి తెలంగాణ' వచన రచనా విభాగంలో ఉత్తమ గ్రంథ పురస్కారం పొందింది. రచయిత్రుల రచనల్లో డాక్టర్ తుర్లపాటి రాజేశ్వరి రచించిన 'తెలుగుదనం' ఉత్తమ గ్రంథంగా ఎంపికైంది. ఈ నెల 31న తెలుగు విశ్వవిద్యాలయంలో జరిగే ప్రత్యేక కార్యక్రమంలో ఈ పురస్కారాలను అందజేస్తారు. పురస్కారం కింద రు. 20,116 నగదు, శాలువాతో సత్కరిస్తామని ఉపాధ్యక్షుడు ఆచార్య అనుమాండ్ల భూమయ్య ఒక ప్రకటనలో తెలిపారు. కవి సమ్మేళనంలో ప్రముఖ కవులు పాల్గొంటారని ఆయన వివరించారు.

## గమనిక

డైరీ కాలమ్‌కి సాహిత్య వార్తలు పంపేవారు క్లుప్తంగా రాసి పంపాలి ✦ సభలో పాల్గొన్న వారందరి పేర్లు రిపోర్టులో రాయకూడదు ✦ ఆలస్యమైన వార్తల్ని పంపించకూడదు ✦ తాజా వార్తలకే ప్రచురణకు అవకాశం ఉంటుంది ✦ మాకు చేరుతున్న కొన్నింటిలో తేదీలు రాయడం లేదు ✦ ఫొటో వెనుక తప్పని సరిగా ఆ కార్యక్రమం జరిగిన తేదీ, ప్రాంతం, జిల్లా పేర్లు రాయాలి.



మార్చి 4న విశ్వసాహితీ అంతర్జాతీయ సాహితీ సాంస్కృతిక సంస్థ మాతృభాషా దినోత్సవ సందర్భంగా తెలుగు భాషా సేవా పురస్కారం తంగిరాల చక్రవర్తికి ప్రదానం చేస్తున్న తెలుగు విశ్వవిద్యాలయం పూర్వ వైస్ ఛాన్సలర్ డా॥ ఆవుల మంజులత, డా॥ పోతుకూచి సాంబశివరావు తదితరులు



ఫిబ్రవరి 15న హైదరాబాద్ శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో ధర్మకేతనం సాహిత్యపీఠం, మానస ఆర్ట్ థియేటర్స్ ఆధ్వర్యంలో జరిగిన సభలో "విశ్వనాథ దర్శనం గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న డా. జె. బాపురెడ్డి. చిత్రంలో రఘుశ్రీ, ఆర్. వసునందన్, డా. కె. వి. రమణాచారి, ఆచార్య కె. యాదగిరి, గ్రంథకర్త ఎస్వీ రామారావు తదితరులు



ఫిబ్రవరి 22న విజయవాడలో జరిగిన సభలో సిహెచ్. వి. బృందావనరావు రచించిన కథల సంపుటి 'కొత్తతరం'ను ఆవిష్కరిస్తున్న ప్రసిద్ధ రచయిత విహారి. చిత్రంలో ప్రజాసాహితీ సంపాదకుడు కొత్తపల్లి రవిబాబు, ప్రముఖ కవి సింగంపల్లి అశోక్‌కుమార్, ఆవిష్కర్త విహారి, డా॥ కాకుమాను శ్రీనివాసరావు, రచయిత సి. హెచ్. వి. బృందావనరావు, మణికుమార్




హైదరాబాద్‌లోని రవీంద్రభారతి వేదికపై ఫిబ్రవరి 11న కేంద్ర సాహిత్య అకాడమీ, ఆం.ప్ర. ప్రభుత్వ సాంస్కృతిక శాఖ, లేఖిని సంస్థల ఆధ్వర్యంలో జరిగిన విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ 150వ జయంతి సభలో రచయిత్రి డా॥ జె. భాగ్యలక్ష్మి అనువదించిన రవీంద్రుని గీతాంజలి, నెలకూన గ్రంథాలను ఆవిష్కరిస్తున్న ప్రముఖ రచయిత్రి అబ్బూరి ఛాయాదేవి. చిత్రంలో రచయిత్రి డా॥ జె. భాగ్యలక్ష్మి, ఆచార్య కాత్యాయనీ విద్మహే, పోడూరి కృష్ణకుమారి



మార్చి 15న శ్రీ త్యాగరాయ గానసభ కళా సుబ్బారావు కళా వేదికలో శైలజామిత్ర రచించిన మినీ కవితా సంపుటి "అగ్నిపూలు" డా॥ రావి రంగారావు ఆవిష్కరిస్తున్న చిత్రం. ఇందులో పాల్గొన్న సాహితీ ప్రముఖులు బైసా దేవదాస్, శైలజామిత్ర, పోతుకూచి సాంబశివరావు, మసన చెన్నప్ప, ద్వానా శాస్త్రి, కళా వెంకట దీక్షితులు, లంకా సుబ్రహ్మణ్యం



ఫిబ్రవరి 20న సాహితీ స్రవంతి – భద్రాచలం ఆధ్వర్యంలో జరిగిన అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవ సభలో ప్రసంగిస్తున్న మాగంటి సూర్యం, చిత్రంలో ఎస్. ధనంజయుడు, మాల్యశ్రీ


కోడూరి విజయకుమార్

## కోడూరి విజయకుమార్‌కు ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు-2010

'ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు' కోసం 2010 సంవత్సరానికి 'అనంతరం' కవితా సంపుటిని ఎంపిక చేసినట్లు అవార్డు వ్యవస్థాపకులు డాక్టర్ రాధేయ ఒక ప్రకటనలో తెలిపారు. 'అనంతరం' కవితా సంపుటి రచయిత కోడూరి విజయకుమార్‌కు అనంతపురంలో జూలైలో జరిగే సభలో ఈ అవార్డును అందజేయనున్నట్లు ఆయన తెలిపారు. ఈ అవార్డు న్యాయనిర్ణేతలుగా ప్రముఖ కవులు విహారి, జింబో, అరసవిల్లి కృష్ణలు వ్యవహరించారని తెలిపారు. అవార్డు గ్రహీత కోడూరి విజయకుమార్ వరంగల్ వాస్తవ్యులని, హైదరాబాద్‌లో విద్యుత్‌శాఖలో ఇంజనీర్‌గా పనిచేస్తున్నారని, గతంలో 'వాతావరణం', 'అక్వేరియంలో చేప' కవితా సంపుటాలను ప్రచురించినట్లు తెలిపారు.



ఫిబ్రవరి 23-24 తేదీల్లో చెన్నై, మద్రాసు విశ్వవిద్యాలయంలో జరిగిన సదస్సులో ప్రసంగిస్తున్న డా॥ఆవుల మంజులత చిత్రంలో బి.శ్రీనివాస్, కె. యాదగిరి, తుమ్మపూడి కోటేశ్వరరావు, మాడభూషి సంపత్‌కుమార్, వి. రామచంద్ర, మేడపాటి మోహన్, జె.కె. రెడ్డి

## పెన్నా సాహిత్య పురస్కారం

పెన్నా రచయితల సంఘం "పెన్నా సాహిత్య పురస్కారం - 2011" ను అందజేయనున్నట్లు ఆ సంస్థ ప్రధాన కార్యదర్శి గుండాల నరేంద్రబాబు ఒక ప్రకటనలో తెలిపారు. ఈ పురస్కారానికి 2010-2011 సంవత్సరాలలో ప్రచురింపబడిన వచన కవితా సంపుటాలను మూడు ప్రతులను ఏప్రిల్ 11లోపు గుండాల నరేంద్ర బాబు, కేరాఫ్. కె.యన్.ఆర్ మున్సిపల్ హైస్కూల్, పెన్నా రచయితల సంఘం ప్రధాన కార్యదర్శి, డో.నెం .26-3-1007/ఎ, మల్లెతోట, ఆర్.టి.ఒ ఆఫీసు తూర్పువైపు, భక్తవత్సల నగర్, ఎ.కె. నగరు పోస్టు, నెల్లూరు - 524004 చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. ఉత్తమ కవితా సంపుటిగా ఎన్నికయిన వారికి రూ॥3000/-ల నగదు, జ్ఞాపికను బహుకరించనున్నట్లు తెలిపారు. ఇతర వివరాలకు 9493235992 ద్వారా సంప్రదించవచ్చును.



చెన్నై టి.నగర్‌లోని వేద విజ్ఞానవేదిక, ఆంధ్రా సోషల్ అండ్ కల్చరల్ అసోసియేషన్ సంయుక్తంగా నిర్వహించిన సాహితీ సమావేశంలో ఆస్కా ట్రస్ట్ మేనేజింగ్ ట్రస్టీ జె.కె.రెడ్డి 'తిక్కన సీత' గ్రంథాన్ని ఆవిష్కరించి తొలి ప్రతిని గ్రంథ ముద్రణ ద్రవ్యదాత విద్వాన్ చెన్నుపాటి రామాంజనేయులుకి బహుకరిస్తున్న దృశ్యం. చిత్రంలో పుస్తక సమీక్షకులు డా॥ బీరం సుందరరావు, సభాధ్యక్షులు చెన్నై మ్యూజిక్ అకాడమీ కార్యదర్శి డా॥ పప్పు వేణుగోపాలరావు, గ్రంథకర్త డా॥ కాసల నాగభూషణం, వేద విజ్ఞాన వేదిక అధ్యక్షులు భమిడిపాటి సుబ్రహ్మణ్యం


**FORM IV**

(Rule 8)

**UNDER PRESS AND REGISTRATION OF BOOKS ACT, 1867**
**STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS ABOUT MONTHLY -SHAITYA PRASTHANAM**

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | Hyderabad |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | V. Krishnaiah |
| 1 (a) Whether a citizen of India | : | YES |
| (b) If a foreigner, the country of origin | | |
| Address | : | H.No. 1-1-298/4, Street No. 1, Ashoknagar, Hyderabad - 500 020 |
| 4. Publisher's Name | : | V. Krishnaiah |
| 1 (a) Whether a citizen of India | : | YES |
| (b) If a foreigner, the country of origin | | |
| Address | : | H.No. 1-1-298/4, Street No. 1, Ashoknagar, Hyderabad - 500 020 |
| 5. Editor's Name | : | TELAKAPALLI RAVI |
| Nationality | : | INDIAN |
| 1 (a) Whether a citizen of India | : | YES |
| (b) If a foreigner, the country of origin | | |
| Address | : | H.No. 1-1-298/4, Street No. 1, Ashoknagar, Hyderabad - 500 020 |
| 6. Name and addresses of owner | : | V. Krishnaiah |
| 1 (a) Whether a citizen of India | : | YES |
| (b) If a foreigner, the country of origin | | |
| Address | : | H.No. 1-1-298/4, Street No. 1, Ashoknagar, Hyderabad - 500 020 |

I, V. KRISHNAIAH, here by declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/
V. KRISHNAIAH
Publisher

Date: 25.03.2011



Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# కందుకూరి వీరేశలింగం

(16.04.1848 - 27.05.1919)



నవ్యాంధ్ర వైతాళికుల్లో ప్రథములు. వితంతు పునర్వివాహాలను ఉద్యమంగా చేపట్టారు. మహిళల విద్యాభివృద్ధికి కృషి చేశారు. సాంఘిక దురాచారాలను ప్రతిఘటించారు. సాహితీరంగంలో గొప్ప కృషి జరిపారు. పలు పత్రికలు కూడా నడిపి, కొత్త రచయితలను ప్రోత్సహించారు. రచనల ద్వారా ఆచారాలకు కొత్తబాటలు వేసి, కార్యశూరుడని నిరూపించకుకున్నారు.

SA PR SVM02A126 RNI N0.APTEL/2004/18396 Postal Regd. No.H/SD/415/10-12



**If Un delivered please return to :** Prasthanam, C/o M.H.Bhavan, Plot No. 21/1, Azamabad
Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020 (A.P), Ph: 040-27660013, Cell: 9490099059



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO2A126 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |